

# కృష్ణావతారం

ఆదికాలంలో కాలనేమి అనే గొప్ప రాక్షసు డుండేవాడు. వాడికి నూరు చేతులూ, నూరు తలలూ ఉండేవి. చూడటానికి మహాభయం కరంగా, నూరు శిఖరాలు గల నల్లని పర్వతం లాగుండేవాడు. అసాధారణమైన బలానికి తోడు, వాడు తపస్సు చేసి బ్రహ్మ నుంచి గొప్ప వరాలు కూడా పొంది బాగా మదించాడు.

ఆ కాలంలో దేవదానవులకు తరుచు యుద్ధాలు జరుగుతూ ఉండేవి. ఒకప్పుడు దానవులు గెలిచేవారు, ఒకప్పుడు దేవతలు గెలిచేవారు. ఒకసారి యుద్ధంలో దేవతలు ఘనవిజయం సాధించి, దానవులను తరిమి కొట్టారు. అది తెలిసి కాలనేమికి మహాగ్రహం వచ్చింది. వాడు దానవనాయకు లందరినీ కూడగట్టి, వారిని యుద్ధానికి ప్రోత్సహించి, సైన్యాలను సమకూర్చుకుని, ఇంద్రుడి పైకి యుద్ధానికి వచ్చాడు. ఇంద్రుడి నాయ కత్వాన దేవతలూ, కాలనేమి నాయకత్వాన దానవులూ తలపడి, మహాభయంకరంగా యుద్ధం చేశారు.

ఆ యుద్ధంలో కాలనేమి ఇంద్రుడితో బాటు మిగిలిన దిక్పాలకులను కూడా చిత్తుగా ఓడించేశాడు. మూడు లోకాలూ అతని అధీనమయాయి. విష్ణుమూర్తి దేవ తలకు జరిగిన పరాభవాన్ని చూస్తూ కూడా, కాలనేమికి కాలపరిపాకం కాలేదని గ్రహించి ఏమీ చెయ్యకుండా ఊరుకున్నాడు.

కాలనేమికి మాత్రం విష్ణువును కూడా జయించాలని బుద్ధి పుట్టింది. అతను విష్ణు

కాలనేమికథ




మూర్తి వద్దకు వెళ్ళి, "నీవు మా మధు కైటభులను చంపావు, మా దైత్యులలో మణిలాటి హిరణ్యాకశిపుణ్ణి గోళ్ళతో చీల్చి చంపావు, మా బలిని పాతాళానికి తొక్కేసి, మూడు లోకాలూ ఆక్రమించావు. మా దైత్య స్త్రీల కన్నీరుతో దేవతలనే పాలాన్ని తడిపి కాపాడావు. అందుకు పగ తీర్చుకోవటానికి వచ్చాను," అన్నాడు.

"పోతరించి కారుకూతలు కూసిన మాత్రాన నీచేత ఏమవుతుంది? శూరుడైన వాడెక్కడైనా ప్రగల్భాలాడతాడా? బ్రహ్మ ఇచ్చిన వరాల మూలాన పొగరెక్కి ఒళ్ళు తెలియని పనులు చేశావు. పూర్వం



దానవులకు పట్టిన గతే నీకు పట్టబోతుంది. నిన్ను తప్పక చంపి దేవతలకు వారివారి స్థానాలు తిరిగి ఇప్పిస్తాను," అని విష్ణు మూర్తి అన్నాడు.

ఆ మాటలు విని కాలనేమి ఉగ్రుడై, ఘోరమైన తన గదను గరుత్మంతుడికి గురి చూసి విసిరి, పెద్ద పెడబొబ్బ పెట్టాడు. అది గరుత్మంతుణ్ణి, వజ్రాయుధం కొండను తాకినట్టు తాకింది. విష్ణువు నిర్ఘాంత పోయాడు. ఆయన గరుత్మంతుడి బాధ పోగొట్టి, తన శరీరంతోబాటు గరుడుడి శరీరం కూడా పెంచి, చేతిలోకి తన సుదర్శనచక్రం తీసుకుని కాలనేమి పై విసిరాడు. అది వెళ్ళి కాలనేమి తలలనూ, చేతులనూ తరిగిపారేసింది. ఆ రాక్షసుడి శరీరం మటుకు ఇంకా అలాగే నిలబడి ఉండటం చూసి గరుత్మంతుడు తన రెక్కలు విసిరి, గాలి పుట్టించి ఆ శరీరాన్ని పడిపోయేలాగుచేశాడు. ఇది చూసి కాలనేమి అనుచరులైన రాక్షసవీరులు బెదిరి, ఎక్కడివాళ్ళక్కడ కుక్కినపేలలాగా అయిపోగా, విష్ణువు వాళ్ళను చంపేశాడు.

రాక్షసులు చావగానే బ్రహ్మ, ఇంద్రుడూ, ఇతర దేవతలూ విష్ణువును చూడవచ్చి, ఆయనను ప్రశంసించారు.



"ఇంక మీకు రాక్షస భయం ఉండదు. ఎప్పటిలాగే మీరు మీమీ లోకాలను నిశ్చింతగా ఏలుకోండి. ఇక యజ్ఞాలు నిర్విఘ్నంగా సాగుతాయి. కాని దుష్టబుద్ధులైన రాక్షసులను మాత్రం ఒక కంట కనిపెట్టి ఉండండి," అని విష్ణువు వారితో చెప్పాడు.

తరవాత ఆయన పాలసముద్రానికి వెళ్ళి, తన శేషపాన్పు పైన పడుకుని యోగనిద్రలో మునిగిపోయాడు. విష్ణువు యోగనిద్రలో ఉండగానే కృతయుగం వెళ్ళిపోయింది, త్రేతాయుగం కూడా అంతానికి వచ్చింది. ఆ సమయంలో భూదేవి ప్రజాభారం హెచ్చయిందని ఆక్రోశించింది. ఆ ఆక్రోశం విని దేవతలు బ్రహ్మ పద్దకు వెళ్ళి, బ్రహ్మను వెంటబెట్టుకుని విష్ణువును చేరి, ఆయనను యోగనిద్ర నుంచి మేల్కొలిపారు.

విష్ణువు మెల్లిగా కళ్ళు తెరిచి దేవతలను చూసి, "ఏం ఇలా వచ్చారు? మీరంతా సుఖంగా ఉన్నారు గద? లోకాలు రాక్షస బాధ లేకుండా సుఖంగా ఉన్నాయి గద?" అని కుశలప్రశ్నలు వేశాడు.

బ్రహ్మ చేతులు జోడించి, "మహానుభావా, రాజుల మధ్య ఏ విధమైన శత్రుత్వాలూ లేవు. సత్యమూ, ధర్మమూ



స్థిరంగా ఉన్నాయి. యాగాలు చక్కగా జరుగుతున్నాయి, దేవకార్యాలూ, పితృకార్యాలూ తృప్తికరంగా సాగుతున్నాయి, ఎవరికీ రోగాలూ, రొప్పులూ లేవు. మానవులు సంపూర్ణాయువు కలిగి ఉన్నారు. ఏ పట్టణం చూసినా, పల్లె చూసినా అపారమైన జనసంఖ్య కలిగి ఉన్నది. జనభారం మొయ్యలేనో అని భూదేవి ఆక్రోశిస్తున్నది. ధర్మహాని కలగకుండా ఈ భూభారాన్ని తగ్గించే ఉపాయ మేదో నీవే చూడాలి. నీవు మేరుపర్వతానికి దయచేసి, అక్కడ మా అందరికీ కర్తవ్యబోధ చెయ్యవలసిందని నా ప్రార్థన," అన్నాడు.



విష్ణువు లేచి కూర్చుని తన అభరణాలు చక్కజేసుకుని, బట్ట బిగించుకుని, నిల బడి, తన శంఖచక్రాది ఆయుధాలు ధరించి, గరుడవాహనారూఢుడై క్షణంలో మేరుపర్వ తానికి వచ్చాడు. ఆ పర్వతం మీద పూర్వం విశ్వకర్మ నిర్మించిన దివ్యమైన సభ ఒకటి ఉన్నది.

ఆ సభలో ఉన్నతాసనం మీద మహా విష్ణువు కూర్చున్నాడు. మిగిలిన వారంతా ఉచితాసనాలపైన కూర్చున్నారు. ఆ సభకు యక్షులూ, గంధర్వులూ, సిద్ధులూ, విద్యా ధరులూ, నాగులూ మొదలైన వారంతా కూడా వచ్చారు.

అక్కడికి భూదేవి పుట్టెడు దిగులుతో వచ్చింది. ఆమెను చూడగానే అందరూ ఒక్కసారిగా మాట్లాడారు. వాయుదేవుడు చెయ్యెత్తి ఆ కలకలమంతా వారించి, భూదేవితో ఆమె అక్కడికి వచ్చిన పని ఏదో చెప్పమన్నాడు.

"మీకు తెలియని దేమున్నది? రాజులు అపారంగా పెరిగిపోయారు. ప్రజాభారంతో కృశించిపోతున్నాను. ఈ భారం తగ్గకపోతే నేను బతకలేను. ఈ విష్ణుమూర్తి తలచు కుంటే ఈ పని జరుగుతుంది. పెద్దలు మీరంతా కూడా ఉన్నారు," అన్నది భూదేవి విచారంగా.

భూదేవి చెప్పిన ఈ మాటలు విని సభలోవాళ్ళు తమలోతాము మాట్లాడుకుని, బ్రహ్మదేవుడితో, "భూదేవి బాధ మాన్పటం మన కర్తవ్యం. నీవు పెద్దవాడవు, సృష్టి కర్తవు," అన్నారు.

అప్పుడు బ్రహ్మ లేచి సభాసదులతో ఇలా చెప్పాడు:

"ఒకనాటి సాయంకాలం నేనూ, కశ్యప మహామునీ సముద్రతీరాన కూర్చుని తత్వ విచారం జరుపుతూండగా, చంద్రోదయం వేళ గంగాసంగమం చేత పొంగిన సము ద్రుడు ఆకాశమంత ఎత్తులేచి, మేము



కూర్చున్న ప్రదేశమంతా ఆక్రమించటమే గాక మమ్మల్ని కూడా తడిపాడు. నేను నవ్వుతూ, "ఇదేం పని? శాంతించు!" అన్నాను. వెంటనే సముద్రుడు శాంతించి, మానవరూపం ధరించి, గంగతో సహా మా ఎదట నిలిచాడు. అప్పుడు నేను భవిష్యత్తు గురించి ఆలోచించి, "సముద్రుడా, ఇలా రాజసం చూపావు గనక భూమిపై రాజువుగా జన్మించు. నేను చెప్పగానే శాంతించావు గనక శంతను డనే పేరుతో, ఈ గంగనే భార్యగా చేసుకుని జీవించు," అన్నాను. సముద్రుడు. నాకు నమస్కరించి, "పర్వపువేళా, గాలి ఎగ వీచినప్పుడూ, చంద్రోదయవేళా పొంగటం నా స్వభావ లక్షణం. అందులో దుర్బుద్ధి ఏమీ లేదు. అలాటప్పుడు నన్ను శపించటం ధర్మమా?" అని దీనంగా అన్నాడు. 'నాయనా, లోకహితం కోరి నేనీ మాట అన్నాను. నీవు పవిత్రమైన భరతవంశంలో పుట్టు. ఈ గంగకు వసువులను కని, వారికి వసిష్ఠు డిచ్చిన శాపం తీర్చు. తరవాత సత్యవతి అనే ఆమెకు వంశోద్ధారకులైన కొడుకు లిద్దరిని కని జన్మ చాలించు,' అని చెప్పాను. ఆ శంతనుడి కొడుకైన విచిత్రవీర్యుడికి ధృతరాష్ట్రుడూ, పాండుడూ అనే కొడుకులు కలుగుతారు. ధృతరాష్ట్రుడికి నూరుగురు కొడుకులూ, పాండుడికి అయిదుగురు కొడుకులూ పుట్టుతారు. ఆ నూరుగురికీ, అయిదుగురికీ మధ్య రాజ్యకాంక్ష కారణంగా మహాయుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో భూమిపై గల రాజులందరూ నశిస్తారు. అనేక లక్షల ఏనుగులూ, గుర్రాలూ, సైనికులూ పీనుగులై పోతారు. భూభారం తగ్గిపోయి ఈ భూదేవి సుఖపడుతుంది. కలహకారకుడైన కలి అంశ ధృతరాష్ట్రుడి భార్య గర్భానా, యముడి అంశ పాండుడి భార్య గర్భానా పుట్టటం జరుగుతుంది. ఇంకా అనేకమంది

దేవముఖ్యుల అంశలు వేరువేరు మానవ జన్మలెత్తుతాయి."

బ్రహ్మ చెప్పిన ఈ మాటలు విని అందరూ ఆయనను అభినందించారు. అదే సమయంలో నారదుడా సభకు విచ్చేశాడు. ఆయన వీణ వాయిస్తూ పాట పాడి, విష్ణువునూ, దేవతలనూ రంజింపజేసి, విష్ణువుతో, "దేవా, భూమిపై గల రాజకులాన్ని నిర్మూలించటానికి ఈ దేవతలందరూ తల పెట్టిన ఈ పని నీవు పూనుకోకుండా ఎలా సఫలమవుతుంది? భూమి పైన నీ అంశ ఒకటి అవతరించాలి, మిగిలినవారి అంశలకు ఉత్సాహప్రేరణ లివ్వాలి, అప్పుడు గాని ఈ దేవకార్యం నెరవేరదు. అది అలా ఉండగా, ఈ దేవాంశలతో పుట్టేవారికెవ్వరికీ సాధ్యంకాని పని మరొకటి ఉన్నది. దాన్ని గురించి హెచ్చరించటానికే నేనింత త్వరగా ఇక్కడికి వచ్చాను. అదేమిటంటే, దేవాసురయుద్ధంలో నీచేత చచ్చిన రాక్షసులందరూ భూమి పైన మానవజన్మ లెత్తి ఉన్నారు. రాముడి చేత రావణుడు చచ్చిన అనంతరం ఆ రాక్షసుడి మేనల్లుడూ, మధువనే వాడి కొడుకూ అయిన లవణు డనే వాడు, రాముడి ఆజ్ఞపై శత్రుఘ్నుడి చేత చంపబడ్డాడు. శత్రుఘ్నుడు అక్కడి మధువనాన్ని నిర్మూలించి, మధుర అనే పేరు



గల మహానగరం నిర్మించాడు. అక్కడ అనేక తరాల రాజులు పాలించి దాన్ని వృద్ధికి తెచ్చారు. ఇప్పుడక్కడ ఆనాటి కాలనేమి, కంసుడనే పేరుతో ఉగ్రసేను డనే భోజ వంశపురాజుకు కొడుకుగా పుట్టి ఉన్నాడు. వాడికి పూర్వజన్మ దుర్వాసన ఇంకా అలాగే ఉన్నది. వాడు తన తండ్రిని చెరలోపెట్టి, తానే రాజై కూర్చున్నాడు. ఇలాగే అనేక మంది రాక్షసులు తిరిగి భూమిపై పుట్టారు. కాలనేమి మిత్రులందరూ కంసుడికి భృత్యులుగా పుట్టి కాళిందీతీరానా, బృందావనం లోనూ, మధురాపురం లోనూ, ఇతరచోట్లా ఉన్నారు. కొందరు రాక్షసులు ప్రాగ్జ్యోతిషంలో పుట్టి నరకాసురుడికి సహాయంగా ఉన్నారు. ఈ రాక్షసుల నందరినీ చంపటానికి నీవు మానవావతార మెత్తవలిసి ఉన్నది," అన్నాడు.

విష్ణువు ఈ మాటలు విని, బ్రహ్మ కేసి తిరిగి, "నేను అలాగే అవతార మెత్తుతాను. సృష్టికర్త నన్నెక్కడ పుట్టమంటాడు?" అన్నాడు.

దానికి బ్రహ్మ, "వరుణుడి యజ్ఞధేనువులను కశ్యపుడు కాజేశాడు. కశ్యపుడి భార్యలైన అదితీ, సురభీ వాటిని వరుణుడికి తిరిగి ఇయ్యకుండా అడ్డపడ్డారు. వరుణుడు నాతో ఈ సంగతి మొరపెట్టుకోగా, నేను కశ్యపుణ్ణీ, అతని భార్యలనూ మానవ జన్మ లెత్తమని శపించాను. ఆ కశ్యపుడు వసుదేవుడై పుట్టి కంసుడి ఆవులకు అధిపతిగా ఉన్నాడు. కశ్యపుడి భార్యలు దేవకీ, రోహిణీ అనేవాళ్ళుగా పుట్టి, వసుదేవుడికి భార్యలై ఉన్నారు. నీవు నీ అంశను రెండుగా విభజించి, వసుదేవుడి భార్యలిద్దరి యందూ ప్రవేశపెట్టు," అని విష్ణుమూర్తితో అన్నాడు.

విష్ణుమూర్తి తృప్తిపడి, సభ చాలించి, అందర్నీ పంపేసి, తాను తన స్వస్థానమైన పాలసముద్రానికి తిరిగివెళ్ళాడు.





# కృష్ణావతారం

మేరుపర్వతం మీద జరిగిన దేవసభ నుంచి బయలుదేరిన నారదుడు తిన్నగా మధురా నగరానికి వెళ్లాడు. ఆయన కంసుడి మందిర ద్వారాన్ని చేరేసరికి, ప్రతీహారులు వచ్చి ఆయనను లోపలికి తీసుకు వెళ్లారు. నారదుడికి కంసు డెదురువచ్చి, ఎంతో వినయంతో అర్ఘ్య పాద్యాదులిచ్చి, పూజించి, తృప్తి కలిగించాడు.

అప్పుడు నారదుడు కంసుడి కేసి చూస్తూ, అందరూ వింటూండగా, "నాయనా, నేను తీర్థయాత్రలు చేసుకుంటూ, అలా మేరుపర్వతం కేసి వెళ్లాను. అక్కడ బ్రహ్మ మొదలైన దేవతలంతా పెద్ద సభ చేసి ఉన్నారు. ఏదో పెద్ద చర్చ జరుగు తున్నదని గ్రహించి నే నక్కడ కాస్సేపు నిలిచాను. ఏం చెప్పమన్నావు? వాళ్లందరూ చేరి, నిన్ను చంపడానికి పెద్ద పథకం ఆలోచిస్తున్నారు. మీ పెత్తండ్రి కూతురు దేవకీ దేవి ఉంది, చూశావూ? ఆవిడకు కలిగే ఎనిమిదో బిడ్డ నీకు మృత్యువు కలిగిస్తుందట. దేవతల కందరికీ రక్షకు డైనవాడే అందుకు గాను అవతార మెత్తుతున్నాడట! కనక, నాయనా, నీ ప్రాణానికి హాని కలగకుండా తగిన ఏర్పాటులు చేసుకో. ధర్మ మార్గం తప్పకుండా సుఖంగా జీవించు. నీ మేలు కోరినవాణ్ణి గనక ఈ ముక్క నీ చెవిని వేసి పోదామని వచ్చాను," అని తన దారిన తాను వెళ్లిపోయాడు.

తరవాత కంసుడు తన భృత్యులను చూసి చిన్న నవ్వు నవ్వి, "తెలివిగల

2. కృష్ణ జననము



వాడని ఈ నారదు డంటే చాలా స్నేహ భావంతో ఉంటూ వచ్చాను. కాని నా బోటి సత్వవంతుణ్ణి ఇలా భయపెడతాడా? నేను బ్రహ్మను గాని, మరే దేవతలను గాని లక్ష్య పెడతానా? నాకే కోపం వచ్చిందంటే ఒక్క పిడికిటి పోటుతో దిక్కులనూ, దిక్పాలకులనూ అణగార్చగలను! కొండ లన్నీ అవిసినా, సముద్రాలన్నీ ఇంకినా నేను చలించేవాణ్ణి కాను! అది అలా ఉంచండి. ఈ నారదుడికి కాలూ, నోరూ క్షణం ఊరుకోవు. ప్రతి చోటికీ పోతూ, నోటికి వచ్చినదెల్లా అంటూ, ఒకరిమీదికి ఒకరిని రెచ్చగొట్టి, తంపులు పెట్టి తమాషా



చూస్తాడు. ఆయన ఎలాటివాడైతే మనకేం? యదుకులం నుంచి అపాయం ఉందని ఆయన అంటున్నాడు గనక, మన అరిష్ట కేశి ప్రలంబ దేనుక పూతన కాళీయు లాది గాగల వాళ్ళందరూ చాలా జాగరూకులై ఉండి, నా శత్రువులను నాశనం చెయ్యాలి. తల్లిగర్భాన ఉన్నవాళ్లను సైతం వదిలి పెట్టరాదు. నేనుండగా నా భృత్యులెవరూ దేనికీ భయపడవలసిన పనిలేదు. అండగా నేనున్నాను గనక అందరూ స్వేచ్ఛగా సంచరించవచ్చు," అన్నాడు.

తరవాత కంసుడు సభ చాలించి తన భవనానికి వెళ్ళి, తన ఆప్తులను రహస్యంగా సమావేశపరచి, "ఇవాళ నుంచి మన దేవకీదేవికి అనేక మంది పరిచారికలను ఏర్పాటు చేసి, కాపలా ఉంచండి. వాళ్లు వసుదేవుణ్ణి కూడా ఒక కంట కనిపెట్టి ఉండాలి. దేవకికి ఎప్పుడు గర్భధారణ జరిగినదీ, ఏయే నెలలు జరిగేదీ, ఎప్పుడు పురుడు వచ్చేదీ నాకు ఎప్పటి కప్పుడు తెలియజేస్తూ ఉండాలి. విసుగూ విరామమూ లేకుండా అహోరాత్రాలు కాపలా సాగాలి. దీనికంతకూ కారణమేమిటో ఎవ్వరికీ తెలియకూడదు," అని వారిని హెచ్చరించాడు.



ఈ లోపల నారదుడు మధురానగరం నుంచి విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి, తాను ఏ విధంగా కంసుడి మనసులో విషబీజం నాటినదీ, దాని ఫలితంగా కంసుడు తల పెట్టిన నీచకార్యాలూ తెలిపాడు.

నారదుడు వెళ్ళినాక విష్ణుమూర్తి, కంసుడి జాగ్రత్తలన్నీ తప్పించుకుని తాను అవత రించే ఉపాయాలాలోచించసాగాడు. ఆయ నకు ఒక పాత వృత్తాంతం జ్ఞాపకం వచ్చింది. అదేమిటంటే — పాతాళంలో కాలనేమి కొడుకులు ఆరుగురుండే వారు. వారు చావు లేకుండా బ్రహ్మ నుంచి వరాలుపొందాలని తపస్సు ప్రారంభించారు. ఆ సమయంలో మూడు లోకాలకూ తానే ఆధిపత్యం వహించి ఉన్న హిరణ్యకశిపుడు, ఈ సంగతి తెలిసి, "కులశ్రేష్ఠుణ్ణి నేనుండగా మరొకరి నుంచి వరాలు పొందాలని ఆశిస్తారా? మిమ్మల్ని కని పెంచిన తండ్రిచేతనే చావండి," అని శపించాడు.

ఈ సంగతి స్మరణకు రాగానే విష్ణువు యోగమాయను పిలిచి, "నీ వల్ల ఒక పని కావలసి ఉన్నది. షడ్గర్భులనేవాళ్ళు, కాల నేమి కొడుకులు ఆరుగురున్నారు. వాళ్ళను ఒక్కొక్కణ్ణీ తీసుకుపోయి దేవకిగర్భంలో ప్రవేశ పెట్టు. వాళ్ళు పుట్టిన వెంటనే కంసుడు చంపేస్తాడు. దేవకికి కలిగే ఏడవ







శక్తిగా అభిషేకిస్తాడు. నీలమేఘచ్ఛాయా, నిండు చంద్రుడులాంటి ముఖమూ, ఎనిమిది చేతులలో శార్ఙ్గమూ, చక్రమూ, గదా, ఖడ్గమూ, పద్మమూ, మధుకలశమూ, ముసలమూ, శూలమూ ధరించి, దివ్యాభరణ భూషితవై, నీలంరంగు గల పట్టు చీర ధరించి, సమస్త దేవతల చేతా పూజింపబడతావు," అన్నాడు.

యోగమాయ సరే నన్నది. ఆమె మహిమచేత దేవకీదేవి షడ్గర్భలను, ఒకరి తరవాత ఒకరుగా, తన గర్భాన ధరిస్తూ వచ్చింది. ఆమెకు ప్రసవకాలం సమీపించినప్పుడల్లా కంసుడి మనుషులు వెళ్ళి కంసుడితో ఆ సంగతి చెప్పేవాళ్లు. కంసుడు వచ్చి, పుట్టిన బిడ్డను పుట్టినట్టే తీసుకుపోయి, దాని కాళ్లు పట్టుకుని రాతి మీద కొట్టి, మహాదారుణంగా చంపేసేవాడు.

దేవకీదేవి ఏడవసారి గర్భిణిగా ఉండగా యోగమాయ ఆ గర్భాన్ని తీసుకుపోయి, గోకులంలో ఉన్న రోహిణి గర్భాన ప్రవేశపెట్టింది. రోహిణికి నెలలు నిండి, పూర్ణచంద్రుడితో సమానమైన పుత్రుడు కలిగాడు. గర్భసంకర్షణం చేత పుట్టిన కారణాన ఇతను సంకర్షణు డయాడు. ఇతనే బలరాముడు.

గర్భాన్ని రోహిణికి మార్చు. దేవకికి ఏడవ సారి కంసుడి భయంచేత గర్భస్రావమయిందని అందరూ అనుకుంటారు. ఆ బిడ్డ నాకు అన్నగా రోహిణి గర్భాన జనిస్తాడు. తరవాత దేవకీదేవి అష్టమగర్భంలో నేను ప్రవేశించేటప్పుడే, నువు కంసుడి గోవులకు పాలకుడైన నందుడి భార్య యశోద గర్భంలో ప్రవేశించు. మన మిద్దరమూ అర్ధరాత్రి వేళ జననం పొంది స్థానాలు మారుదాం. అటు తరవాత కంసుడు నిన్ను రాతి కేసి కొట్టి చంప యత్నించినప్పుడు ఆకాశానికి ఎగిరిపో. అటు తరవాత ఇంద్రుడు నీ కెదురు వచ్చి, తీసుకు పోయి, నిన్ను ఆది





బలరాముడు పుట్టిన అనంతరం దేవకి ఎనిమిదోసారి గర్భం ధరించింది. అందులో విష్ణుమూర్తి అంశ ప్రవేశించింది. ఆ నాడే గోకులంలో నందుడి భార్య యశోద కూడా గర్భం దాల్చింది.

తొమ్మిది మాసాలు గడిచి, పదోమాసం ప్రవేశించింది. శ్రావణ మాసంలో, కృష్ణ పక్షంలో, అష్టమినాటి అర్ధరాత్రి, అయిదు గ్రహాలు ఉచ్చలో ఉండగా విష్ణువు అంశన కృష్ణుడు దేవకీగర్భాన జననం పొందాడు. ఆ క్షణంలో దేవకీ వసుదేవుడూ తప్ప ఇతరు లెవరూ మేలుకుని లేరు. కావలి వాళ్ళు గాఢనిద్రలో మునిగి, శవాలలాగా పడి ఉన్నారు.

తనకు కొడుకు కలిగాడన్న భావం ఎలాగో మనస్సులో కలిగి వసుదేవుడు దేవకి ఉన్న చోటికి ఆ అపరాత్రివేళ గబగబా వచ్చాడు. అక్కడ చంద్రోదయమైనట్టుగా ఉన్నది. పుట్టిన బిడ్డ, దట్టమైన వెంట్రుకలూ, మేఘ వర్ణమూ కలిగి, ఒంటిన ఎక్కడా ఒక్క మరకగాని, మాలిన్యం గాని లేకుండా, కళ్ళు విచ్చి చుట్టూరా పరికించి చూస్తూ అద్భుతంగా కనిపించాడు.

"దుర్మార్గుడైన కంసుడు ఈ శిశువుకు హాని చేస్తే ఎలా చూడగలను? ఇప్పుడే



వీణ్ణి తీసుకుపోయి ఎక్కడైనా దాస్తాను," అనుకున్నాడు వసుదేవుడు తన మనస్సులో.

దేవకి ఆ బిడ్డను ప్రసవవేదన లేకుండా కన్నది. అయితే ఇక చేయవలసిందేమిటో ఆమెకు తోచలేదు. వసుదేవుడు తనకు కలిగిన ఆలోచన దేవకికి చెప్పి, ఆమె తొడ మీద ఉన్న బిడ్డను తన చేతులలోకి తీసుకుని, చప్పున అంతఃపురం దాటివచ్చి, తిన్నగా నందుడి ఇంటికి వెళ్లాడు. అక్కడ యశోద అంతకుముందే ఆడపిల్లను కని ఒళ్లు తెలియని నిద్రలో ఉన్నది. వసుదేవుడామె పక్కన తన కొడుకును పడుకోబెట్టి, ఆమె కన్న ఆడ పిల్లను ఎత్తుకుని తన



ఇంటికి తిరిగి వచ్చి, ఆ బిడ్డను దేవకి పక్కలో పడుకోబెట్టి, కంసుడి వద్దకువెళ్ళి, దేవకి బిడ్డను కన్నదని చెప్పాడు.

కంసుడు కంగారుగా నిద్రలేచి, జుట్టు ముడీ, బట్ట కుచ్చెళ్ళూ ఊడుతూ, గబగబా వచ్చి, పురిటి గది వాకిట నిలబడి, "బిడ్డ నిలాతే, తే!" అని కేకలు పెట్టాడు.

దేవకి ఆ బిడ్డను తన రొమ్ముకు అదుము కుంటూ, "అన్నా, ఆగ్రహించకు. ఈసారి నేను కన్నది ఆడపిల్ల. నీలాటి లోకైకవీరుణ్ణి ఈ ఆడ బిడ్డ ఏం చెయ్యగలదు? దీన్ని రక్షించు. ఇంతకు ముందు పుట్టిన వాళ్ళంతా మగవాళ్ళు కావటంచేత, వాళ్ళ వల్ల నీకేం కీడు కలుగుతుందో అని నిన్ను నేను వారించలేదు. ఈసారి నా పైన దయ ఉంచు," అన్నది.

కంసుడు వినిపించుకోకుండా పురిటింట జొరబడుతుంటే కావలి ఉండే స్త్రీలందరూ హాహాకారాలు చేశారు. అతను బలాత్కా రంగా దేవకి చేతుల నుంచి బిడ్డను లాగేసి, ఎప్పటిలాగే రాతి కేసి కొట్టి చంపటానికై పై కెత్తాడు. పై కెత్తిన ఆ బిడ్డ కంసుడి చేతిలో నుంచి జారి, పై కెగిరి, ఆదిశక్తి రూపం ధరించి ఆకాశాన నిలిచి, పానకలశం నుంచి మధువు తాగి, అట్టహాసంగా నవ్వుతూ,



కంసుణ్ణి చూసి, "ఓరీ దుర్మార్గుడా! నన్నిలా రాతి కేసి కొట్టి చంపాలని చూసి నందుకు, నిన్ను నీ ఘోరశత్రువు చంపి నప్పుడు నేను మృత్యుదేవత రూపంలో వచ్చి, నీ ప్రాణాలూ, నెత్తురూ ఆహరిస్తాను. ఇంకెందుకు మిడిసి పడతావు? నిన్ను చంపే వాడు పుట్టనే పుట్టాడు," అంటూ అదృశ్య మయిపోయింది.

వెంటనే కంసుడు దేవకీదేవి వద్దకువచ్చి, చేతులు జోడించి, "అమ్మాయీ, ప్రాణ భయంతో నేను మహా పాపం చేశాను. నీ బిడ్డలందరినీ చంపి, నీకు గర్భశోకం కలిగించాను. ఇంతకూ నా ప్రయత్నం నెర

వేరనే లేదు. తుచ్ఛమైన మనుష్య యత్నంతో బ్రహ్మలిఖితాన్ని మార్చటం సాధ్యమా? మనం నిమిత్త మాత్రులమే గాని, అసలు చంపేదీ, పోషించేదీ కాల పురుషుడు. అందుచేత నీ దుఃఖాన్ని విడిచి పెట్టు, నీ కాళ్ళూ, చేతులూ పట్టుకుని వేడుకుంటున్నాను," అన్నాడు.

దేవకీదేవి ఏడుస్తూ, "నా కీ శోకం రాసి పెట్టి ఉండగా నువ్వు మాత్రం ఏం చెయ్యగలవులే, అన్నా!" అని కంసుణ్ణి ఓదార్చి పంపేసింది.

తెల్లవారకుండానే వసుదేవుడు నందగోపుడి ఇంటికి వెళ్ళాడు. నందుడు కొడుకు పుట్టిన సంబరంలో ఉన్నాడు. అతన్ని చూసి వసుదేవుడు, "ఆహా, ఎంత చక్కని కొడుకును కన్నావయ్యా! అదృష్టవంతుడివి. నీ కొడుకుతో సహా మీ స్వస్థానమైన గోకులానికి వెళ్ళు. అక్కడ నా భార్య రోహిణికి పుట్టినవాడున్నాడు. వాణ్ణి నీ పెద్ద కొడుకుగానూ, వీణ్ణి నీ రెండో కొడుకుగానూ చూసుకుంటూ పెంచు. ఆ అడవి ప్రాంతంలో వీళ్ళను జాగ్రత్తగా, ఏమరుపాటు లేకుండా పెంచు సుమా. పాపిష్ఠివాడు కంసుడు దేవకి కన్న పిల్లలందర్నీ పొట్టన పెట్టుకున్నాడు. రోహిణి కన్న ఆ నలుసే దక్కింది. వాణ్ణి పెంచేభారం నీదే. కంసుడు పిల్లల్ని చంపమని నియోగించిన పూతనకు పసిపిల్లల కోసం వెతకటమే పని. తెల్లవారక ముందే బయలుదేరి వెళ్ళి మందను చేరు. నువ్వీ నగరానికి కప్పం కట్టటానికిగదా వచ్చావు? ఆ పని కూడా తీరి పోయింది గనక మరి ఆలస్యం చెయ్యకుండా ప్రయాణంకా," అన్నాడు.

వసుదేవుడిలా అనగానే నందుడు పురిటి పాపణ్ణి తొట్టెలో పెట్టి మోయించుతూ, తన భార్యతో సహా, పొట్టి ఎద్దులు కట్టిన బండి మీద ఎక్కి వేగంగా మందలుండే చోటికి చేరుకున్నాడు.





# కృష్ణావతారం

కాళిందీ తీరాన ఒక గొప్ప గొల్లపల్లె ఉన్నది. ఆవులతోనూ, దూడలతోనూ, ఎద్దులతోనూ, రకరకాల పనులలో మునిగి ఉన్న గోపస్త్రీల తోనూ, పురుషులతోనూ అక్కడ చాలా సందడిగా ఉన్నది. వసుదేవుడి ప్రేరణతో నందుడు సకుటుంబంగా ఆ వ్రేపల్లెకు వచ్చి చేరాడు. అక్కడి వృద్ధులలో ముఖ్యులు అతనికి ఎదురువెళ్ళి, అభినందించారు. నందుడు కూడా వారితో కుశలప్రశ్నలు జరిపి, అందరినీ పేరుపేరా పలకరించి, వారి వెంట వ్రేపల్లె చేరుకున్నాడు. వృద్ధ గోపికలు నందుడి ఇంటికివచ్చి యశోదకూ, ఆమె కన్న బిడ్డకూ పురిటి వేడుకలన్నీ జరిపారు. రోహిణి వచ్చింది. నందుడామెకు తగిన మర్యాదలు చేశాడు.

గోపికలకు ఎంతో ముద్దుగా కృష్ణుడు గోపకులంలో పెరుగుతున్నాడు. కొన్ని రోజులు గడిచాయి.

గర్భస్రావాలూ, శిశుహత్యలూ చెయ్య టానికై కంసుడు అనేకమంది రాక్షసులను నియోగించాడు. వారిలో కెల్లా గొప్పది, పూతన అనేది మహాభయంకరమైన ఆకారం కలది. ఆమె రాత్రివేళ పసిపిల్ల లను వెతుక్కుంటూ వస్తూ, నందగోపుడి బండి కింద, తల్లిపక్కన పడుకుని వున్న కృష్ణుణ్ణి చూసి ఆగింది. పిల్లవాడు మంచి తేజస్సుకలిగి, అద్భుతంగా కనబడు తున్నాడు. అందరు పిల్లల్లాగా లేడు. ఒక వేళ కంసుణ్ణి చంపటానికి పుట్టినవాడు వీడేనేమో!

## 3. బాలకృష్ణ లీలలు



ఇలా అనుకోగానే పూతనకు కోపావేశం వచ్చేసింది. ఆ రాక్షసి పళ్ళు పటపటా కొరికింది. దాని మిడిగుడ్ల నుంచి నిప్పులు రాలాయి. కనుబొమలు ముడుచుకున్నాయి. నుదుట చెమట పట్టింది. ఊపిరి తీవ్రంగా ఆడింది. ఆమె ఆ పిల్లవాణ్ణి తల్లి పక్క నుంచి బలాత్కారంగా లాక్కుని, విషం పూసి ఉన్న తన చనుమొనలు వాడి నోట కుక్కింది. కృష్ణుడు కెవ్వున ఏడుస్తూ పూతన చనుమొనలు నోట గట్టిగా పట్టుకుని, బలంకొద్దీ పాలతోపాటు పూతన శరీరం లోని సప్తధాతువులనూ పీల్చాడు. నిజానిక తను పూతనను మించిన రాక్షసుడు. అందు



చేత పూతన అతి వికారమైన ఆర్తనాదం చేసి, విరుచుకు పడిపోయింది.

ఆ భయంకరమైన కేకకు మందలోగల గోపకులంతా తుళ్ళిపడి నిద్రలేచారు. కృష్ణుడు ఏడ్చినప్పుడే యశోద నిద్రలేచింది. ఆమె మేలుకుంటూనే పక్కలో పిల్లవాడు కనపడక పోయేసరికి భయపడి, నందుణ్ణి కేక పెట్టింది. నందుడు వచ్చేసరికి మిగిలిన గోపులుకూడా రానే వచ్చారు. వారికి భయంకరమైన పూతనకళేబరం కనిపించింది, దాని ఒడిలో పిట్టలాగా వాలి ఉన్న కృష్ణుడు కూడా కనిపించాడు.

యశోదానందులు తమ కొడుకును చూస్తూనే, "అయ్యో నా తండ్రీ!" అంటూ చప్పున వచ్చి బిడ్డను ఎత్తుకున్నారు.

"ఏమిటిది? ఈ రాక్షసి ఇక్కడికెలా వచ్చింది? అది వచ్చి బిడ్డనిలా చేస్తుంటే నువ్వెలా చూస్తూ ఊరుకున్నావు?" అని నందుడు తన భార్య నడిగాడు.

"బిడ్డకు కడుపునిండా పాలిచ్చి నిద్ర పుచ్చాను. దివిటీ వెలుగుతున్నది. చాలా సేపు మేలుకునే ఉండి, ఒక్క క్షణంపాటు కన్నుమూశాను. అదికూడా ఎంతో సేపు కాలేదు. ఈ రాక్షసిముండ ఎలా వచ్చిందో, పిల్లవాణ్ణి ఏం చెయ్యబోయిందో, ఇదేం





మాయో నాకేమీ తెలీదు. ఈ రాక్షసిముండకు చిక్కికూడా నా బిడ్డ ఏ కీడూ లేకుండా తిరిగి నాకు దొరికాడు. వీడికి వెయ్యేళ్ళాయుస్సు," అన్నది యశోద.

కృష్ణుడికి గొప్ప గండం తప్పిందని గోపకులంతా ఎంతో సంతోషించి, పూతన కళేబరాన్ని దూరంగా లాగేశారు. నందుడు తన కొడుకు నెత్తుకుని, వాడికి దిష్టితీసి, ఏవో మంత్రాలు చదివి, ఆశీర్వదించాడు.

రోజులు గడుస్తున్నాయి. కృష్ణుడు క్రమంగా పెరుగుతున్నాడు.

ఒకనాడు వసుదేవుడు తన పురోహితుడైన గర్గుడనే బ్రాహ్మణుణ్ణి అతిరహస్యంగా గోకులానికి పంపాడు. ఆయన వచ్చి రోహిణి కొడుకుకూ, యశోద కొడుకుకూ జాత కర్మలు జరిపి, ఆ పిల్లలిద్దరికీ రాముడూ కృష్ణుడూ అని పేరుపెట్టి, ఎంత రహస్యంగా వచ్చాడో అంత రహస్యంగా తిరిగి వెళ్ళిపోయాడు.

నందుడి ఆనందానికి మితిలేదు. అతను బ్రాహ్మణులను పిలిపించి, షడ్రసోపేతంగా భోజనాలుపెట్టి, గోవులూ, వస్త్రాలూ దానం చేశాడు. పెద్ద ఉత్సవం జరిగింది. గోకులంలో గల బంధువులందరికీ నందుడు బట్టలు పెట్టాడు. గోపూజ చేశాడు. గోవాటం



అలంకరింప చేశాడు. గోపకాంతలు యశోదను, పండంటి కొడుకును కన్నందుకు అభినందించారు. అలాగే గోపకులు కూడా నందుణ్ణి అభినందించారు.

అక్కడ మధురాపురంలో కంసుడికి పూతనకు పట్టినగతి తెలియ వచ్చింది. అతని భృత్యులయిన రాక్షసులు జరిగినదంతా అతనికి తెలిపారు. నందగోపుడి కొడుకు పైన కంసుడి అనుమానం కేంద్రీకృతమయింది. అతనికి కొంత కంపరం కూడా కలిగింది. అందుచేత అతను తన భృత్యులైన రాక్షసులను అనేకమందిని పిలిచి, నందగోపుడి కొడుకును తుద



ముట్టించమని హెచ్చరించాడు. ఆ రాక్షసులలో శకటు డనేవాడు వెళ్ళి నందుడి సొంత బండిలో అదృశ్యరూపంలో ప్రవేశించి అవకాశం కోసం నిరీక్షించసాగాడు.

యశోద కృష్ణుణ్ణి నిద్రపుచ్చి, ఆ బండి కిందనే పక్క పరిచి పడుకోబెట్టి, మిగిలిన గోపస్త్రీలతో సహా నదిలో స్నానంచేసి రావటానికి బయలుదేరి వెళ్ళింది. ఆమె వెళ్ళిన కొద్దిసేపటికి బిడ్డ మేలుకున్నాడు. దగ్గిర ఎవరూ లేకపోయేసరికి, రెండు చేతులూ నోట్లో కుక్కుకుంటూ ఏడ్చి, ముఖమంతా కళ్ళకాటుకతో కూడిన తడి చేసుకున్నాడు. కాళ్ళు తన్నుతూ ఎగిరెగిరి పడ్డాడు. అలా కాళ్ళు తన్నుకుంటూనే బండిని ఒక కాలితో తన్నేసరికి, బండి పక్కకు పడి ఛిన్నాభిన్నమయింది.

ఇంతలో యశోద స్నానం చేసి వచ్చి, పిల్లవాణ్ణి గురించి తొందరపడుతూ, గబగబా వచ్చింది. బోల్తాకొట్టి బద్దలైపోయిన బండి ఆమెకు కనిపించింది. ఆమె వెంటనే కెవ్వున అరిచి, పిల్లవాణ్ణి ఎత్తుకుని రొమ్మున అదుముకుంటూ, "అమ్మయ్యో, బిడ్డ నిద్రపోతున్నాడుగదా అని స్నానానికి వెళ్ళాను గాని, ఇప్పుడు మీ నాన్న వచ్చి, ఇదిచూసి, ఎన్నిమాటలంటాడో ఏమో. ఈ బండి ఇలా ఎందుకయిందో ఎవరు చెబుతారు? భర్త



అడిగితే నేనేం చెప్పాలి?" అనుకుంటూ, ఆమె కృష్ణుణ్ణి తొడ మీద కూర్చోబెట్టుకుని పాలివ్వసాగింది.

ఇంతలో నందగోపుడు ఒళ్ళంతా దుమ్ము కొట్టుకుని, జుట్టంతా చెదరి, చేత కణుపుల కఱ్ఱ పట్టుకుని, గోపులతో కబుర్లు చెబుతూ అక్కడికి వచ్చాడు. వస్తూనే ఊడి పోయిన చక్రాన్నీ, విరిగి పోయిన ఇరుసునూ చూసి ఒక్కసారిగా వణికిపోయాడు. ఎందుకంటే, తన కొడుకు ఎప్పుడూ ఆ బండి కిందనే గదా పడుకుంటాడు? బండి ఇంత ఛిన్నాభిన్నమై విరిగి పోయిందిగదా, బిడ్డ ఏమైనట్టు?

మరుక్షణమే అతను తన భార్యనూ, ఆమె దగ్గిర పాలుతాగుతూ, ముఖాన సంతోషమూ, చూపులు తల్లి ముఖానా గల కృష్ణుణ్ణి చూశాడు. నందుడి ప్రాణం కుదట పడింది. అతను గుండె నిమురుకుంటూ, "బండి ఇలా అయిపోయిందేం?" అని భార్యను అడిగాడు. ఏవైనా ఎద్దులు బండిని పడదోసి తొక్కాయో, లేక పెద్ద గాలి వీచిందో అని నందుడికి అనుమానం కలిగింది. "ఏమైతేనేం లే? బిడ్డడు క్షేమంగా ఉన్నాడు. అంతేచాలు," అన్నాడు మళ్ళి నందుడు.



యశోద గద్గదకంఠంతో, "అసలు తప్పంతా నాదేలే. బిడ్డ నిద్రపోతుంటే, ఈ బండి కింద పక్కమీద పడుకోబెట్టి, దగ్గిరేగదా అని ఏటికి వెళ్ళి, స్నానం చేసి తిరిగి వచ్చి చూతును గదా ఇలా అయింది. అదృష్టం బాగుండి అబ్బాయి కీ గండం గడిచింది," అన్నది.

ఇంతలో కొంతమంది కుర్రవాళ్ళు అక్కడికి వచ్చి, "ఏమమ్మోయి, మేమిక్కడ ఆడుకుంటుంటే, మీ కృష్ణుడు కాలు చాచి ఒక్క తోపు తోసేసరికి, బండి ఇలా విరిగి పక్కకు పడింది. ఎంత చిత్రమో చూసుకోండి," అన్నారు.



యశోదానందుల ఆశ్చర్యానికీ ఆనందానికీ మేరలేదు. వాళ్ళు తమ కొడుకును ముద్దాడి, ఇంత మట్టి తీసి పిల్లవాడికి దిగదుడిచి పారేశారు. తన కొడుకును కాపాడుతూ ఉండమని నందుడు దేవతలకు దణ్ణం పెట్టుకున్నాడు. ఈలోపల పదిమందీ చేరి, జరిగిన సంగతి విని, చూసి, నిశ్చేష్టులైపోయారు. తరవాత, విరిగి పోయిన బండిని తిరిగి కూర్చి, బాగుచేసి, ఎప్పటిలాగా చేసేశారు.

రోజులు గడుస్తున్నాయి. కృష్ణుడు పెరుగుతున్నాడు. బోరగిలపడి, మంచం అంచులకు దేకుతున్నాడు. కితకితలు పెడితే కిల



కిలా నవ్వి కేరింతలు కొడుతున్నాడు. నిలబెట్టి వేళ్ళు పట్టుకోవటానికిస్తే తప్పటడుగులు వేస్తున్నాడు. చప్పట్లు కొట్టి, "దా, దా," అని పిలిస్తే దగ్గిరికి వస్తున్నాడు. చూసినవాళ్ళు అతన్ని ఎత్తుకుని ముద్దాడకుండా ఉండలేరు. అందుకని మువ్వలు గలగల్లాడిస్తూ, దొంగచూపులు చూస్తూ ఎటో పారిపోతాడు. చూసేవాళ్ళు పరమానందం చెందుతారు.

తల్లి కృష్ణుడికి వెన్న గోరుముద్దలుగా చేసి రోజూ తినిపించేది. చేతి జిడ్డూ, మూతి జిడ్డూ, ఒళ్ళంతా పట్టించేది. ఉదయం పూట తల్లి కడుపు నిండా వెన్నపెట్టి గృహకృత్యాలు చూసుకోవటానికిపోతే, తప్పటడుగులు వేసుకుంటూ వెనకనే వెళ్ళేవాడు. ఆడవాళ్ళ దగ్గిరికిపోయి వెన్న పెట్టమని బతిమాలేవాడు. ఎంత పెట్టినా ఇంకా పెట్టమని వేధించుకు తినేవాడు. వెన్న చిలికేవాళ్ళ దగ్గిరికివెళ్ళి, కవ్వం తాడు పట్టుకుని కవ్వం ఆడకుండా చేసేవాడు, జుట్టుముడి ఊడతీసేవాడు, చీరెకొంగు పట్టుకుని లాగేవాడు.

"వెన్న పెడతాను గాని కాస్త ఆట చూపించరా, బాబూ," అని గోపికలు అడిగితే మువ్వలూ, మొలగంటలూ గలగలలాడుతూ ఆడేవాడు. గోపికలు చల్ల

చెయ్యటం మానేసి చూసి ఆనందించే వాళ్ళు. అస్తమానమూ గోకులంలో ఉండే ఇళ్ళన్నీ తిరిగేవాడు. వాడితో వేగలేక గోపికలు నలుగురూ నాలుగు పక్కలనుంచి, "పట్టుకోండి, పట్టుకోండి," అంటూ ఒకరినొకరు హెచ్చరించుకుంటూ వచ్చి, పట్టుకుని యశోదకు అప్పజెప్పేవాళ్ళు.

కాలం గడుస్తున్న కొద్దీ కృష్ణుడి ఆటలు మారి పోతున్నాయి. గోపబాలకు లందరూ బలరామ కృష్ణుల చుట్టూ చేరేవాళ్ళు. అందరూ కలిసి ఒక దండులాగా వ్రేపల్లె అంతా చెడ తిరిగేవాళ్ళు. కృష్ణుడు కుండల్లోనూ, చట్లలోనూ ఉండే పాలూ, నెయ్యీ తాగేవాడు, తాగినంత తాగి, మిగిలినది నేలమీద పోసి, కాళ్ళతో మట్టగించేవాడు. అలాటి చిలిపి చేష్టలు చెయ్యకుండా ఆపటం ఎవరివల్లా అయేదికాదు. పాలసముద్రం మథించగా వచ్చిన అమృతాన్ని మోహిని దేవతలకు పంచినట్టుగా, కృష్ణుడు గోపికల ఇళ్ళలోని పాలూ, మీగడా తాను తినటమే గాక తన వెంట ఉన్న కుర్రకారు కంతకూ పంచిపెట్టేవాడు. ఉట్లు తెంచేవాడు, బానలు దొర్లించేవాడు, కడవల్లో పాలు సగం తాగి వాటిని చల్లతో మళ్ళీ నింపేవాడు. నెయ్యి తీసుకుపోయి నిప్పులోపోసి భగ్గున మంటలు లేపేవాడు. పెరుగులో పాలూ, వెన్నలో పెరుగూ, చల్లలో నెయ్యీ కలిపేసేవాడు. దూడలను విప్పి ఆవుల పాలు తాగెయ్య నిచ్చేవాడు. కొన్నిటిని కట్లు విప్పి వదిలేసేవాడు. కావళ్ళ తాళ్ళు తెంచేసేవాడు. పిల్లలందరినీ చేర్చి ఆటలాడేవాడు. ప్రతి ఆటలోనూ అందరినీ ఓడించి, వీపు పగిలేటట్టు కొట్టేవాడు, ఒక్కొక్కడి వీపునా ఎక్కి మోయించుకునేవాడు. ఆటల్లో ఎంత మొనగాణ్ణయినా ఏడిపించుకు తినేవాడు.

ఈ విధంగా కృష్ణుడు గోకులాన్నంతా ఒక కొలిక్కి తెస్తుంటే గోపకులు ఏం చెయ్యాలో తోచక నిశ్చేష్టులైపోయారు.





# కృష్ణావతారం

రానురాను కృష్ణుడు చేసే అగడాలు మితి మీరిపోయి గోపకులను భీభత్సంలో ముంచెత్తాయి. ఏం చెయ్యాలో తోచక వాళ్ళు దిమ్మరపోయి చూస్తూ ఊరుకున్నారు. గోపికలు మాత్రం అలా ఊరుకోలేదు. వారంతా కూడ బలుక్కుని, ఒక జట్టుగా యశోద వద్దకు వెళ్ళి ఆమె పైన విరుచుకు పడ్డారు.

"ఓయమ్మా, నువు కాగా ఒక గారాబు కొడుకును కన్నావు! వాడితో మేము పడే పాట్లు కూడా కాస్త చూడు మరీ! పోనీ చిన్నవాడు గదా అని చూస్తూ ఊరుకున్నందుకు ఇలాగా చేసేది? మీరు గొప్పవాళ్ళయితే అవుదురు గాక! అసలు తప్పంతా నీదే. నువే వాణ్ణిలా తయారుచేసి మా మీదికి పంపకం చేశావు. నీ గుండెలో జాలి అనేది ఏకోశానా ఉన్నట్టులేదు. నీ ముద్దులకొడుకు ఏం చేశాడో చెవులారా విను—" అని ఒకతె అంటుండగా మరొకతె ముందుకువచ్చి—

"ఏం చేశాడా? మా ఇంటో జొరబడి పది కడవల నెయ్యీ, పెరుగూ, పాలూ తాగేశాడు! 'కో' అంటూ కడవలన్నీ బోర్లా తోసేసి పారిపోయాడు. మా వంటి పేద వాళ్ళ కింత కన్న ఏం కావాలి? మే మెలా బతికేట్టు?" అన్నది.

అంతలో మరొక గోపిక ముందుకు వచ్చి, "ఓ తల్లీ, నీ కొడుకు రాక్షసుడు! నేను బానల్లోనూ, ఉట్ల మీదా వెన్న పెట్టి ఉంచితే, అంత వెన్నా తిని, బానలు పడ




దోసి, ఉట్లు తెంచాడు. మేము వీడితో ఎలా వేగాలి ? ఎక్కడికి పోవాలి ?" అన్నది.

మరొకతె అమితమైన కోపంతో, చేతులు తిప్పుకుంటూ, నాట్యంచేస్తున్న దాని లాగా యశోదను సమీపించి, "వెనకింట్లో ఎన్నో నేతిబానలున్నాయి. తలుపుకు తాళంపెట్టి ఉంచాను. నీ మాయదారి కొడుకు వచ్చి పడి, తలుపును తాళంతో సహా విరగదన్ని, లోపల జొరబడ్డాడు. నేను హడలిపోయి పారి పోయాను. నెయ్యంతా తాగాడో, ఏం చేశాడో, ఏమో ! వెళ్ళి చూద్దునుగదా, ఒక్క బొట్టు నెయ్యి లేదు. దేశం గొడ్డుపోయిందా, తల్లీ ? ఈ పాట్లు పడేకన్న ఈ పల్లెకు అగ్గి పెట్టేసి, మా పశువులతో ఇంకో చోటికి పోయి నిక్షేపంగా బతుకుతాం !" అన్నది.

మరొకతె వెనక నుంచి అందర్నీ నెట్టుకుంటూ ముందుకు వచ్చి, "అదంతా ఏం వింటావు ? మా యింట జరిగిన ఘోరం విను. నీ రాలుగాయి కొడుకు మా యింట జొరబడి పదికుండల నెయ్యీ, పాలూ, పెరుగూ ఇల్లంతా ఈ లోతున విదజిమ్మి, ఖాళీకుండలు చేతులా, కాళ్ళా తన్ని, వంట కుండల్లో ఉన్న అన్నమూ, కూరలూ పాయసమూ కుర్రకారు చేత తినిపించి, కుండలన్నీ పగలగొట్టి, దూడలను ఆవుల వద్దకు విడిచాడు. ఇంటో ఏడిచే బిడ్డకు ఒక్క చుక్క వెన్న గాని, పాలు గానీ, పెరుగు గాని లేదు," అన్నది.

మరొకతె ఏడుపు గొంతుతో, "నా మొగుడూ, పిల్లలూ తినాలని మోజుపడితే, పాలూ, పిండీ, కలకండా, వెన్నా కలిపి అట్లు వేసి, కుండల దొంతరలో పెట్టాను. నీ కొడుకు వచ్చి కుండలు దించి అన్నీ తినేశాడు. వాడి కడుపులో ఏం భూతాలున్నాయో ఏమో ! నిజం చెబితే నా మొగుడు నమ్ముతాడా, తల్లీ ?" అన్నది.

ఈ విధంగా ఒకరిని మించి ఒకరు యశోదకు కృష్ణుడి పైన చాడీలు చెప్పారు.



ఒకరింట బానలో కలిపి పెట్టి ఉంచిన పిండీ, పంచదారా తినేశాడు, అంతటితో పోక, కుండల్లో ఉన్న అన్నమంతా తినే శాడు; ఇవి చిన్నపిల్లలు చేసే పనులేనా? మరొకరి ఆవులనూ, దూడలనూ అడవిలోకి తరిమేశాడు; ఆ సమయానికి యింటి యజమానీ, కొడుకులూ ఇంట లేరు. అన్నీ అమానుషమైన పనులే! అందరూ అన్నీ చెప్పి, ఆఖరు మాటగా, "మే మెక్కడికన్నా వెళ్ళిపోతాం. నువ్వూ, నీ కొడుకూ ఉట్టి కట్టుకు ఊరేగండి!" అని తేల్చి చెప్పారు.

అందరి మాటలూ విని యశోద ప్రతి ఒక్కరినీ ఓదార్చి, "మీకు కలిగిన నష్ట మంతా నేను అచ్చుకుంటాను, విచారించ కండి. కాని మీరు లేకుండా మా కెలా గడు స్తుంది? బిడ్డ ఇలాంటి రాకసప్పనులు చేశాడో, లేదో. మీ రేమో చేశాడంటున్నారు. మీ రైనా అబద్ధా లెందుకు చెబుతారు? ఇక చూడండి, పిల్లవాణ్ణి ఎలా అదుపులో వుంచుతానో! మీ రేమాత్రమూ సందే హించక మీ ఇళ్ళకు వెళ్ళిపొండి," అని గోపికలను పంపేసింది.

తరవాత ఆమె కృష్ణుణ్ణి చేర దీసి, "ఎందుకురా, బాబూ, వాళ్ళ ఇళ్ళకూ, వీళ్ళ ఇళ్ళకూ పోతావు? నీకు వెన్నా,



పాలూ కరువయాయా? నే నిస్తాను, పాలు తాగు. గుక్కెడు తల్లిపాలకు పుట్టెడు ఇతర పాలు సమంకావంటారు. అయినవాళ్ళతో ఇలా పేచీలు తెస్తా వెందుకురా?" అంటూ తన కొడుక్కు పాలిచ్చి, చెక్కులు నొక్కి, తల వాసనచూసి, ముద్దులు పెట్టుకుని, చివరకు, "పొద్దున్నే లేచి నీ అల్లరి పనులు వినటంతోనే సరిపోయింది. ఇంత పనికి మాలినవాడివి, నిన్నే మనాలిరా? విడిచి పెట్టానంటే మళ్ళీ పోయి యాగీలు తెస్తావు. దుష్టుణ్ణి దయతలచరాదు," అంటూ కృష్ణుణ్ణి రెక్క పట్టుకుని బండి సమీపానికి తీసుకుపోయి, పెద్ద రోలుకూ, పిల్లవాడి





కలూ పరిగెత్తుకుంటూ వచ్చి, జరిగినది చూశారు. కొందరు గోపికలు యశోద వద్దకు పరిగెత్తి వెళ్ళి, "ఏం రాక్షసిబిడ్డమ్మా నీ కొడుకు! వాణ్ణి ఎక్కడైనా రోటికి కట్టు తారా? వాడు కాస్తా వెళ్ళి, ఇంతేసి చెట్లను విరిచి మీద పడేసుకుంటున్నాడు! చాలా తెలివిగా చేశాననుకుంటున్నావు కాబోలు, వెళ్ళి, బిడ్డకు ప్రమాదం రాకుండా చూసుకో!" అని చెప్పారు.

యశోద కీ మాట వినగానే గుండె ఝల్లు మన్నది. "అమ్మయ్యో!" అని కేకపెట్టి, పైట జారిపోయేదీ, జుట్టుముడి ఊడి పోయేదీ కూడా తెలియకుండా పరుగు తీసింది. గోపికలు ఆమె వెంట పరిగెత్తారు.

ఈలోపుగా నందుడూ, ఇతర గోపకులూ అక్కడికి వచ్చి, విరిగిపడి ఉన్న చెట్ల మధ్య కృష్ణుడు, మేఘాల మధ్య చంద్రుడి లాగా, నవ్వుముఖంతో కూర్చుని ఉండటం చూశారు. నందుడు చప్పున వచ్చి, పిల్లవాడి నడుముకు కట్టి ఉన్న పలుపుతాడు విప్పి, కుర్రవాణ్ణి ఎత్తుకుని, "వీడి నడుముకీ తాడేమిటి? తాటికి రోలేమిటి? దీన్ని ఈడ్చు కుంటూ వీ డింత దూరం ఎలా వచ్చాడు? ఇంత పెద్ద మానులు ఎలా విరిగిపడ్డాయి? ఏమిటిదంతా?" అని అడిగాడు.

నడుముకూ పెయ్యతాడు కట్టి, బెత్తం ఒకటి తీసుకుని, "కదిలావా, మొత్తుతాను. ఎలా కదులుతావో నేనూ చూస్తాను," అని తన ఇంటిపనులలో నిమగ్నురాలయింది.

కొంచెం సేపు గడిచింది. కృష్ణుడు తాడు పట్టి రోటిని తన దగ్గిరికి ఈడ్చుకున్నాడు. పశువుల ఆవరణ ద్వారం సమీపంలో రెండు మద్దిచెట్లు దగ్గిర దగ్గిరగా ఉన్నాయి. కృష్ణుడు రోటిని ఒడుపుగా ఆ మద్దిమాను లకు చేరబెట్టి, తాను వాటి మధ్యగా దూరి అవతలికి వెళ్ళి, బలం కొద్దీ లాగాడు. రెండుమానులూ పెళపెళా విరిగి పడి పోయాయి. అనేకమంది గోపకులూ, గోపి







యశోద వచ్చి తానే కుర్రవాణ్ణి రోటికి తాడుతో కట్టానని చెప్పింది. నందుడు తన కొడుకు బలసత్వాలకు లోలోపల ఆశ్చర్యపోయి, పరమానందం చెందాడు.

ముసలి గోపకులకు ఇదేమీ అంతుచిక్కలేదు. "ఒక గాలి లేదు, పిడుగుపాటు లేదు, ఏ ఏనుగూ ఇటు కేసి రాలేదు, పోనీ సేనలన్నా రాలేదు; ఇలాటి సబబైన కారణాలేమీ లేకుండా, చంటివెధవ ఇంతేసి చెట్లను పడగూల్చాడు గదా, ఇంతంటె ఉత్పాతం ఏం కావాలి? ఇదేమన్నా మొదటి సారి కనకనా? రాక్షసిముండ పూతన అమాంతం చచ్చింది. అంత లావు బండి అకారణంగా ముక్కలుముక్క లయింది. ఇక్కడ ఉండటమే ప్రమాదంగా వుంది. కాని పుట్టి పెరిగిన ఈ చోటు విడిచి ఎక్కడికని పోతాం?" అని తమలో తాము అనుకుంటూ తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

రోజులు గడిచాయి. బలరాముడికి ఎనిమిదేళ్ళూ, కృష్ణుడికి ఏడేళ్ళూ నిండాయి. వాళ్ళు తమ యీడు గోపబాలకులతో కూడి ఆడుతూ, దూడలతో ఆడుకుంటూ ఉత్సాహంగా కాలం గడుపుతున్నారు. చేతుల్లో చద్దిచిక్కాలూ, చెరణాకోలలూ తీసుకునే వాళ్ళు; కాళ్ళకు కర్రచెప్పులు తొడిగేవాళ్ళు; పాట్టి జుట్టు ఎగరేసుకుంటూ బయలుదేరేవాళ్ళు; చుట్టుపక్కల ఉండే భూముల్లో గట్టిగా కేకలు పెడుతూ తోడేళ్ళను తరిమేవాళ్ళు; సరదాగా పాటలు పాడేవాళ్ళు; కూతలు పెట్టేవాళ్ళు; చెట్లెక్కేవాళ్ళు; తేనెపట్లు కనిపిస్తే తేనె తాగేవాళ్ళు; తెచ్చుకున్న అన్నాలు తినేవాళ్ళు. ఆ యాదవబాలకులకు జీవితం మధురమైన ఆటవిడుపు లాగా సాగింది.

ఇలా కాలం గడుస్తుండగా ఒకనాడు కృష్ణుడు బలరాముడితో ఇలా అన్నాడు:

"అన్నా, మనం ఈ వనం లోనే పుట్టాం, ఇనాళ్ళూ ఇక్కడే పెరిగాం. మందలూ,



గోపకులూ ఇంత కాలంపాటు ఒకేచోట ఉండటం మంచిదా? మేత బీళ్ళన్నిటినీ పశువులు మట్టగించేశాయి. చెట్లు నరుకుడు పడి ధ్వంసమయాయి. చెరువులూ, మడుగులూ రొంపిగుంట లయాయి. కూరలూ, కట్టెలూ కావాలంటే చాలా దూరం వెళ్ళవలిసి వస్తున్నది. కనక మనం ఈ ప్రదేశం వదిలిపెట్టి బృందావనానికి వెళ్ళిపోదాం. అది చాలా అందమైన వనమని చెబుతారు. అక్కడ గోవర్ధనగిరి ఉన్నదట. దాని పైన భాండీర మనే పేరుగల మహావటవృక్షం ఉన్నదట. బృందావనం మధ్యగా కాళిందీ నది ప్రవహిస్తూ వుంటుందట. అక్కడికి



వెళ్ళిపోయి సుఖంగా బతుకుదాం. ముసలివాళ్ళు ఈ చోటు విడవటానికి ఇష్టపడకుండా ఉన్నారు. వాళ్ళను అదరగొట్టటానికి ఒక ఉపాయం చేస్తాను, చూడు."

ఇలా అంటూండగానే కృష్ణుడి శరీరం నుంచి వందల సంఖ్యలోనూ, వేల సంఖ్యలోనూ తోడేళ్ళు గుంపులు గుంపులుగా బయలుదేరి, చుట్టుపక్కల ప్రదేశమంతటా పరిగెత్తసాగాయి. గోపాలకులకూ, గోవులకూ గాభరా పుట్టిపోయింది. ఈ తోడేళ్ళ దౌష్ట్యం అసాధారణంగా కనబడింది. వాటిని వేటాడటం గోపకులకు ఎంతమాత్రమూ సాధ్యం కాలేదు. పులులను సైతం నిలవ వేయగల ఆబోతులను అవి చంపాయి. కాచే వాళ్ళు తల తిప్పి చూసే లోపుగా ఎటునుంచో వచ్చి అవి దూడలను కాజేసుకుపోయాయి. ఈ ఉత్పాతానికి తోడు రాత్రి సమయాలలో పులుల రంకెలూ, సింహగర్జనలూ, వినిపించ సాగాయి. పెద్దపెద్ద పందులు వచ్చి, ఎక్కడబడితే అక్కడ గుంటలు తవ్వుతున్నాయి.

గోపకుల పెద్దలంతా చేరి చర్చించారు. ఇదివరకు జరిగిన ఉత్పాతాలకే బెదిరి కూడా, వాళ్ళు ఉన్న చోటు విడిచిపెట్టలేక వాటిని సహించి ఊరుకుంటే, ఇప్పుడు



వాటన్నిటినీ మించిన ఉత్పాతం వచ్చి పడింది. ఏం చెయ్యాలి?

"బృందావనం చాలా దివ్యంగా ఉంటుందని అందరూ తెగచెబుతున్నారు. కాని అక్కడ కూడా దుర్గమ ప్రాంతాలున్నాయట; వాటిలో రాక్షసు లుంటారట. ఏమైనా, ఏదో ఒకటి చెయ్యాలి. ఎక్కడికైనా వెంటనే పోవలిసిందే గాని ఇక్కడ ఒక్క క్షణం ఉండటం సాధ్య పడదు. క్షణక్షణానికీ ఏదో నష్టం జరుగుతూనే ఉన్నది," అని గోప వృద్ధులు తేల్చారు.

వారందరూ ఈ విధంగా అనుకుంటూండగా అక్కడికి నారదుడు వచ్చి, నంద గోపుణ్ణి పిలిచి, దూరంగా తీసుకుపోయి, "మీరందరూ కలిసి బృందావనం వెళ్ళాలనుకుంటున్నారు. కాని అక్కడ రాక్షసులున్నారనీ, నీ కొడుకుకు ప్రమాదం చేస్తారేమోననీ నువు భయపడుతున్నావు. అవునా? విను. నీ కొడుకును మనుష్య మాత్రుడుగా భావించకు. అతను రాక్షసులను చంపటానికే అవతారమెత్తిన ఆది నారాయణుడు. కృష్ణుడూ, బలరాముడూ కూడా నారాయణాంశన పుట్టిన వాళ్ళే. కృష్ణుణ్ణి చంపటానికి రాక్షసులు పూతన రూపంలో వచ్చీ, బండిలో దాగీ, మద్దిచెట్ల రూపం ధరించీ, అతన్ని చంపలేకపోగా, తామే అతని చేతిలో చచ్చారు. నువు ప్రత్యక్షంగా చూశావుకద? అందుచేత, ఏ మాత్రమూ సంకోచం లేకుండా మీ అందరి నివాసమూ బృందావనానికి మార్చు. తప్పక మేలు కలుగుతుంది," అని చెప్పాడు.

నారదుడు కృష్ణుణ్ణి కూడా చూసి, అదే మాట చెప్పి వెళ్ళిన తరవాత, నందగోపుడు మిగిలిన గోపకులతో, "మనమంతా బృందావనానికి తరలిపోతున్నాం. అదే నిశ్చయం. అందరూ అందుకుగాను ప్రయాణసన్నాహం ప్రారంభించండి," అన్నాడు.





# కృష్ణావతారం

## 5. విషవృక్ష నిర్మూలనం

గోకుల మంతా ఒక్కసారి కదిలింది. అందరూ ప్రయాణసన్నాహంలో మునిగి పోయారు. బరువులు బళ్ళకెత్తారు. నేతులూ, పాలూ గల కుండలను భద్ర పరిచారు. సంచులలో ధాన్యమూ, బియ్యమూ మొదలైనవి పోసి కట్టారు. రక రకాల తాళ్ళూ, పలుపులూ, కవ్వాలూ, కొడవళ్ళూ, కత్తులూ, గంటలూ, పశువుల నోళ్ళు తెరవటానికి ఉపయోగించే సాధ నాలూ మొదలైన పనిముట్లన్నీ జాగ్రత్త పరిచారు. కోలాహలంగా ప్రయాణసన్నాహం పూర్తి అయింది.

బలశాలులు పశువులను తోలుకుంటూ ముందు బయలుదేరారు. మందల వెన కగా బళ్ళు నడిచాయి. వాటి వెనక మను షులు కదిలారు. వయసులో ఉన్న ఆడ వాళ్ళంతా ఒక జట్టుగా నడుస్తూ, పరాచకా లాడుకుంటూ, వినోదం పొందారు. కుంటి, గుడ్డి, ముసలివాళ్ళు నడవలేకుండా ఉంటే వాళ్ళకు యువకులు సహాయపడ్డారు.

ఈ విధంగా గోకులం బృందావనానికి వచ్చి చేరింది. గోపాలకులలో పెద్దలైన వాళ్ళు ఇళ్ళు కట్టుకోవటానికి స్థలాలు నిర్ధారణ చేశారు. బళ్ళన్నీ ఒక వరసలో అర్ధచంద్రాకారంలో దిగాయి. కొందరు గుడిసెలు నిర్మించారు. కొందరు లతా గృహాలనే తాత్కాలికంగా ఇళ్ళుగా వాడు కున్నారు. కొందరు చెట్ల కింద కాపరాలు పెట్టేశారు. కొందరు కంప పేర్చి దొడ్లు నిర్మించారు. ఒక్క రోజు గడిచే సరికల్లా



బృందావనం గోపకులకు స్వస్థలమయి పోయింది. రోజులు గడిచేకొద్దీ, చక్కగా అలంకరించుకు తిరిగే గోపికలతోనూ, ఆడావుడిగా తిరిగే గోపాలకులతోనూ, సందడి చేసే గోవులమందలతోనూ ఆ ప్రదేశానికి ఎక్కడలేని కళా వచ్చింది.

నానాటికీ గోపకులంవాళ్ళ సంపద పెంపొందుతున్నది. మందలు పెద్దవవుతున్నాయి. జీవితం హాయిగా నడుస్తున్నది. కృష్ణుడు పదమూడేళ్ళ వాడయాడు.

వేసవి వచ్చింది. నిక్షేపంగా ఉన్న పశువులకు రకరకాల తెగుళ్ళు పుట్టుకొచ్చాయి. అవి వణుకుతూ, నిలబడలేకపోయాయి. నోట నురుగులు కక్కాయి. వాటి మెడలు వాలబడిపోయాయి. గిట్టలు పగిలి పురుగులు బయటికొచ్చాయి.

ఈ తెగుళ్ళకు గోపాలకులు మంత్రాలూ, మందులూ, మాకులూ, అన్నీ ప్రయోగించి చూశారు. కాని ప్రయోజనం లేకపోయింది. ఇక ఏం చెయ్యాలో వారికి తోచలేదు. ఈ తెగుళ్ళు యమునానదీ ప్రాంతపు అరణ్యాలలోని సమస్త మృగ పక్షి కీటకజాతులకూ వచ్చాయి, వాటి నుంచి గోపకులకు కూడా రోగాలు తగిలాయి. అందరూ భయంకరమైన వ్యాధిలక్షణాలతో బాధపడసాగారు.

నందుడూ, యశోదా, రోహిణీ కూడా రోగగ్రస్తులయారు. ఆ స్థలం వదిలిపెట్టిపోతేగాని బతకలేమని కృష్ణుడికి తోచింది. అతను బలరాముడితో మాట్లాడి, కొన్ని మందలను తోలుకుని ఒక కోసుదూరం వెళ్ళి అక్కడ ఆగాడు. అతనిలాగే మరి కొందరు గోపకులు కూడా అలాగే చేశారు. అలా వెళ్ళిపోయిన గోవులకూ, మనుషులకూ వ్యాధి సోకలేదు.

నందుడు మాత్రం కదలననేశాడు. "ఇది మన చోటు. ఇక్కడ ఏమి వచ్చినా భరించవలిసిందేగాని, చుట్టాలందరినీ వేసు



కుని ఎక్కడికని వెళ్ళేది?" అన్నాడతను. నంద యశోదా రోహిణులు రోగంతో తీసుకుంటూ ఇలా మూర్ఛించేసరికి ఏం చెయ్యాలో కృష్ణుడికి తెలియలేదు.

ఈ గోకులంలో విదేహదేశం నుంచి వచ్చిన ఒక ముసలిగోపకు డొక డున్నాడు. అతను గోపప్రముఖులతో, "చూడండి, నాయనలారా! మనం పశువుల నాశ్రయించి బతుకుతున్నవాళ్ళం. పశుపతి శివుడు. శివార్చన చేస్తేనేగాని మనకీ కష్టాలు తీరవు. ఇలా దిగాలుపడి చూస్తూ కూర్చుంటే ఏమీ లాభంలేదు. తెలిసిన బ్రాహ్మణులను పిలిపించి శివార్చన జరిపించండి," అన్నాడు.

పెద్దవాడు చెప్పిన మాటపైన గురి ఉంచి గోపకులు సమర్థులైన బ్రాహ్మణులను పిలిపించి శివపూజకు అవసరమైన ఏర్పాట్లన్నీ చేశారు. ఈశ్వరుడికి వారం రోజులపాటు పగలూ, రాత్రీ అభిషేకమూ, అర్చనా, నైవేద్యమూ జరిగాయి. ఏడు రోజులూ నిర్విఘ్నంగా శివార్చన జరగగా, ఏడోనాటి మధ్యాన్నం ఒక సద్బ్రాహ్మణుడికి పూనకం వచ్చింది. ఆ పూనకంలో ఆ బ్రాహ్మణుడు వెర్రిగా నవ్వుతూ, భయంకరంగా నాట్యం చేస్తూ ఇలా అన్నాడు :



"నన్ను పరమశివుడు కైలాసం నుంచి పంపాడు. 'ఒరే, శంఖకర్ణా, కాళిందీతీరాన రోగాలతో తీసుకుంటున్న ప్రాణులకు మేలు చెయ్యి, వెళ్ళు!' అని నాతో అన్నాడు. మీరు చేసిన అర్చనకు శివుడు సంతోషించాడు. మీ కందరికీ ఈ రోగాలు రావటానికి కారణం తెలుసా? ద్వాపరయుగాంతంలో రాక్షసులందరూ భూలోకాన్ని పీడించటానికి రకరకాల జన్మలెత్తేటప్పుడు, కాలకలి అనే రాక్షసుడు, విరోచనుడి కొడుకు, ఒక విషపు వెలగచెట్టుగా యమునానదికి దక్షిణతీరాన మొలిచాడు. ఆ చెట్టు చుట్టూ ఆ రాక్షసుడి బంట్లందరూ విషవృక్షాలు



గానూ, ముళ్ళచెట్లుగానూ పుట్టారు. ఆ విషపు వెలగచెట్టు గాలిసోకి మీకూ, మీ పశువులకూ ఈ రోగాలు వచ్చాయి. దాని మూలంగా నీరు కూడా చెడిపోయింది. ఆ విషవృక్షాన్ని నిర్మూలించే శక్తి నంద గోపుడి కొడుకూ, బలరాముడికీ ఉన్నది. వాళ్ళందుకు ఒప్పుకునే పక్షంలో మీరంతా బతికిపోతారు. ఈ మాట మీకు చెప్పమని పరమశివుడు నన్ను పంపాడు. ఇక నేను పోతాను, శలవిప్పించండి."

ఈ మాటలంటూండగానే బ్రాహ్మణుడికి పూనకం దిగిపోయింది. బ్రాహ్మణులు సంతోషించి, శివార్చన పరిసమాప్తి చేసేశారు. వెంటనే గోపకులు బలరామకృష్ణులను పిలిపించి, వారికి సంగతంతా చెప్పారు. అంతా విని వాళ్ళు, "ఈశ్వరాజ్ఞ అయింది. తల్లిదండ్రులనూ, కులం వాళ్ళనూ బతికించుకునే అవకాశం కన్న కావలిసినదేమున్నది? ఆ విషపు వెలగ చెట్టును తప్పక నిర్మూలిస్తాం," అన్నారు.

కృష్ణుడు బ్రాహ్మణులకు నమస్కారం చేసి, శంకరుడి ముందు సాష్టాంగపడి, శివాలయం చుట్టూ ప్రదక్షిణ చేసి బలరాముడి కేసి చూశాడు. బలరాముడు కూడా అలాగే చేశాడు. తరవాత వాళ్ళిద్దరూ కత్తులూ, గొడ్డళ్ళూ తీసుకుని విషవృక్షం ఉండే ప్రాంతానికి బయలుదేరారు.

శివార్చనతోనే చాలామంది గోపకులకు ఆరోగ్యం కలిగింది. వాళ్ళందరూ కూడా సింహనాదాలు చేస్తూ, బలరామకృష్ణుల వెంట బయలుదేరాడు.

విషవృక్షం ఎక్కడ ఉన్నదా అని వెతికే అవసరం కూడా లేకపోయింది. వాళ్ళకి కారణ్యం కేసి నడిచే కొద్దీ చెట్టు నుంచి వచ్చే దుర్గంధం దుర్భరం అయింది. త్వరలోనే ఆ విషవృక్షం వారికి భయంకరాకారంలో ఎదురుగా కానవచ్చింది. అది ఆకాశమంత ఎత్తుండి ఒక పెద్ద భూతంలా



గున్నది. దాని చుట్టూ చాలా దూరందాకా దారుణమైన ముళ్ళచెట్లు వ్యాపించి ఉన్నాయి. బలరామకృష్ణులు కత్తులతో ఆ ముళ్ళపొదలను నరికి దారి చేసుకుంటూ విషవృక్షాన్ని సమీపించారు.

ఆ విషపు వెలగచెట్టు మొదలు ముప్ఫై బారలున్నది. దాని కాయలు ఏనుగు తలలంతేసి ఉన్నాయి. దాని కొమ్మలు అన్ని వైపులకూ అంతులేకుండా వ్యాపించి ఉన్నాయి. దుర్గంధ మంతా ఆ చెట్టు కాయల నుంచే వస్తున్నది. అందుచేత ముందుగా వాటిని నిర్మూలించాలనుకున్నాడు కృష్ణుడు.

బలరామకృష్ణులిద్దరూ కలిసి చేతికందిన పిందెలనూ, కాయలనూ, దోరకాయలనూ, పళ్లనూ తెంచిపారెయ్య నారంభించారు. అందని వాటిని రాళ్ళతోనూ, కర్రలతోనూ కొట్టి రాల్చారు. అందీ అందని కొమ్మలను పట్టి వంచి ఫెళఫెళా విరిచేశారు. గోపాలకులందరూ పెద్ద పెట్టున కేకలు పెడుతూ ఈ పనిలో సహాయపడ్డారు. కొంతసేపటికి చెట్టు మీద ఒక్క పిందె కూడా మిగలలేదు.

బలరామకృష్ణులు ఈ విధంగా విషవృక్షాన్ని ధ్వంసం చేస్తూ ఉంటే ఆ ప్రాంతంలో తిరిగే కొన్ని అవులూ,



దూడలూ గోపకుల పైకి దౌర్జన్యంగా వచ్చాయి. అవి మామూలు అవులూ, దూడలూ కావు. అక్కడ చెట్లుగానూ, పొదలుగానూ జన్మించిన రాక్షసుల భార్యలూ, వాళ్ళ పిల్లలూ పశువుల రూపంలో అక్కడ సంచరిస్తున్నారు.

కృష్ణుడు ఈ పశువులను నిర్మూలించసాగాడు. రాక్షసులు తమ అసలు రూపాలతో, నెత్తురు కక్కుతూ, చచ్చిపోనారంభించారు. గోమాతలుగా ఉన్న రాక్షసస్త్రీలు మండిపడి, కృష్ణుణ్ణి తమ కొమ్ములతో పొడిచి చంపబోయారు. కృష్ణుడు అవలీలగా వాటిని పారదోలాడు. ఆ తరవాత



అతను విషవృక్షాన్ని పూర్తిగా ధ్వంసం చేసేశాడు.

గోపకుమారు లందరూ కలిసి ఆ చెట్టు తుండాలనూ, చుట్టూ ఉండిన ముళ్ళ పొదలనూ, చచ్చిన రాక్షసకళేబరాలనూ ఒక గుట్టగా వేసి, ఆ గుట్టకు నిప్పు అంటించారు. చూస్తుండగానే మంటలు ఆకాశ మెత్తు లేచాయి. అగ్నిహోత్రుడా చెట్లనూ, పొదలనూ, రాక్షసకళేబరాలనూ అతి ప్రీతిగా దహనంచేసి ఇంత బూడిద మిగిల్చాడు.

గోపాలకు లందరి శరీరాలూ చెమటతో తడిసి, నుసి అంటుకున్నాయి. వాళ్ళు



చాలా శ్రమపడి అలిసిపోయి ఉన్నారు. అందుచేత అందరూ ఇసుక మీదుగా యమునా నదికి వెళ్ళారు. అక్కడ వాళ్ళు చాలాసేపు ఈతలు కొట్టారు, ఓలలాడారు, నీటిమీద చేతులతో దరువులువేస్తూ పాటలు పాడారు. ఆ విధంగా పొద్దువాలే దాకా జల క్రీడలాడి సాయంకాలం వేళకు నీటి నుంచి బయటికి వచ్చి, తల్లులు తెచ్చిన భోజనాలు తిని, తాంబూలాలు వేసుకుని, కాస్సేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ ఇళ్ళకు ఆడుతూ, పాడుతూ తిరిగి వచ్చారు.

రోజులు గడుస్తున్నాయి. మనుషులకూ, పశువులకూ వచ్చిన తెగుళ్ళు నివారణ అయాయి. ఇంతలో వేసవి కూడా గడిచి పోయింది. వర్షాకాలం ఆరంభం కాబో తున్నట్టు గుర్తుగా ఆకాశాన నల్లని మేఘాలు కమ్మసాగాయి. మేఘగర్జన వినిపించి అందరికీ ఉత్సాహం పుట్టుకొచ్చింది. త్వర లోనే వడగళ్ళతో సహా వాన ఆరంభ మయింది. ధారాపాతంగా వర్షం పడింది. భూమి పచ్చగా అయింది. సెలయేళ్ళూ, నదులూ నిండుగా పారాయి.

ఇలాంటి ఆనంద సమయంలో, విదేహ దేశంలో ప్రజలందరినీ భయోత్పాతంలో ముంచెత్తే కొన్ని విపరీత సంఘటనలు



జరగసాగినై. ఆ ప్రాంతాల నివసించేవారిలో కుంభకు డనేవాడు గొప్ప గోధనాలు కల వాడు. అతడు దాతృత్వానికీ, ధర్మగుణా నికీ పేరు పొందినవాడు. అర్థులకు లేదన కుండా, అతడూ, అతడి భార్య అయిన ధర్మద దానాలు చేస్తూండేవారు. అతడు యశోదకు తమ్ముడు. శ్రీధాముడనే పుత్రుడూ, నీళ అనే కన్యా అతని సంతానం.

పూర్వం తారకాసురుడితో విష్ణువు యుద్ధం చేసినప్పుడు, ఆ యుద్ధంలో కాల నేమి పుత్రులేడుగురిని అతడు వధించాడు. ఆ ఏడుగురూ పగతీర్చుకునేందుకు కుంభకు డుండే గోవ్రజంలో ఏడు ఆబోతులుగా పుట్టారు. వాళ్ళ ఘోరకృత్యాలు అన్నీ యిన్నీ కావు. మందలలోపడి దొరికిన ఆవు లనూ, ఎద్దులనూ చంపటం, ఎదిరించ వచ్చిన గోపాలకులను పొడిచి కాళ్ళతో మట్టగించటం, గోడలను కొమ్ములతో కుమ్మి పడకొట్టి కొట్టాలలో వున్న పశువు లను కూడా హతమార్చటం, వాళ్ల నిత్య కృత్యమైపోయింది.

కుంభకుడు ఆబోతులను పట్టుకొనటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఎందరెందరో యోధులూ, మల్లులూ వెళ్ళి, వాటిని హత మార్చబోయి తామే హతులయ్యారు. కొన్నాళ్ళకు యీ ఆబోతులు కుంభక వ్రజంలో యిక తాము నాశనం చేసేందు కేమీ మిగలక, విదేహరాజ్యంలోని గ్రామాల మీదికి వెళ్ళి పశువులనూ, మనుషులనూ చంపసాగినై. ఈ ఘోరాలు భరించలేక ప్రజలందరూ మిథిలానగరరాజు వద్దకు వెళ్ళి, ఆయనతో, "మహారాజా! కుంభకుడి గోవులమందలో పుట్టిన ఏడు ఆబోతులు, మా మందలనూ, పచ్చని పైరుపొలాలనూ సర్వనాశనం చేస్తున్నవి. వాటిని చంపి మీరు మమ్మల్ని కాపాడకపోతే, మేమంతా మరో రాజ్యం వలసపోక తప్పదు," అని విన్నవించుకున్నారు.






కుంభకుడి మందలో పుట్టిన రాకాసికోడెలను గురించీ, అవి చేసే దురాగతాలను గురించీ, ప్రజలు మొరపెట్టుకోగా, మిథిల రాజు కుంభకుణ్ణి పిలిపించి, "నీ కోడెలు తమను బతకనివ్వటం లేదని పౌరులు ఆక్రోశిస్తున్నారు. నువ్వయినా ఘరానా మనిషివే గాని, సాదా మనిషివి కావు; నీకు బోలెడంత బలగమున్నది. పదిమందినీ సహాయం పిలిచి, ఆ పోట్లగిత్తలను వెంటనే అదుపులో పెట్టెయ్యి, లేదా బీజాలు తీయించు, అలాగూ కాకపోతే అరణ్యంలోకి తరిమెయ్యి," అని గట్టిగా హెచ్చరించి పంపాడు.

కుంభకుడి కేమీ పాలుపోలేదు. ఆ పొగరుబోతు కోడెలను నిగ్రహించటం అతని తరం కాలేదు. అందుకు ప్రయత్నించినప్పుడు చాలామంది గాయపడ్డారు, కొందరు చచ్చారు కూడా. అందుచేత అతను, మరొక ఉపాయ మేదీ తోచక, తన కోడెలను జయించిన వాడికి తన కుమార్తె అయిన నీళ నిచ్చి పెళ్ళి చేస్తానని చాటాడు.

ఈ చాటింపు వింటూనే ఎక్కడెక్కడి నుంచో గోపయువకు లందరూ పరిగెత్తుకుంటూ వచ్చారు. గోవుల మధ్య జీవించే వాళ్ళకు గొడ్లను వంచడం ఎంత పని అని వాళ్ళ ఉద్దేశం. అందుచేత తేలికగా మంచి భార్య దొరుకుతుందని వాళ్ళు ఆశపడ్డారు.

అలా వచ్చిన వాళ్ళు తలా ఒక విధంగానూ ప్రగల్భాలు పలికారు. ఒకడు కోడెలను కొమ్ములు పట్టి వంచేస్తానన్నాడు.

6. నీళా కృష్ణుల వివాహం



ఇంకొకడు వాటిని పడదోసి పట్టి, ముక్కలు కుట్టుతానన్నాడు. ఇలా బీరాలు పలుకుతూ గోపకులు మల్లలు చరిచారు, అరిచారు, పరుగులు తీశారు, హంగామా చేశారు.

చాటింపు వేసిన సమయంలోనే కుంభకుడు నందగోపుడి వద్దకు మనుషులను పంపాడు. ఆ మనుషులు వచ్చి ఏడెద్దుల సంగతంతా చెప్పగానే నందుడూ, యశోదా, వాళ్ళ వెంట బలరామ కృష్ణులూ, మరి కొందరు గోపకుమారులూ బయలుదేరారు.

కుంభకుడు తన అక్కకూ, బావకూ ఎదురు వచ్చి స్వాగతం చెప్పాడు. కుంభకుడి భార్య ధర్మద యశోదకు మర్యాదలు చేసింది. కుంభకుడి కొడుకు శ్రీధాముడు కృష్ణ బలరాములను కౌగలించుకుని, వాళ్ళకు తానే పీటలు తెచ్చి వేశాడు. పాయసాలూ, నేతులూ పుష్కలంగా వడ్డించుకుని అందరూ భోజనాలు చేశారు.

ఆ రాత్రి రాకాసి ఎద్దులు, కృష్ణుడు వచ్చిన సంగతి గ్రహించి, విజృంభించాయి; చూడి ఆవులను కొమ్ములతో పొడిచాయి; ఆ తరవాత కుంభకుడి అంగణంలో చొరబడి, రంకెలు పెడుతూ, గిట్టలతో నేలను తవ్వుతూ అట్టహాసం చేసి, కుండలు పగలగొట్టి, గోడలు గీరి, గరిసెలు కూలదోసి, బళ్ళు విరగదన్ని, పందిళ్ళు పడదోసి, తలుపులు విరగదన్ని నానా భీభత్సమూ చేశాయి. ఆడవాళ్ళూ, పిల్లలూ హాహాకారాలు చేశారు. పై నుంచి వచ్చిన గోపకులు ఎక్కడ వీలుంటే అక్కడ దాక్కున్నారు.

తెల్లవారింది. కుంభకుడు గోపుల నందరినీ పిలిపించాడు. తన కూతురిని అలంకరింప జేసి తెచ్చి వారి ముందు నిలబెట్టి. "గోపకుమారులారా, చూశారు గదా? ఈ పోట్ల గొడ్లు దిగ్గజాలలాటివి, సింహాలలాటివి. వీటిని అదుపులోకి తేవాలని మేము చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయాయి. వీటిని అదుపులో పెట్టకపోతేనేమో రాజు

గారు మమ్మల్ని దండిస్తారు. అందుచేతనే మహాబలులూ, అత్యంత సమర్థులూ అయిన మీ అందరినీ పిలిపించాను. మీలో ఎవరు ఈ పోట్ల గొడ్లను శిక్షించినా, అతనికి ఈ పిల్లనిచ్చి పెళ్ళి చేసేస్తాను," అన్నాడు.

గోపకుమారులంతా ఈ మాటలు విని పెద్ద సందిగ్ధంలో పడ్డారు. నీళను చూస్తే మనసులు ఉవ్విళ్ళూరుతూ ఉత్సాహం పొందుతున్నాయి. రాకాసి ఎడ్లను తలుచుకుంటే గుండెలు నీరై, కాళ్ళు చల్లబడుతున్నాయి. అందుచేత ఎవరూ ఒక నిశ్చయానికి రాలేని స్థితిలో చిక్కుపడ్డారు.

అప్పుడు నందుడి జ్ఞాతి అయిన ఘోషవంతు డనే గోపకుడు, "ఈ బోడి ఎద్దులను చంపలేకపోతే నా బలపరాక్రమా లెందుకు? చూస్తూ ఉండండి, ఒక్క క్షణంలో వీటిని కూల్చిపారేస్తాను," అని మల్లచరిచి, పోట్ల ఎద్దుల మీదికి వెళ్ళాడు. మిగిలిన వాళ్ళు దూర దూరంగా, చెట్ల మీదా, పుట్టల మీదా, గట్ల మీదా నిలబడి ఆశగా చూడసాగారు.

ఘోషవంతుడు ఒక ఎద్దు నెత్తిన పిడికిటితో బలంకొద్దీ కొట్టాడు. చూసే వాళ్ళంతా హర్షధ్వానాలు చేశారు. మరుక్షణమే ఏడు ఎద్దులూ అతన్ని చుట్టు ముట్టాయి. కృష్ణుడు మాత్రం విచారంతో, "ఇతనెందు కిలాటి



పని పెట్టుకున్నాడు? ఎద్దులితన్ని ప్రాణాలతో వదులుతాయా?" అనుకుంటున్నాడు. అంతలోనే ఎద్దులు అతన్ని తమ కొమ్ములతో పొడిచి ఎత్తి, నేల మీద విసిరికొట్టి, తమ కాలిగిట్టలతో దూరంగా తన్నేశాయి.

చూస్తున్న వాళ్ళంతా హాహాకారాలు చేశారు. ఈ విధంగా ఘోషవంతుణ్ణి నేల పాలు చేసిన ఎద్దులు మిగిలిన గోపక సమూహం పైనపడి, కొమ్ములతో పొడుస్తూ, గిట్టలతో మట్టగిస్తూ, నోళ్ళతో కొరుకుతూ, అందరినీ చెదరగొట్టి పారదోలసాగాయి.

అప్పుడు కృష్ణుడు బలరాముడితో, "ఇవి ఎద్దులు కావు. ఎద్దుల కింత కసీ, ఇంత



సాహసమూ ఉండటం అసంభవం. కుంభకుడికి నేనే సహాయం చేస్తాను,'' అన్నాడు. అని అతను ఆ పోట్లెద్దులను సమీపిస్తూ ఉంటే, నందుడూ, యశోదా కూడా, ''వద్దురా, బాబూ!'' అని కేకలు పెట్టారు.

కృష్ణుడు మహా కోపంతో పిడికిలి బిగబట్టి వస్తుంటే, అన్నదమ్ములైన ఆ ఏడు రాక్షసి ఎద్దులూ, పాత పగ కొద్దీ కోపావేశం చెంది, ఒక్కసారిగా అతని పైకి దూకుతూ వచ్చాయి. అతను అందిన ఎద్దులను అరిచేతులతో ముఖాల మీద కొట్టి, కొమ్ములు పట్టుకుని ఒక ఎద్దును మరొక ఎద్దు మీదికి తోసి, కొన్నిటిని తోకలు పట్టి గిరగిరా తిప్పి, కొన్నిటి ముట్టెలూ, వీపులూ వాయగొట్టి, చూసేవారందరికీ మహాశ్చర్యం కలిగేలాగా పోరాడాడు. ఇదంతా అతనికి ఆట-చూసే వాళ్ళ వినోదం కోసం ఆడిన ఆట. చూసే వాళ్ళలో నీళ కూడా ఉన్నది. ఆమె ఎంతో ప్రేమతోనూ, సిగ్గుతోనూ తన కేసి చూస్తుంటే కృష్ణుడికి చాలా ఆనందం కలిగింది.

చిట్టచివర కతను ఈ ఆట కట్టిపెట్టి ఒక్కొక్క పిడికిటి పోటుతో ఒక్కొక్క ఎద్దును తల పగలగొట్టి, ముక్కులా నోటా నెత్తురు కక్కించి, కాలనేమి కొడుకు లేడుగురినీ కడతేర్చేశాడు. నందుడూ యశోదా పరిగెత్తుకుంటూ వచ్చి కృష్ణుణ్ణి కౌగలించుకున్నారు. కుంభకుడు నీళను చెయ్యిపట్టి కృష్ణుడి దగ్గిరికి తీసుకొచ్చి, అతని చేతిలో ఆమె చెయ్యి పెడుతూ, ''ఇదుగో నీ పరాక్రమానికి కానుక. నీ మరదలు నీ సొత్తే అయింది. ఏలుకో,'' అన్నాడు.

ఆయన కృష్ణుడికి వస్త్రాభరణాలూ, యశోదానందగోపులకు బట్టలూ, మిగిలిన గోపకుమారులకు ఇతర కానుకలూ ఇచ్చి, నందుడితో, ''బావా, నీ కొడుకు ఉద్దండ ప్రచండ శూరుడు. అతడి దయవల్ల మాకు భయంకరమైన ఆపద తొలగిపోయింది. నా పరువు దక్కింది. ఇక మేము హాయిగా

బతుకుతాం. నీళకు వేలకువేలు గోవులను అరణంగా ఇస్తాను. నా సంతోషం కొద్దీ ఇచ్చే వీటిని నిరాకరించకు," అన్నాడు.

"పిచ్చివాడా, నాకు కట్నుకు పోయినన్ని గోవులున్నాయి. కృష్ణుడు పుట్టాక మా మందలు తెగ వృద్ధి చెంది, అంతులేని పాలు ఇస్తున్నాయి. ఆ పాల నుంచి ఎత్తుకు ఎత్తు నెయ్యి అవుతున్నది. అందరమూ సుఖంగా ఉంటున్నాం," అన్నాడు నందుడు.

ఆ రోజు మహోత్సవంగా గడిపి నంద యశోదలూ; నీళనూ, తోడుగా శ్రీధాముణ్ణీ వెంట బెట్టుకుని కృష్ణుడూ, మిగిలినవాళ్ళూ తమ బృందావనానికి బయలుదేరి వెళ్ళి పోయి, సుఖంగా జీవించసాగారు. నూత్న యౌవనంలో ప్రవేశించిన కృష్ణుడు పసుపు పచ్చని పట్టు బట్ట కట్టి, నెమలి కన్నులు గల తలపాగా ధరించి, అడవి పువ్వుల మాలలు మెడలో వేసుకుని, వేణుగానంలో ఓలలాడుతూ అంతటా తిరుగుతున్నాడు.

ఒకనాడు బలరామకృష్ణులు పశువులను మేపటానికి యమునా తీరాన గల ఒక మహా వటవృక్షం వద్దకు వెళ్ళి, చుట్టూ గోవులు మేస్తూంటే వాటిని చూస్తూ ఆ మర్రిచెట్టు కింద కూర్చున్నారు. మిగిలిన గోపబాల కులు ఆటలాడు కుంటున్నారు.



ఆ సమయానికి వామదేవుడూ, భరద్వా జుడూ అనే మహామునులు తీర్థయాత్రకై అటుగా వచ్చి, బ్రహ్మాండమైన మర్రి చెట్టును చూడగానే దానికి ప్రదక్షిణ నమ స్కారాలు చేసి, అక్కడ ఉన్న గోపకులతో, "అబ్బాయిలూ, పాములూ, మొసళ్ళూ లేకుండా స్నానం చెయ్యడానికి అనువైన రేవు, యీ ప్రాంతాల ఎక్కడ ఉన్నది?" అని అడిగారు.

గోపకులు ఒకళ్ళముఖాలు ఒకరు చూసు కుంటూ, "నాకు తెలీదు, వాణ్ణి అడగండి," అని ఒకరినొకరు చూపుకున్నారు. అల్లరి వెధవలు ఆకతాయితనం చేస్తున్నారని





అ మునీశ్వరులు తమతో మాట్లాడిన ఆ కుర్రవాడి తేజస్సు చూసి, గోపకులంలో ఇలాటి వాడు ఎలా కలిగాడా అని ఆశ్చర్య పడి, క్షణం పాటు కళ్ళు మూసుకుని, సమాధిశక్తి ద్వారా నిజం తెలుసుకున్నారు. వాళ్ళు కృష్ణుడితో, "మా అదృష్టం నాయనా! బ్రహ్మదేవుడు మొదలైన వాళ్ళు విశ్వప్రయత్నం చేసినా కనబడని నిన్ను మేము ఇవాళ ఇక్కడ చూడగలిగాం! మా జన్మ సార్థకమయింది. నిన్ను కొడుకునుగా కన్న ఆ తల్లిదండ్రులు అదృష్టవంతులు," అంటూ కృష్ణుణ్ణి పొగడి తమ దారిన తాము వెళ్ళిపోయారు.

మళ్ళీ కృష్ణుడికి జీవితం మామూలుగా గడిచిపోతున్నది. అతను బలరాముడితో సహా గోపబాలకుల వెంట ఆవుల మందలతో బాటు మేత ప్రదేశాలన్నీ తిరుగుతూ, ఆడుతూ, పాడుతూ హాయిగా ఉంటున్నాడు.

ఒకనాడతను యమున వెంబడి చాలా దూరం వెళ్ళి అందులో ఒక భయంకరమైన మడుగొకటి చూశాడు. అది చాలా పెద్దది. అందులో సముద్రపు నీరు తెర్లినట్టు నీరు తెర్లుతున్నది. దానిపైన దట్టంగా ఆవిరి కప్పి ఉన్నది. దాని సమీపంలో ఉన్న తీరాల వెంబడి గల చెట్లూ, లతలూ

కృష్ణుడు లేచి మునీశ్వరులను సమీపించి, వినయంగా, "మహామునులారా, వీళ్ళకు మంచి రేవేదో ఏం తెలుస్తుంది? మీకు దివ్యమైన రేవు నేను చూపిస్తాను. మీ కాలకృత్యాలూ, అనుష్ఠానాలూ పూర్తికాగానే తిరిగి ఇక్కడికి రండి. చిక్కాలలో మీగడ పెరుగుతో కలిపిన చద్ది ఉన్నది. చక్కెర కలిపిన పాయసం బోలెడంత తెచ్చాం. మీరు హాయిగా ఆరగించవచ్చు. లేదా, అప్పటికప్పుడు ఉష్ణధారలు పిండి మీకు తాగటానికి ఇస్తాం. నేను నందుడి కొడుకును. నా పేరు కృష్ణుడు. ఇతను మా అన్న బలరాముడు," అన్నాడు.





మాడి ఉన్నాయి. దాని నుంచి బయలు దేరే అలలు భయంకరంగా ఒడ్లను కొట్టు కుంటున్నాయి. ఆ ప్రాంతాల ఒక పిట్టగాని, ప్రాణిగాని బతికేటట్టు లేదు.

ఆ మడుగులో కాళియు డనే మహాసర్పం ఉంటున్నదనీ, దాని నోట అగ్ని జ్వాలలు వెలువడు తూంటాయనీ, ఆ కాళియుడికి గరుత్మంతుడి భయం లేదనీ కృష్ణుడు అది వరకే విని ఉన్నాడు. ఇప్పు డీ మడుగు చూస్తూంటే ఆ మాట నిజమే అయి ఉంటుందనిపించింది. అతను ఆ మడుగు లోకి ప్రవేశించి, ఆ మహాసర్పం మదమణ గించి, మడుగును పశువులు దిగటానికి వీలుగా చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. అందువల్ల మరొక మేలు కూడా ఉన్నది. అదేమిటంటే, ఈ కాళియుడి పరివారానికి చెందిన పాములు అసంఖ్యాకంగా వన మంతటా సంచరిస్తూ, బృందావనంలోని కొన్ని ప్రాంతాలను అపాయకరంగా చేస్తు న్నాయి; కాళియుణ్ణి తగిన విధంగా మర్దించి నట్టయితే ఈ చిల్లర సర్పాల ఆటకట్టవు తుంది. ఇది ఎలాగూ చేసి తీరవలసిన పని. అలాటప్పుడు జాప్యందేనికి ? వెంటనే చేస్తే సరిపోతుంది.

ఇలా అనుకుని కృష్ణుడు మడుగు ఒడ్డును సమీపించాడు. నీటి అంచున, నిలువునా మాడిపోయిన కదంబవృక్షం ఒకటి ఉన్నది. కృష్ణుడు దానిపైకి ఎక్కి, మడుగులోకి దూక నిశ్చయించాడు. అతను ఎవరితోనూ సంప్రతించలేదు. చంకలో ఉన్న పలుపు తాళ్ళు అవతల పడ వేశాడు. తన ఢక్కా, వేణువూ మరొకరి కిచ్చాడు. నెత్తి మీది పింఛం తీసేసి, జుట్టు ముడివేసుకున్నాడు. బట్ట వెనక్కు విరిచి కట్టాడు. చెప్పులు వదిలేసి కదంబవృక్షం మీది కెక్కి, పాలో మని పెద్ద కేకపెట్టి మడుగులోకి దూకే శాడు. అతను పడ్డ చోట నది నీరు ఇంతెత్తున పైకి చిమ్మింది.






# కృష్ణావతారం

కృష్ణుడు కాళియుడి మడుగులోకి దూకగానే, పాలసముద్రంలో మందరపర్వతం పడినట్టుగా, మడుగులోని నీరు అల్లకల్లోలమై, దాని అలజడి రసాతలం దాకా దిగింది. కాళియుడికి చాలా కోపం వచ్చింది. వాడు తన ఐదుపడగలూ విప్పి, ఘోరమైన కోరలు కనిపించేలాగా నోళ్ళు పెద్దగా తెరిచి, నోట విషజ్వాలలు కక్కుతూ, మెలికలు తిరిగే తన శరీరాన్ని నది నిండా పరిచి, కృష్ణుణ్ణి అక్కడక్కడా కాట్లు వేసి, అతని శరీరమంతా చుట్టి, నొక్కసాగాడు. కృష్ణుడు మూర్ఛపోయాడు. అది చూసి కాళియుడి చుట్టాలూ, భార్యలూ, పిల్లలూ అయిన మహాసర్పాలన్నీ మూగి, నోళ్ళ మంటలు కక్కుతూ కృష్ణుణ్ణి కరిచారు.

ఇదంతా చూస్తున్న గోపకుమారులు బెదిరిపోయి, దక్షిణంగా కోసెడు దూరంలో ఉన్న వ్రేపల్లెకు పరిగెత్తి, అక్కడి వాళ్ళతో, "నందగోపుడి కొడుకు కృష్ణుడు, ఆడుతూ ఆడుతూ ఉన్న వాడు కాస్తా ఎవరితోనూ చెప్పకుండా, నదిలో పెద్ద పాములుండే మడుగులోకి దూకేశాడు. అన్నిటికన్నా పెద్దపాము పైనుంచి కిందికి కాలూ చెయ్యీ ఆడకుండా అతన్ని చుట్టేసింది. పాములన్నీ అతన్ని కరిచేస్తున్నాయి, పాపం. వాళ్ళ నాన్న ఎక్కడున్నాడో చెప్పండి. అందరూ వచ్చి కృష్ణుణ్ణి విడిపించే ఉపాయం చూడండి," అన్నారు.

ఈ వార్త విన్నవాళ్ళకు పిడుగు పడ్డట్టయింది. నందుడికి ఆశ్చర్యమూ,

7. కాళియమర్దనం



దుఃఖమూ ముంచుకొచ్చాయి. "ఎక్కడ? ఎక్కడ?" అంటూ ఆయన వార్త చెప్పిన వాళ్ళ వెంబడి బయలుదేరాడు. బలవంతులైన గోపకు లందరూ చేతుల్లో ఆయుధాలు పట్టుకుని ఆయన కన్న ముందే పరిగెత్తారు. యశోదకు మూర్ఛ వచ్చినంత పని అయింది. ఆమె పెద్దపెట్టున ఏడుస్తూ, విడిపోయిన జుట్టుముడితో, మిగతా గోపస్త్రీలు పట్టుకుని నడిపిస్తూంటే మడుగు దగ్గిరికి బయలుదేరింది.

మొత్తానికి ఊరుకు ఊరంతా కదిలింది. "ఏం ప్రారబ్ధం వచ్చి పడిందిరా!" అన్నారు కొందరు. "కృష్ణు డెప్పుడూ ఏదో ఒకటి తెచ్చిపెట్టుకుంటాడు. చిన్నవాడు చిన్నవాడి పనులు చెయ్యడు," అన్నారు మరి కొందరు. "ఇంతకంటె పెద్దగండాలే గడిచాడు. కాళియుడికి మూడిం దనుకో వలసిందే. కృష్ణుడి కెలాంటి భంగపాటూ రాదు, చూస్తూ ఉండండి," అన్నారు ఇంకా కొందరు.

అందరూ కాళిందీతీరాన నిలిచి కృష్ణుణ్ణి చూసి నీరుకారి పోయారు. అతను పాము చుట్టల్లో చిక్కుకుని చాలా దీనస్థితిలో ఉన్నాడు. ఎవరు గాని చేయగలిగిన దేమీ కనిపించలేదు. నందుడూ, యశోదా మూర్ఛ పోయారు. మిగిలినవాళ్ళు వాళ్ళకు శైత్యోపచారాలు చేసి స్పృహతెప్పించారు.

నందుడు మిగిలిన వాళ్ళతో, "ఏం మహాపాతకం చేసుకున్నానో ఏమో, నా బిడ్డ ఇలా పామువాత పడ్డాడు. నేను మహా పుణ్యాత్ముణ్ణనీ, అందుకే ఇంత అందమూ, బలపరాక్రమాలూ గల కొడుకును కన్నాననీ అందరూ నన్ను మెచ్చుకుంటే దేవుడి కళ్ళు కుట్టాయి. పూతన మొదలైన వాళ్ళందరినీ చంపినవాడు ఈ పామువాత పడి ఎలాగైనా బయట పడకపోతాడా అన్న ఆశ కూడా ఒక చెంప పుట్టుతూనే ఉన్నది. మేము ఎలాగైనా ధైర్యం చిక్కబట్టుకోగలం.



కాని కొడుకు దుస్థితి చూసి తల్లడిల్లే తల్లి దుఃఖం ఎలా పోగొట్టేటట్టు ?" అన్నాడు.

అప్పుడు యశోద కృష్ణుడితో, "నాయనా, నువు వెన్న తిన్నందుకు గోపికలు పితూరీ చేస్తే వాళ్ళను సముదాయించటానికి నిన్ను రోటికి కట్టాను. అందుకుగాను ఇవాళ నన్ని విధంగా బాధిస్తున్నావా ? ఎంతో బలం గల వాడివి, నిన్ని పాము ఏం చెయ్యగలదురా, బాబూ ? నేనంటే నీ కిష్టం కాదూ ? ఒక్క సారి నా కేసి చూసి నవ్వవూ ? కళ్ళు తెరిచి చూడవూ ? అడవిలో గోవులు దిక్కులేక ఎలా చెల్లాచెదరయాయో చూడు. వెంటనే వచ్చెయ్యి, నాయనా. విషవృక్షాలు గల అరణ్యాన్ని ధ్వంసం చేసిన నీ కీ పామొక లెక్కా ?" అంటూ ఏడ్చింది.

అందరికీ దుఃఖం ముంచుకొచ్చింది. యశోదకు పుత్రనష్టం కలిగినట్టే భావించి తలా ఒక మాటా అన్నారు. కొందరు గోపకులు, "మనమంతా మడుగులోకి దూకి ఆ పాముతో యుద్ధం చేద్దాం. కృష్ణుణ్ణి విడిపిద్దాం. లేకపోతే ఆ కాళియుడి విషాగ్నిలో చచ్చిపోదాం. కృష్ణుడు లేకుండా వ్రేపల్లె కెలా తిరిగిపోతాం ?" అన్నారు.

బలరాముడు అంతా చూస్తున్నాడు, అందరి మాటలూ వింటున్నాడు. అతను



కృష్ణుడితో చివరి కిలా అన్నాడు : "కృష్ణా, మానవస్వభావం చాటు చేసుకుని, లోక హితం మాట మరిచిపోయి, ఈ వెధవ పాముకు చిక్కి, అసహాయుడి వైపోయా వేమిటి ? నీ వాళ్ళందరూ ఎంత దైన్యంలో ఉన్నారో గమనించావా ? ఆ విషపుపురుగును శిక్షించి అందరినీ సంతోషపెట్టు," అన్నాడు.

ఈ మాట వింటూనే స్పృహ తెచ్చుకుని కృష్ణుడు కాళియుడి చుట్టలను ఒక్క తోపు తోసి, గాలిలోకి ఎగిరి బరువుగా పడగల మీదికి దూకాడు. అతను కాళియుడి తోక చేతిలోకి తీసుకుని, వాడి శిరస్సులను కాళ్ళతో మర్దన చేయసాగాడు. యమునలోని అలలు





తాళం వేస్తూండగా, తీరాన ఉన్న గోప కుల హర్షధ్వానాలు సంగీతంగా చేసుకుని, కాళియుడి తలలపై కృష్ణుడు చేసే మహా దారుణమైన నాట్యాన్ని ఆకాశం నుంచి దేవతలు చూశారు.

కాళియుడి తలలు చితికాయి. వాడి ముక్కుల రక్తధారలు కారాయి. వాడి కోరలు విరిగి, నోట మంటలతో కూడిన విషం వెలువడింది. వాడు వడిలిపోయిన తామరకాడ లాగా అయిపోయి, చచ్చే స్థితికి వచ్చాడు. ఆ స్థితిలో వాడు హీనస్వరంతో, "దేవా, నువు సర్వేశ్వరుడ వని తెలీక, తుచ్ఛమైన కోపంతో, నీ పవిత్రమైన దేహాన్ని ఇలా చేశాను. నా మదానికి తగినట్టు శిక్షించావు. ఇక నన్ను కరుణించి, క్షమించు. నా విష మంతా దిగిపోయింది. బుద్ధి వచ్చింది. నీకు దాసుడుగా ఉండి ఏం చెయ్యమంటే అది చేస్తాను. నీ పాదాలు తాకి నేను పవిత్రుణ్ణి కావటం చేత, నీ ఆగ్రహం నాకు అనుగ్రహమే అయింది," అన్నాడు వినయంగా.

కృష్ణుడికి కాళియుడి పైన జాలి కలిగి, "ఇక నుంచీ నువు ఈ యమునానదిలో ఉండటానికి వీలు లేదు. నీ వారందరినీ వెంటబెట్టుకుని సముద్రంలోకి వెళ్ళిపో. నీ విషంతో పాడైపోయిన నీరంతా పోయి నది ఇక శుద్ధంగా ఉంటుంది, జనానికి ఉపయోగపడుతుంది. నీ తలల మీద నా కాలి గుర్తులు చూసి గరుత్మంతుడు నీ జోలికి రాడు. ఇది నేను నీ కిచ్చే వరం," అన్నాడు.

కాళియుడు తన పరివారంతో సహా అప్పుడే సముద్రం కేసి ప్రయాణ మయాడు. కృష్ణుడు నదిలో నుంచి ఒడ్డుకు వచ్చాడు. తల్లిదండ్రులు అతన్ని కౌగలించుకుని దీవించారు. అతను వాళ్ళకు నమస్కరించాడు. మిగిలిన గోపకులంతా అతని చుట్టూ మూగి, తెగ ప్రశంసించుతూ, అద్భుతాశ్చర్యాలు ప్రకటించారు.





గోపకులలో ముఖ్యులైన వారందరికీ కృష్ణు డొక దేవుడు లాగే కనబడ్డాడు. "ఇంత బలమూ, ధైర్యమూ, సాహసమూ ఎక్కడా ఎవరికీ ఉండవు. నీ మహిమ జగత్తంతా కొనియాడ దగినది. మా మందలకూ, మాకూ నీవే రక్షకుడవు. నీ దయ వల్ల ఇక గోవులు ఎక్కడ బడితే అక్కడ యథేచ్ఛగా సంచరించగలవు. ఈ నదిలో దిగే మునులకు ఎలాటి అపాయమూ ఉండదు. నీ సంగతి ఇంతకాలమూ మేము గ్రహించలేక పోయాం," అంటూ వారు అతనికి ప్రదక్షిణ చేశారు.

అతను అందరినీ తగిన విధంగా పరామర్శించి, వారందరితోనూ వ్రేపల్లెకు తిరిగి వచ్చి, ఎప్పటిలాగే సుఖంగా జీవితం గడపసాగాడు.

కొంత కాలం గడిచింది. పశువులకు మేత లేకుండా పోయింది. కృష్ణుడు మిగిలిన గోపకులతో కర్తవ్యం ఆలోచించాడు. అప్పుడు వారిలో పెద్దవాళ్ళు ఒక విషయం కృష్ణుడికి చెప్పారు.

గోవర్ధన పర్వతానికి ఉత్తరంగా, కాళిందీ నదికి దగ్గరలోనే అతి విశాలమైన తాటితోపు ఉన్నది. అందులో పచ్చిగడ్డి పుష్కలంగా ఉన్నది. అయితే అందులో ధేనుకు డనే



రాక్షసుడు గాడిద రూపంలో ఉండటం చేత అందులోకి ఏ ప్రాణీ ప్రవేశించదు.

ఈ విషయం చెవుల పడేసరికి బలరామ కృష్ణులకు ఉత్సాహం పుట్టుకొచ్చింది. వాళ్ళు ధైర్యం గల గోపకులతో, "పశువులకు మేత వుండాలి గాని, రాక్షసులకు భయపడతామా? పదండి!" అన్నారు. వాళ్ళంతా గోవులను తోలుకుని తాటితోపుకు బయలుదేరి వెళ్ళారు. అందులో ఎటు చూసినా నవనవలాడుతూ బోలెడంత పచ్చిక. పశువులు ఆత్రంగా దాన్ని మేయ నారంభించాయి. కృష్ణుడు మొదలైన గోపకులు పరమానందంతో ఆ గడ్డిలో విహరించారు.





కృష్ణుడా తోపు అందం చూసి ఆనందించాడు. తాటిచెట్లు పాతాళంలో నుంచి పైకి వచ్చి, నల్లటి శరీరాలతోనూ, పడగల లాటి తలలతోనూ ఆడుతున్న పాముల్లాగా ఉన్నాయి. వాటి మీద ఉన్న తాటిపళ్ళు ఎరుపూ, నలుపూ కలిసిన రంగు కలిగి వుండి, మంచి వాసన కొడుతున్నాయి. కృష్ణుడు బలరాముడితో, "అన్నా, నువు చెట్లెక్కి పళ్ళు పడెయ్యి, నాకా పళ్ళు తినాలని ఉన్నది. ఆవులకు కూడా పెడదాం," అన్నాడు.



"ఎక్కటం చాలా ఆలస్య మవుతుందిలే. నేను చెట్ల మొదళ్ళు పట్టుకుని ఊపుతాను, రాలిన పళ్ళను అందరూ ఏరుకోండి," అని బలరాముడు గోపకు లందరితోనూ చెప్పి, ఒక్కొక్క చెట్టునే మొదలు పట్టుకుని అవలీలగా ఊపసాగాడు. తపతపా మోత చేస్తూ తాటిపళ్ళు రాల నారంభించాయి.

ఈ ధ్వని ధేనుకాసురుడి చెవిని పడింది. గాడిద ఆకారంలో ఉండే ఆ భయంకర రాక్షసుడు, తన లాటి ఆకారాలలోనే ఉన్న వెయ్యిమంది అనుచరులు వెంట రాగా బలరామకృష్ణు లున్న చోటికి వచ్చాడు. వాణ్ణి చూసి గోపకు లంతా హడలిపోయారు.

ఇలా గాడిద లన్నీ వస్తుంటే దుమ్ము ఆకాశంలోకి లేచి మబ్బు లాగా అయింది. అవి ఓండ్ర పెడుతుంటే దిక్కులు పిక్కటిల్లాయి. అలా వచ్చే గాడిదలమందకు ముందు నడిచే ధేనుకాసురుడికి ఎదురుగా, ఉత్తచేతులతో బలరాముడు నిలబడ్డాడు. ధేనుకుడు బలరాముడికి దగ్గిరగా వస్తూనే, వెనక్కు తిరిగి, వెనకకాళ్ళు రెండూ ఎత్తి, బలంగా బలరాముడి గుండెల మీద తన్నాడు. బలరాముడు ఒడుపుగా ఆ కాళ్ళు రెండూ పట్టుకుని ధేనుకుణ్ణి విసిరి పైకి ఎగరవేశాడు. ధేనుకుడి శరీరం తాటిచెట్లకు తగిలి నుగ్గునుగ్గయింది. ఆ శరీరంతో బాటు తాటిపళ్ళు కూడా చాలా రాలాయి.





బలరాముడు అంతటితో పోనీక మిగిలిన రాకాసిగాడిదలను కూడా వెనకకాళ్ళు పట్టుకుని, తాటిచెట్ల కేసి కొట్టి చంపాడు. అతనితోబాటు కృష్ణుడు కూడా ఆ రాక్షసులను చంపాడు. మొత్తం తాటితోపంతా తాటి పళ్ళతోనూ, రాక్షసుల కళేబరాలతోనూ నిండిపోయింది. గోపకులు ఆ ఇద్దరి పౌరుషాన్నీ మెచ్చుకున్నారు. రాక్షసులు చావటంతో ఆ తాటితోపు, నిరపాయ మయింది.

మరొకసారి గోపకులు భాండీరవట ప్రాంతంలో ఆవులను మేపుతూ ఆటలలో మునిగి ఉండగా, ప్రలంబు డనే రాక్షసుడు ఒక గోపకుడి రూపంలో వారితో చేరాడు. గోపబాలకు లందరూ హరిణక్రీడన మనే ఆట ఆడదలచి జంటలు జంటలుగా చీలారు. కృష్ణుడూ, అతని బావమరిది శ్రీధాముడూ ఒక జంటగా అయారు. ప్రలంబుడు బలరాముడికి జంట అయాడు. ఆ విధంగా సగంమంది కృష్ణుడి పక్షమూ, సగంమంది శ్రీధాముడి పక్షమూ అయారు. ఆట ఏమిటంటే భాండీరవటవృక్షం హద్దుగా పెట్టుకుని జింక లాగా దూకుతూ పరిగెత్తాలి. ఈ ఆటలో కృష్ణుడి పక్షంవాళ్ళు గెలిచారు. శ్రీధాముడి పక్షంవాళ్ళు ఓడారు. ఓడిన వాళ్ళు గెలిచినవాళ్ళను మూపు మీద ఎక్కించుకుని హద్దు దాకా మోసుకుపోవాలి.

అందుచేత ప్రలంబుడు బలరాముణ్ణి మూపు మీద ఎక్కించుకుని, ఎటో తీసుకుపోయి, అకస్మాత్తుగా తన రాక్షసాకారం ధరించి, ఆకాశంలోకి లేచాడు. బలరాముడు ఆశ్చర్యపడి, ఏం చెయ్యాలో తోచక, కృష్ణుణ్ణి కేకపెట్టి తన స్థితి చెప్పాడు. "వాడి అంతు తేల్చక చూస్తావేం?" అని కృష్ణుడు హెచ్చరించాడు. వెంటనే బలరాముడు పిడికిలి బిగించి, రాక్షసుడి నెత్తిన ఒక్కటి పెట్టాడు. వెంటనే రాక్షసుడు, తల పగిలి, నేలకూలి చచ్చాడు. ప్రలంబుణ్ణి చంపాక బలరాముడికి బలదేవు డనే పేరు వచ్చింది.





# కృష్ణావతారం

ఆ యేడు చక్కని వర్షాలు కురిశాయి. పశువులూ, వాటి దూడలూ చక్కగా నవనవ లాడుతూ తయారయాయి. పంటలు బాగా పండాయి. గడ్డీ, లతలూ, చెట్లూ సమృద్ధిగా పెరిగాయి. పాడీ, పంటా ఎన్నడూ లేనంత బాగా గోకులానికి లభించాయి.

వానలు వెనకపట్టి శరత్కాలం వచ్చింది. నందగోపుడు మొదలుగా గల పెద్దలు తమలోతాము మాట్లాడుకుని ఇంద్రోత్సవం చేద్దామని నిశ్చయించుకున్నారు. అనుకోవట మేమిటి, మరుక్షణమే అందుకు ప్రయత్నాలు కూడా ప్రారంభమయాయి. అందరూ హడావుడిగా తిరగసాగారు.

కృష్ణుడీ హడావుడి చూసి నవ్వుతూ గోపకులతో, "మీరంతా ఎందు కింత సంభ్రమంలో ఉన్నారు? ఏం పండగ ఇది? ఏ దేవుణ్ణి కొలవబోతున్నారు? ఆ దేవుడి వల్ల కలిగే లాభా లేవి?" అన్నాడు.

గోపకులలో అతి వృద్ధుడైనవాడు కృష్ణుడితో, "బాబూ, లోకపాలకు లందరికీ ఇంద్రుడు రాజు గదా. వర్షర్తువు అతనిదే నాయె. గోగణాలకు మేలు చేసే ఆ దేవుడు గోపకులకు ఎంతైనా కొలవదగిన దేవుడు. అందుచేత ఇంద్రోత్సవం తలపెట్టాం," అని చెప్పాడు.

అది విని కృష్ణుడిలా అన్నాడు: "మనుష్యుల కుండే వృత్తులు మూడు. అవేవంటే వ్యవసాయమూ, వర్తకమూ, పశుపోషణా. ఎవరే వృత్తి చేస్తే వారి కదే దేవుడు. మనం గోపాలకులం; అడవులలో ఉంటాం,

8. గోవర్ధనోద్ధరణ





ఈ విధంగా కృష్ణుడు చాలా సేపు బోధిం చిన మీదట అతను చెప్పినది మిగిలిన వాళ్ళకు నచ్చింది. అదీ గాక వాళ్ళు పూర్తిగా కృష్ణుడి పైన ఆధారపడి, అతనే తమకు అన్నింటికీ దిక్కన్న ధోరణిలో ఉన్నారు. ఎందుకంటే, అతను చేసిన అద్భుతాలు అన్నీ ఇన్నీ కావు. వాటికి తోడు అతను వాళ్ళను ఎన్నోసార్లు ఆపదల నుంచి కాపాడాడు. వాళ్ళ పాలిటికి అతను మనిషి కాదు, దేవుడు.

కొండల్లో తిరుగుతాం, పశువులను పెంచుతూ జీవిస్తాం. అందుచేత మనకు అడవులూ, కొండలూ, పశువులూ దేవతలు. ఎవరి కుల దేవతలను వాళ్ళు పూజించాలి. కర్షకులు గ్రామాలలో నివసిస్తారు, ఆటవికులు అర ణ్యంలో నివసిస్తారు, మనం కొండలలో నివసిస్తాం. బ్రాహ్మణులు మంత్రయజ్ఞం చేస్తారు; కర్షకులు నాగలియజ్ఞం చేస్తారు; గోపాలకులు కొండయజ్ఞం చేస్తారు. అందు చేత మనం పర్వతోత్సవం జరపటం యుక్తంగా ఉంటుంది. నేను చెప్పినట్టు చెయ్యక పోయారో బలాత్కారంగా నైనా మీ చేత చేయిస్తాను."

గోపాలకులు ఇంద్రోత్సవం మానేసి, బ్రాహ్మణులను పిలిపించి గిరియజ్ఞోత్సవా నికి తగిన ఏర్పాట్లు చేశారు. పాయసాలూ, అపూపాలూ, ఉండ్రాళ్ళూ మొదలైనవి తయారయాయి. రకరకాల అన్నాలూ, మాంసాలూ, మధువులూ, పచ్చళ్ళూ, పెరుగూ, నెయ్యీ, పాలూ మొదలైనవి వీలునుబట్టి కావళ్ళలోనూ, బళ్ళ మీదా ఎక్కించారు. ఆబాలగోపాలంగా గోపికలూ, గోపకులూ వాద్యాలతో సహా వృద్ధగోపకుల వెంబడి, గోవర్ధనపర్వతానికి జాతర చేస్తూ బయలుదేరారు.

గోవర్ధనగిరి సమీపంలో ఒక మంచి స్థలంలో పేడతో అలికి, అందంగా ముగ్గులు పెట్టి ఉన్న స్థలాన, కృష్ణుడి అధ్వర్యాన



గిరిపూజ జరిగింది. కొండకు తాము తెచ్చిన ఆహారపదార్థాలు నైవేద్యం పెట్టారు, గోపాలకు లందరూ కొండకు పుష్పాంజలు లిచ్చి నమస్కారాలు చేశారు. అందరూ ఈ పనులలో నిమగ్నులై ఉన్న సమయంలో కృష్ణుడే పర్వతాధి దేవత లాగా కొండశిఖరాన ప్రత్యక్షమై, అందరూ ఆశ్చర్యంతో చూస్తూండగా, చెయ్యి చాచి నైవేద్య మంతా ఆరగించేశాడు. తరవాత అతను, "మీ భక్తికి మెచ్చాను. నాకు తృప్తి అయింది," అన్నాడు.

గోపకు లంతా చేతులు మోడ్చి, "దేవా, మే మంతా నీ దాసులం. నీ ఆజ్ఞకు లోబడి ఉన్నాం. మాకు ఏమి ఆనతిస్తావో ఇయ్యి. ఆ ప్రకారం నడుచుకుంటాం," అని పర్వత దేవుడితో అన్నారు.

"కొండరూపంలో ఉన్న నన్నే ఇక నుంచీ మీరు దేవతగా ఆరాధించండి. అలా చేస్తే మీ కోరిక లన్నీ తీరుతాయి, మీ గోవులు వృద్ధి పొంది అమృతధారలు పితుకుతాయి. నేను కామరూపంతో మీలో ఒకడుగా ఉంటూ ఉంటాను," అని చెప్పి కొండ మీది దేవుడు అదృశ్యమయాడు.

గోపాలకులు కొండ మీది కృష్ణుణ్ణీ, కొండ కింది కృష్ణుణ్ణీ ఒకే సమయంలో చూసి దణ్ణాలు పెట్టుకున్నారు. తరవాత వాళ్ళు



తమ పశువుల కొమ్ములకు పూజ చేశారు, వాటి మెడలకు చిరుగజ్జెలు కట్టారు, లతలు తెచ్చి వాటి తలలకు చుట్టారు, ఇంకా అనేక అలంకరణాలు చేశారు. పెద్దపెట్టున కేకలు పెడుతూ కొండ చుట్టూ ప్రదక్షిణం చేసి, అక్కడక్కడా దిగదుడుపులు తీశారు. తరవాత బ్రాహ్మణసంతర్పణలు చేసి, యజ్ఞశేషాన్ని తాము తమవారితో కలిసి సంతోషంగా తిన్నారు. ఉత్సవం పూర్తి అయింది. కృష్ణుడితో సహా అందరూ వ్రేపల్లెకు తిరిగి వెళ్ళిపోయారు.

అక్కడ స్వర్గంలో ఇంద్రుడికి తీరని అవమానమై, పట్టరాని కోపం వచ్చింది.





అతను సంవర్తం మొదలుగా గల మహామేఘాలను పిలిచి, "చూశారా, బృందావనంలో ఉండే నందగోపకుడు మొదలైన ముసలి గొల్లలు మదమెక్కి, ఏటా నాకు చేసే పూజలు మాని, కపటి అయిన కృష్ణుడి మాటలు విని, ఒక చచ్చుకొండకు చేశారు. అంతటితో అయిందనుకున్నారు కాబోలు. మీరు ఏడురోజుల పాటు ఎడాతెరిపి లేకుండా బ్రహ్మాండమైన వాన కురిసి, వాళ్ళకు బతుకుతెరువుగా ఉండే గోవులకు హాని కలిగించండి. ఆ విధంగా ఆ గోపకులకు హాని కలిగించి వచ్చారంటే నేను చాలా సంతోషిస్తాను. నేను కూడా మీ వెనకే



వచ్చి మీ ప్రతాపం ఏపాటిదో ఆకాశం నుంచి చూస్తాను," అన్నాడు.

గోకులంలో వాళ్ళకు ఈశాన్యదిక్కున మెరుపులు కనిపించాయి. గాలి తీవ్రంగా వీచింది. ఎండ దుస్సహమై, దుర్భరమైన ఉక్క పుట్టుకొచ్చింది. చంటిపిల్లలు అలమటించారు. పెద్దవాళ్ళకు కాళ్ళు బొబ్బలెక్కాయి. చెట్టుచేమలకు చీడ పట్టుకొచ్చింది. వాన వచ్చే లక్షణాలు బాగా కనిపించాయి.

తూర్పున మేఘం పట్టి ఉరుముతున్నది. "ఈ అకాలవర్ష మేమిటబ్బా?" అనుకున్నారు గోపపెద్దలు.

చూస్తూండగానే కాలమేఘాలు ఆకాశమంతటా సంచారం సాగించి, సూర్యుణ్ణి చాటు చేశాయి. ఆకాశం సాంతం మూసుకుపోయింది. పెళపెళార్భాటాలతో, కళ్ళు చెదిరే మెరుపులతో పిడుగులు పడనారంభించాయి. తరవాత వడగళ్ళు పడ్డాయి. ఆ వెంటనే, భూమ్యాకాశాల మధ్య ఎడం లేకుండా కుంభవర్షం ప్రారంభమయింది.

ఆ వర్షం చూసి గోపకులు బెదిరిపోయారు. ప్రళయం ప్రారంభమైనట్టు వారికి తోచింది. ఆ వర్షం నుంచి ప్రాణాలెలా కాపాడుకోవాలో, ఎక్కడకి పారి





పోవాలో వారికి తోచలేదు. పశువుల పాట్లు వర్ణనాతీతం. చెట్లు కూడా తీవ్రంగా దెబ్బ తిన్నాయి, కొన్ని పిడుగులు పడి మాడి పోయాయి, కొన్నిటిని గాలి పడగొట్టింది, మరి కొన్ని వరదలలో కొట్టుకుపోయాయి. గాలివాన అక్కడి అరణ్యా లన్నిటినీ భీభత్సం చేసేసింది. పక్షులు అసంఖ్యా కంగా చచ్చాయి.

ఇక మనుషుల దుస్థితి వర్ణనాతీతం. గుడిసెలు కూలిపోయాయి. బళ్ళు తిరగ బడ్డాయి. పశువులు చాలా నశించాయి. వంటలూ, వార్పులూ లేవు. పాలుపితకటం నిలిచిపోయింది. ఆ దుస్థితిలో గోపకులు కృష్ణుడి వద్దకు వెళ్ళి, "నువే మాకు దిక్కు! కాపాడు! కాపాడు!" అని మొర పెట్టుకున్నారు.

కృష్ణుడికి ఇంద్రుడి దుర్బుద్ధి అర్థ మయింది. తనకు జరగవలసిన ఉత్సవాన్ని కృష్ణుడు మాన్పించా డన్న రోషంతో, గోకులం మీద ఇంద్రుడిలా పగ దీర్చు కుంటున్నాడు. ఇలా చెయ్యటంతో కృష్ణుడు అసహాయుడై పోతాడని ఇంద్రుడి నమ్మకం. గోవర్ధనపర్వతాన్ని ఆకాశాని కెత్తి దాని కింద గోపకులకూ, గోవులకూ రక్షణ కలి గించటానికి కృష్ణుడు నిశ్చయించాడు.



అతను వెంటనే గోవర్ధనపర్వతాన్ని అవలీలగా భూమి నుంచి పెరికి, తన చేత్తో గొడుగు లాగా ఎత్తి పట్టుకున్నాడు. అతను దాన్ని పెకలించేటప్పుడు గండరాళ్ళు పెద్ద చప్పుడుతో కిందికి దొర్లి వచ్చాయి. చెట్లు కూలి పడ్డాయి. గుహలలో ఉండే సింహాలూ, బిలాలలో ఉండే పాములూ బయటికి వచ్చాయి. దాని మీద ఉండే విద్యాధరులు పారిపోయారు; తపస్సు చేసుకునే మును లకు తపోభంగ మయింది.

కృష్ణుడు గోవర్ధనగిరి ఎత్తి, "మీరూ మీ పశువులూ దీని కిందికి వచ్చెయ్యండి. వాన మిమ్మల్ని బాధించదు," అని గోపకు





లను పిలిచాడు. వాళ్ళు బిలబిలా పరిగెత్తుకుంటూ, తమ సామానులనూ, బళ్ళనూ, స్త్రీలనూ, పిల్లలనూ, గోవులనూ వెంటబెట్టుకుని కొండ కిందికి వచ్చేశారు.

ఏడురోజులూ కుంభవర్షం కురిసిన తరవాత ఇంద్రుడు మేఘాలను ఉపసంహరించి వెళ్ళిపోయాడు. ఆకాశం నిర్మలమయింది. గోపకుల మంతా కొండ కింది నుంచి ఇవతలికి వచ్చేసింది. కృష్ణు డా పర్వతాన్ని యథాస్థానంలో ఉంచేశాడు. తరవాత అతను కొండ మీద ఎక్కి కూర్చుని, చుట్టూ మేతలు మేస్తూ సంచరించే గోవులను చూడసాగాడు.

కృష్ణుడు చేసిన అద్భుతం చూశాక ఇంద్రుడు నిర్వికారంగా ఇంట్లో కూర్చోలేక పోయాడు. అతని కేదో బెదురు పుట్టింది; అందుచేత కొద్దిమంది దేవతలను వెంట తీసుకుని, ఐరావత మెక్కి, వజ్రాయుధం చేత బట్టి, భూలోకానికి దిగి, గోవర్ధనగిరి మీద కృష్ణుడు కూర్చుని ఉన్న చోటికి వచ్చి, కృష్ణుణ్ణి చూసి అతను దేవదేవుడని తెలుసుకుని, ఐరావతాన్ని దిగి, తల వంచి నమస్కరించాడు.

కృష్ణుడు ఇంద్రుణ్ణి చూడనట్టు నటిస్తూ నిశ్చలంగా కూర్చుని ఉండిపోయాడు. అతనికి తన మీద ఆగ్రహంగా ఉందని ఇంద్రుడు గ్రహించి, స్తోత్రపాఠాలు చదివాడు; గోపాలుడుగా ఉన్న కారణం చేత సర్వేశ్వరుడని గుర్తించలేక, తాను మదాంధత్వంతో అపచారం చేశానని ఒప్పుకున్నాడు; క్షమించ వలసిందని వేడుకున్నాడు. తరవాత అతను కృష్ణుణ్ణి గోపతిగా అభిషేకించి, అతడికి దివ్యాంబరాభరణాలు కట్ట బెట్టాడు.

చివరకు ఇంద్రుడు ఇలా అన్నాడు:

"కంసుడి కింద ఇంకా అనేకమంది రాక్షసులు నీకు హాని చేయాలని ఉన్నారు. వారందరూ నీ చేత చస్తారు. కంసుణ్ణి కూడా





చంపి నువు రాజువవుతావు. మీ మేనత్త అయిన కుంతికి ధర్మరాజూ, భీముడూ పుట్టాక నా వల్ల అర్జునుడు కలిగాడు. అతను నీకు భక్తుడై నిన్నాశ్రయిస్తాడు. నువ్వతన్ని ఆదరించి, కనిపెట్టి ఉండాలి, అతనికి కీర్తి తేవాలి; ముందుముందు కౌరవ పాండవ యుద్ధం జరుగుతుంది, ఆ యుద్ధంలో అసంఖ్యాకులైన రాజులు పాల్గొంటారు. అందులో అతనికి విజయం చేకూర్చిపెట్టాలి. ఇదే నా కోరిక."

దానికి కృష్ణుడు జవాబిస్తూ, "మా మేనత్త కొడుకులు అయిదుగురూ మహాపరాక్రమ సంపన్నులు. దేవతాంశలతో జన్మించినవారు. ఒకనాడు భూమి కంతకూ ఏలికలు కాబో తారు. అందరిలోకి మధ్య వాడైన అర్జునుడు అసాధారణ శౌర్యవంతుడు. ఈ విషయా లన్నీ నాకు ముందే తెలుసు. నువ్వెంత చెప్పావో అంతా చేస్తాను. నువు రావటం నాకు చాలా సంతోష కారణ మయింది. ఇక నువు నిశ్చింతగా వెళ్ళ వచ్చు," అని చెప్పాడు.

ఇంద్రుడు కృష్ణుడి కాళ్ళ మీద సాష్టాంగ పడి, అతని చుట్టూ ప్రదక్షిణంచేసి, ఐరావత మెక్కి, దేవతలతో సహా తన లోకానికి వెళ్ళిపోయాడు. తరవాత కృష్ణుడు కొండ దిగి వ్రేపల్లెకు వచ్చేశాడు.

అతను రాగానే గోపప్రముఖు లందరూ అతని చుట్టూ మూగారు. అతను మామూలు మనిషి కాదని వారి కీ సారి పూర్తిగా తెలిసి పోయింది. వాళ్ళు అతనితో, "బాబూ, మా మధ్య ప్రచ్ఛన్నంగా ఉంటున్న నువు నిజంగా ఎవరు? మూడులోకాలనూ రక్షించ గలిగినట్టున్నావు, ఇక్కడ గోవులను కాస్తున్నావే? నిన్ను చూస్తే మాకు భయంగా ఉంది, చెప్పొద్దూ!" అన్నారు.

కృష్ణుడు నవ్వి, "నేను మీవాణ్ణే గదా, ఈ ప్రశ్నలన్నీ దేనికి?" అన్నాడు. అందరూ పరమానందభరితులయారు.





# కృష్ణావతారం

కృష్ణుడికి యౌవనం సంప్రాప్తమయింది. అతని అందమూ, బలమూ వ్రేపల్లెలోని స్త్రీలనందరినీ సమ్మోహింపజేశాయి. అతను వేణువు ఊదితే వాళ్ళకు మతులు పోయేవి. తల్లిదండ్రులూ, భర్తలూ, బంధువులూ చివాట్లు పెడుతున్నా లక్ష్యపెట్టక, వాళ్ళు వేణునాదాన్నిబట్టి మందలు మందలుగా అతని దగ్గిరికి పోయేవాళ్ళు, అతనితో విచ్చలవిడిగా విహరించేవాళ్ళు. ఈ ఆడమూకను వెంట వేసుకుని కృష్ణుడు నృత్యాలు చేసేవాడు, పాటలు పాడేవాడు, యమునలో జలక్రీడలాడేవాడు, దాగుడుమూతల లాటి ఆటలాడేవాడు. కృష్ణుడు వారితో అహోరాత్రాలు ఇలాటి క్రీడలలో గడపసాగాడు.

ఒకనాటి అర్ధరాత్రి, చుట్టూ వలయంగా గోపికలను నిలిపి, మధ్య తా నుండి ఆటల వేడుకలో ఉండగా అరిష్టు డనే రాక్షసుడు ఒక బలమైన ఆబోతు రూపం ధరించి పెద్దగా రంకెలు పెడుతూ కృష్ణుణ్ణి ధ్వంసం చెయ్యటానికి వచ్చాడు.

ఆ ఆబోతు ఆకారమూ, అది పెట్టే భయంకరమైన రంకెలూ చూసి గోపికలు భయపడి కళ్ళు మూసుకుని, కృష్ణుడి చాటుకు వెళ్ళారు.

భయపడ వద్దని కృష్ణుడు గోపికలకు ధైర్యం చెప్పి, మీదికి వస్తున్న ఆ ఆబోతు కొమ్ములు రెండూ గట్టిగా పట్టుకుని కదల లేకుండా చేసి, బలంగా దాని మెడ మెలి పెట్టి, ఒక్క తోపు తోశాడు.

## 9. కంసుడి ఆహ్వానం



నోటా, ముక్కులా రక్తం కక్కుతూ ఆ ఆబోతు చచ్చి పడిపోయింది. అప్పటికి గోపికలకు ధైర్యం వచ్చి, అతన్ని చుట్టు ముట్టి, ప్రశంసించారు.

ఇక్కడ కృష్ణుడిలా ఉంటే, మధురా పురంలో కంసుడు నిత్యమూ చస్తున్నాడు. అతని మనస్సంతా వికలమయింది, జీవచ్ఛవం లాగా తయారయాడు. ఒక నాడతను తన సభాభవనానికి ఉగ్రసేనుణ్ణీ, వసుదేవుణ్ణీ, సత్యకుణ్ణీ, అంధకుణ్ణీ, కంపకుణ్ణీ, దారుకుణ్ణీ, విపృథుణ్ణీ, బభ్రుణ్ణీ తదితర యదు, భోజ ప్రముఖులను పిలిపించి, ఇలా అన్నాడు:



"మీ రందరూ గొప్ప మేధావులు, జ్ఞానులు, ఎలాటి సమస్యలనైనా పరిష్కరించ గలవారు, నాకు ఎంతో మేలు చేయాలనే దృష్టిగలవారు. అయినప్పటికీ, నా కిప్పుడొక పెద్ద ప్రమాదం వచ్చిపడినా, ఏ కారణం చేతనో మీరు చూస్తూ ఉండి పోయారు. నందగోపుడికి పుట్టిన కృష్ణుడనే వాడు నన్ను నిర్మూలించటానికి సిద్ధంగా ఉన్నాడు. వాడు అశ్రద్ధ చేసిన జాడ్యంలాగానూ, గాలి తోడైన మేఘంలాగానూ, విషవృక్షంలాగానూ దిన దినమూ వృద్ధి పొందుతున్నాడు. వా డెలాటి అంశతో పుట్టినదీ, ఎంత ఆలోచించినా అంతుపట్టకుండా ఉన్నది. ఏ దేవతాంశనో పుట్టాడేమోననిపిస్తుంది. ఎందుకంటే వాడి చరిత్రంతా అమానుషంగానే ఉన్నది. చెబుతాను వినండి."

కంసుడు వారితో కృష్ణుడి పనులన్నీ వివరించి చెప్పాడు: సరిగా కళ్ళు తెరవని దశలోనే పూతనను చంపాడు; బోర్లా పడటం కూడా రాని రోజుల్లోనే బండిని ఒక్క తన్నుతో తుత్తునియలు చేశాడు; తప్పటడుగులు వేసే ఈడున జంట మద్ది చెట్లకు రోలు తగిలించి లాగి, కూల్చేశాడు; ఒక టేమిటి? ఆరోజు కారోజు గడుస్తున్న కొద్దీ కాళియుణ్ణి మర్దించాడు, ప్రలంబుణ్ణీ,



ధేనుకుణ్ణీ చంపించాడు, అరిష్టుణ్ణి చంపాడు. బాల్యం మాట దేవు డెరుగు, వయసు వచ్చిన వాళ్ళు మాత్రం ఇలాటి పనులు చేయ గలిగారా? ఏడురోజులు ఎడాతెరిపి లేకుండా కుంభవర్షం కురిస్తే కొండను అవలీలగా గొడుగల్లే ఎత్తేసి పట్టుకున్నాడు. ఆ అమా నుషకార్యం ఒక్కటే చాలు, మిగతావి చెప్పుకో నవసరం లేదు.

ఇదంతా చెప్పి కంసుడు వారితో మళ్ళీ ఇలా అన్నాడు:

"ఇక మిగిలి ఉన్న రాక్షసుడు కేశి ఒకడే. కేశి కూడా కృష్ణుడి చేత చచ్చా డంటే ఆ తరవాత వచ్చేది నా వంతే. చంప మరిగినవాడు నన్ను మాత్రం విడిచి పెడతాడా? వట్టిది. కృష్ణుడే అనుకుంటే వాడంతవాడు వాడి అన్న బలరాము డొకడు కూడా ఉన్నాడు. అసలు జరిగిన దేమిటో నారదుడు నాకు చెప్పాడు. దేవకీదేవి అర్ధ రాత్రి వేళ కొడుకును కంటే, ఈ వసుదేవుడు వాణ్ణి తీసుకుపోయి నందగోపుడి భార్య పక్కలో పెట్టి, ఆమె కన్న ఆడపిల్లను తెచ్చి తన భార్య పక్కలో పెట్టాడు. అది కూడా నాకు అందకుండా ఆకాశాని కెగిరి, వింధ్యవాసినీ దేవత అయి కూర్చున్నది. ఇంతకాలంగా అయినవాడల్లే నటిస్తూ



వసుదేవుడు నా కింత ద్రోహం చేశాడు. నేను ఎంత మర్యాద చేశానో, నాకు అంత గొప్ప ద్రోహం చేశాడు."

తరవాత కంసుడు వసుదేవుడి కేసి తిరిగి, "నీ ఆలోచన నాకు తెలుసు: నీ కొడుకు చేత నన్ను చంపించి, వాణ్ణి మధురకు రాజు చేసి ఏలింతా మనుకుంటున్నావు. కాని నీ కొకటి తెలీదు: ఇంద్రుడే వచ్చినా నన్నేమీ చెయ్యలేడు. అక్కడే భ్రమపడ్డావు. చక్రవర్తి వంశంలో పుట్టావు, చిన్నతనం నుంచీ మా తండ్రి దగ్గిర పెరిగావు. మా చెల్లెల్ని పెళ్ళాడి, యాదవు లందరికీ గురు స్థాన మైనావు; ఇలాటి నీచమైన పని



చేస్తావా? నీ పాతకం నీకే ఉండనీ, నేను నిన్ను చంపను. బంధు మిత్ర బ్రాహ్మణ హత్యలు చేసినవాణ్ణి కాను, చేయను కూడా. నిన్ను వెళ్ళగొట్టవచ్చు, కాని అది కూడా చెయ్యను. నీ అంతట నువు పోతేపో, ఉంటే ఉండు," అన్నాడు.

తరవాత కంసుడు భోజవంశం వాడైన అక్రూరుడి కేసి తిరిగి, "నేను ఈ యేడు నా ధనుస్సుకు గొప్ప ఉత్సవం చెయ్యబోతున్నాను. దానికి ఎక్కడెక్కడి రాజులూ వస్తారు. చాలా రోజులపాటు విందు చెయ్యవలసి ఉంటుంది. గోకులం నుంచి పుష్కలంగా పెరుగూ, పాలూ, నెయ్యీ, అడవి తేనే కావలసి వస్తుంది. అందుచేత నువు గోకులానికి వెళ్ళి ఇవన్నీ వచ్చేటట్టు అజ్ఞ ఇయ్యి. తిరిగి వచ్చేటప్పుడు నంద గోపుణ్ణీ, అతని కుటుంబాన్నీ వెంట బెట్టుకురా. నా మేనల్లుళ్ళయిన బలరామకృష్ణులను చూడాలని నాకు మహా వేడుకగా ఉంది. వాళ్ళు మహా బలులట. నేను తమను చూడాలని ఉవ్విళ్ళూరుతున్నానని నమ్మకం కలిగే లాగా చెప్పి, వాళ్ళను వెంట బెట్టుకురా. నా దగ్గిర ఇద్దరు మేటి మల్లు లున్నారు. వీళ్ళకూ, వాళ్ళకూ పోటీ పెట్టి వాళ్ళ బలపరాక్రమా లెలాటివో చూస్తాను. వాళ్ళిద్దరినీ తెచ్చాపంటే నాకు మహోపకారం చేసిన వాడవవుతావు. వసుదేవు డేమన్నా చెవిలో ఊదుతాడేమో, అదేమీ వినిపించుకోక, నువు వెంటనే బయలుదేరు," అన్నాడు.

కంసుడి పరివారంలో కృష్ణుణ్ణి భగవంతుడి అవతారంగా భావించే వారు చాలా మంది ఉన్నారు. వారిలో అక్రూరు డొకడు. కృష్ణుణ్ణి కళ్లారా చూసి తరించే అవకాశం దొరికినందుకు లోపల పొంగి పోతూ, అక్రూరుడు కంసుడి వద్ద సెలవు పుచ్చుకుని అప్పటికప్పుడే రథం ఎక్కి, వ్రేపల్లెకు బయలుదేరాడు.






మొత్తం మీద కంసుడు వసుదేవుణ్ణి గురించి అంతమంది మధ్యా అలా మాట్లాడటం పెద్దల కందరికీ కర్ణకఠోరమనిపించింది. వారిలో వృద్ధుడైన అంధకుడనే యాదవుడు నిర్భయంగా ముందుకు వచ్చి, కంసుడితో ఇలా అన్నాడు:

"నువ్వన్న మాటలు రాజోచితమైనవి కావు. ముందూ వెనకా ఆలోచించకుండా పెద్దవాణ్ణి పట్టుకుని ఎంతెంతమాట లన్నావు! ఇలాటి ప్రవర్తనతో నీ తల్లిదండ్రులకూ, వంశానికీ తీరని కళంకం తెచ్చావు. వసుదేవుడు తన కొడుకును దాచాడని తప్పు పట్టు తున్నావా? తల్లిదండ్రులు తమ సంతానాన్ని కాపాడుకోవటానికి అడ్డమైన అగచాట్లూ పడరా? నీ తల్లిదండ్రులు నీ కోసం ఏ పాట్లూ పడకుండానే నువ్వింత వాడివయావా? నీ ధోరణి మాకు ఏమీ బాగా లేదు. నీతో తెగతెంపులు చేసుకుని వెళ్ళిపోలేక పోవటం మాదే బుద్ధి తక్కువ. మా కన్న ఆ అక్రూరుడు చాలా అదృష్టవంతుడు. కృష్ణుణ్ణి చూసి వచ్చిన అక్రూరుణ్ణి చూసి మేము కూడా పవిత్రుల మవుతాం. కృష్ణుడు యిక్కడికి వచ్చాడంటే నీకు చావు తప్పదు. నీ కెవరూ అడ్డపడలేరు. అందుచేత నువే ముందు గోకులంలో వున్న కృష్ణుడి వద్దకు వెళ్ళి, అతన్ని మంచి చేసుకుని బాగుపడు."

అంధకు డిలా అనే సరికి పట్టరాని కోపం వచ్చి, కంసుడు చివాలున లేచి వెళ్ళిపోయాడు. మిగిలిన వారు కూడా తమతమ ఇళ్ళకు వెళ్ళారు.

అక్రూరు డింకా గోకులం వెళ్ళక పూర్వమే కంసుడు కేశి అనే రాక్షసుణ్ణి బృందావనానికి పంపాడు. గుర్రం రూపు గల ఆ రాక్షసుడు బృందావనం చేరి, అక్కడి అరణ్యంలో మేతలు మేసే పశువులనూ, గోవులను కాసే వారినీ నాశనం చెయ్యసాగాడు. ఆ గుర్రాన్ని, భయంకర







రెట్టింపయింది. అది పెద్దగా నోరు తెరిచి, దంతాలను భయంకరంగా బయట పెట్టి, పెద్దపెట్టున సకిలిస్తూ కృష్ణుడి పైకి వచ్చింది. అది వెనకకాళ్ళపై నిలబడి ముందు కాళ్ళెత్తి తన పైన దూకబోతే, కృష్ణుడు ఒడుపుగా పక్కకు తప్పుకుని, చప్పున తన చెయ్యి దాని నోట దూర్చి, దాని నాలుక మొదలంట పట్టుకున్నాడు.

వెంటనే గుర్రం ఆట కట్టింది. అది, కృష్ణుడి పట్టు తప్పించుకోలేక, అతన్ని కరవలేక, ఇంకేమీ చెయ్యలేక, కాళ్ళు నేల కేసి తాటిస్తూ, గుడ్లు వెళ్ళబెట్టి అతి హీన స్థితిలో పడింది. కృష్ణుడు దాని నాలుక పెరికి, కంఠం చీల్చి, పళ్ళు రాల్చి, దాని డొక్కలో చెయ్యి దూర్చి కెలికి, మహాదారుణంగా చంపేశాడు.

మైన దాని అవతారాన్నీ చూస్తే గోకులాని కంతకూ దడ పుట్టుకొచ్చింది. ఆ గుర్రం పశువుల కండలు చీల్చి తినేది, వాటి రక్తం తాగేది. అది అరణ్యంలో ఎక్కడా ఒక్క మృగం లేకుండా చేసి గోపకుల నివాసాల కేసి వచ్చింది. దాన్ని అంత దూరంలోనే చూసి గోకులంలో వాళ్ళు కృష్ణుణ్ణి శరణు జొచ్చారు. కృష్ణుడు వాళ్ళకు భయపడ వద్దని చెప్పి, చప్పట్లు చరుస్తూ గట్టిగా కేక పెట్టి కేశిని కవ్వించాడు.

ఇలా కవ్వించటం చూసి గుర్రానికి చాలా పౌరుషం వచ్చింది. కృష్ణుడి చేతిలో ఎలాటి ఆయుధమూ లేకపోయేసరికి దాని పౌరుషం

గోకులంలో వాళ్ళంతా పెద్దనిట్టూర్పులు విడిచారు. అందరూ చుట్టూరా చేరి అతన్ని ఎంతగానో అభినందించారు. గోపికలు పూల దండలు తెచ్చి కృష్ణుడి మెడ నిండా వేశారు.

అప్పుడు నారదుడు అదృశ్యంగా ఆకాశంలో ఉండి, తన పేరు చెప్పుకుని కృష్ణుడితో, "నాయనా, కలహప్రియుణ్ణయిన నేను నీ యుద్ధం చూడటానికి ప్రత్యేకంగా దేవలోకం నుంచి వచ్చాను. నువు చూపిన





ఈ పరాక్రమం ఇంద్రుడికి చెల్లేను, శివుడికి చెల్లేను, మరెవరికీ సాధ్యం కాదు. ఆ ఇంద్రుడే అయినా ఎదుర్కోలేని ఈ కేశిని సునాయాసంగా చంపావు. వీణ్ణి చంపినందుకు నువు కేశవు డనే పేరుతో ప్రసిద్ధుడి వవుతావు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఈ లోపల అక్రూరుడు మధుర నుంచి, మేలైన గుర్రాలను పూన్చిన రథంలో బయలుదేరి, ఎక్కడా ఆగకుండా సాయంకాలం వేళకు వ్రేపల్లె చేర వచ్చాడు. సూర్యాస్తమయమై, చీకట్లు కమ్ముతూండగా, వాటిని చెదరగొట్టుతూ చంద్రుడు ఉదయించాడు. గోకులం సందడిగా ఉన్నది. ఎక్కడ చూసినా వేలకొద్దీ గోవులు. గోపకులు వాటిని పేర్లు పెట్టి పిలుస్తున్నారు. పాలుపితికే ధ్వనులు వినబడుతున్నాయి. ఇలా కోలాహలంగా ఉన్న గోకులం మధ్యకు అక్రూరుడు రథాన్ని తోలు కొచ్చి, అంత దూరాన బలరామకృష్ణులను చూసి పరమానంద భరితుడయాడు. అతను చప్పున కృష్ణుణ్ణి సమీపించి తన గోత్రనామాలు చెప్పుకుని, కృష్ణుడి పాదాలకు నమస్కారం చేశాడు. కృష్ణు డతన్ని లేవనెత్తి కౌగిలించుకుని, కుశల ప్రశ్నలు వేసి, బలరాముడి వెంట అతన్ని తన ఇంటికి తీసుకుపోయాడు.

అక్రూరుడి కోరిక మీద నందగోపుడు మొదలైన పెద్దలందరూ అతని వద్దకు వచ్చారు. వారితో అక్రూరు డిలా అన్నాడు:

"కంసమహారాజు తన ధనువుకు గొప్పగా ఉత్సవం చేయ తలపెట్టాడు. మీ రందరూ మీరు మీరు చెల్లించ వలసిన కప్పాలు తీసుకు వచ్చి చెల్లించండి, విందులకు గాను నేతులు మొదలైనవి తీసుకు రండి. ఈ ఉత్సవానికి ఈ బలరామకృష్ణులు కూడా రావాలని కంసమహారాజు మహావేడుక పడుతున్నాడు. మీరు వెంటనే ప్రయాణం కట్టండి. నేను వీ రిద్దరినీ రథం మీద తీసుకుని బయలుదేరుతాను."





# కృష్ణావతారం

ఆ రాత్రి అక్రూరుడు బలరామకృష్ణులతో సహా సుఖమైన భోజనం చేసి, ఒకచోటనే అందరూ పడుకున్నప్పుడు, "నాయనా, తల్లిగర్భం నుంచి బయటపడుతూనే ఇలాటి హీనజీవితంపాలై, ఎన్నో ఘనకార్యాలు చేశావు. ఇంక ఈ జీవితం చాలు. నీ అసలు వంశానికి కీర్తిప్రతిష్ఠలు చేకూర్చు. నీ తండ్రి వసుదేవు డెంతో గొప్పవాడు. మీ ఇద్దరిలాటి కొడుకులుండి కూడా, కంసుడికి భయపడుతూ, ఆ దుర్మార్గుడి చేత అవమానాలుపడుతూ, కొడుకులను అడవుల పాలు చేశానే అని మహాకుమిలి పోతున్నాడు. కంసుడు మీ తండ్రిని అనరాని మాటలంటూంటే, మేమందరమూ చేసేదిలేక, తలలు వంచుకుని, కంట తడిపెడతాం. ఇక మీ తల్లి దేవకీదేవి దుఃఖం చెప్పటానికే లేదు. వరసగా ఆమె గర్భాన పుట్టిన బిడ్డలందరినీ కంసుడు చంపేశాడు. అంత మంది పిల్లలను కని కూడా ఆ ఇల్లాలు ఒక్క బిడ్డకు పాలిచ్చి ఎరగదు. ఇంత చక్కనివాడివి, నీ ముఖం ఎలా ఉంటుందో ఆ తల్లికి తెలుసునా? ఆవిడ మాతృత్వం సఫలం చేసే భారం నీపైన ఉన్నది. నీవంటి కొడుకును పెట్టుకుని ఆవిడ అహర్నిశలు దుఃఖంలో మునిగి తేలుతున్నదంటే, ఇంతకంటె గొడ్రాలితనమే మేలు గదా?" అంటూ అక్రూరుడు కృష్ణుడికి హితోపదేశం చేశాడు.

అయన మాటల సారాంశం కృష్ణుడికి అర్థమయింది. అతను మధురానగరానికి

## 10. బలరామకృష్ణుల మధురాగమనం






వెళ్ళి, కంసుణ్ణి చంపి, తన తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులకు ఆనందం చేకూర్చాలి.

తెల్లవారింది. అక్రూరుడూ, బలరామకృష్ణులూ కాలకృత్యాలు తీర్చుకుని రథం ఎక్కారు. అక్రూరుడు రథం తోలుతూ వ్రేపల్లె దాటి, మధురకు వెళ్ళే దారిపట్టాడు. కొందరు గోపికలు రథాన్ని కొంతదూరం వెంబడించారు. కృష్ణుడు వెళ్ళిపోవటం వాళ్ళకేమీ బాగాలేదు. కొందరు అక్రూరుణ్ణి బాగా తిట్టుకున్నారు. మరికొందరు, "రేపు ఏ రాక్షసుడన్నా మనమీద వచ్చిపడితే ఎవరు కాపాడతారు? కృష్ణుణ్ణి వెళ్ళిపోనిస్తున్న మనవాళ్ళు వెర్రివాళ్ళుకారా?" అని అడిగారు. వాళ్ళు కొంతదూరం రథాన్ని వెంబడించి, అతివేగంగా వెళ్ళే రథాన్ని అనుసరించలేక ఆగి, రథం లేపే దుమ్ము కనబడకుండా పోయేదాకా చూసి, తిరిగి వెళ్ళిపోయారు.

మధ్యాన్నం దాకా నడిచి రథం కాళిందీ తీరాన ఒక కదంబవృక్షం నీడలో ఆగింది. అక్రూరుడు బలరామకృష్ణులతో, "నేను నదిలో స్నానంచేసి, అర్ఘ్యం విడిచి, ఇప్పుడే వస్తాను. అంతదాకా మీరు రథంలోనే ఉండండి. ఈలోపుగా గుర్రాలు గరిక మేస్తాయి," అని చెప్పి, నదిలోకి దిగి, నడుములోతు నీటిలో మునిగాడు.

అలా మునిగిన అక్రూరుడికి నీటిలో రసాతలం కనబడింది. అక్కడ వాసుకీ, కర్కోటకుడూ మొదలైన నాగశ్రేష్ఠులు తిరుగుతున్నారు. చాలా అందంగా నిర్మించిన రత్నమండపం లోపల వెయ్యి తలల ఆదిశేషుడు కనిపించాడు. అతని శరీరం స్వచ్ఛంగానూ, తెల్లగానూ, చుట్టలు చుట్టుకుని ఉన్నది. పడగలు ఎత్తి ఉన్నాయి. అతని నాలుకల వరస మెరుపుతీగలాగా చలిస్తున్నది. అతని పార్శ్వాల రోకలీ, నాగలీ, తాటిచెట్టూ గుర్తులు గల జెండా





లున్నాయి. ఆ శేషుడి చుట్టలపైన కృష్ణుడు, నల్లగా, తామరకన్నులతోనూ, పసుపుపచ్చని బట్టతోనూ కూర్చుని కనిపించాడు.

అలా కనిపించిన కృష్ణుణ్ణి అక్రూరుడు మంత్రాలతో ఆరాధించి, మానసికంగానే వివిధ అర్చనాసామగ్రితో అర్చించాడు. తరవాత అతను నీటిలో నుంచి పైకి లేచి చూసేసరికి, రథం మీదనున్న బలరామకృష్ణుల దేహాలపైన తన అర్చన తాలూకు గుర్తులు కనిపించాయి. అక్రూరు డది చూసి మరింత అద్భుతపడి, మళ్ళీ నీటిలో మునిగి, తిరిగి ఆదిశేషుణ్ణీ, అతని పైన కూర్చుని ఉన్న కృష్ణుణ్ణీ చూశాడు.

చివరకు అక్రూరుడు తన అనుష్ఠానాలు ముగించుకుని రథాన్ని చేరరాగానే కృష్ణుడు, "అక్రూరుడా, చాలా ఆలస్యం చేశావు. పాతాళంలో ఏదో చోద్యం కనిపించినట్టున్నదే? నీ ముఖాన ఆశ్చర్యం చూస్తే అలాగే ఉన్నది," అన్నాడు.

"దేవా, నువు దగ్గరలో ఉండటం కన్న పెద్ద చోద్యం ఇంకేం కావాలి? నువూ, నీ అన్నా ఇక్కడ కనిపించినట్టే నీటిలో కూడా కనిపించారు. నీ వాస్తవరూపం వర్ణించటం బ్రహ్మకైనా సాధ్యంకాదే, నేనేపాటివాణ్ణి? నా పైన వాత్సల్యం ఉంచి అనుగ్రహించు. మనం ఇంక బయలు దేరాలి. కంసుడు మీ కోసం ఆత్రంగా ఎదురుచూస్తూ ఉంటాడు. సూర్యాస్తమయం లోపల మనం నగరం చేరాలి," అన్నాడు అక్రూరుడు.

కృష్ణుడు నవ్వి, "నీ చేతిలో ఉన్నాం, మా చేతిలో ఏమీలేదు," అన్నాడు.

రథం తిరిగి బయలుదేరి సాయంకాలం వేళకు మధురానగరం చేరింది. కృష్ణుడు అక్రూరుడితో, "నగరం అనేది ఎట్లా ఉంటుందో ఎన్నడూ చూసినవాళ్ళంకాము. కంసమహారాజును చూసినదాకా ప్రాణాలాగేటట్టులేవు, అందుచేత ముందుగానే

నాలుగు వీధులూ చుట్టివస్తాం, అనుమతించు," అన్నాడు.

అక్రూరుడు వాళ్ళను రథం దించి, "మీకు వసుదేవుడి ఇంటికి వెళ్ళాలనిపించ వచ్చు. కాని ఆ పని చెయ్యకండి. ముందు తనకు కనపడకుండా వసుదేవుణ్ణి చూస్తే కంసుడికి కోపం వస్తుంది," అని చెప్పి, బలరామకృష్ణులను తీసుకొచ్చానని కంసుడితో చెప్పటానికి వేగంగా రథం తోలుకుంటూ వెళ్ళిపోయాడు.

కట్టుతాళ్ళు విప్పిన ఏనుగుల జంటలాగా బలరామకృష్ణులు మధురానగరపు రాజవీధి వెంబడి, నగరపు వింతలను ఆశ్చర్యంగా చూసుకుంటూ, ముందుకు నడవసాగారు. వారలా నడుస్తుంటే అక్కడి పౌరులు వారిని చూసి రకరకాలుగా మాట్లాడుకున్నారు.

కొంతదూరం వెళ్ళేసరికి బలరామకృష్ణులకు రంగకారుడనే చాకలి కనిపించాడు. అతను రకరకాలబట్టలు మడతలుపెట్టి మూటగట్టి తీసుకుపోతున్నాడు.

"ఏమోయ్, చాకలీ? మేం రాజుగారిని చూడబోతున్నాం. రాజసభకు వెళ్ళేవాళ్ళు మంచిమంచి బట్టలు కట్టుకుని మరీ వెళ్ళాలి గద. అందుచేత నీ దగ్గిర ఉన్న




బట్టల్లో మంచివి చూసి మా కియ్యి, మంచివాడివి!" అన్నాడు కృష్ణుడు.

ఆ మాటకు చాకలి చాలా కోపించి, "అడవుల్లో పశువుల మధ్య తిరిగే అనాగరికపు మొహాలకు కంసమహారాజు కట్టే బట్టలు కావలిసివచ్చాయా? ఈ బట్టలంటే ఏమిటనుకున్నారు? ఎక్కడెక్కడి రాజులో కంసమహారాజుకు కానుకగా పంపినవి. పిచ్చిపిచ్చిగా మాట్లాడక, పదండి," అన్నాడు.

కృష్ణుడికి కోపం వచ్చింది. అతను కత్తి పెట్టి చాకలి మెడ మీద ఒక్కటి పెట్టాడు. తల తెగి కిందపడి చాకలి కాస్తా చచ్చాడు. వాడి కెందరో భార్యలున్నారు. వాళ్ళు పరి





"మేము దేశాంతరం నుంచి వచ్చిన మల్లులం. మీ రాజుగారినీ, రాజ్యాన్నీ, విల్లుకు జరగబోతున్న గొప్ప ఉత్సవాన్నీ చూసి సంతోషింతామని వచ్చాం. నీ గొప్ప నువు చెప్పుకున్నావనుకో. మేము ఊరికే నిన్ను ఎలా మెచ్చుకోం? ఆ పాత్రలో ఉన్న గంధం ఇచ్చావంటే, మేము పూసుకుని, నిన్ను మెచ్చుకుని వెళ్ళి రాజుగారి దర్బారులో కాస్త కళగా కూర్చుంటాం," అన్నాడు కృష్ణుడు.

ఆ మాటకు కుబ్జ నవ్వి, "సరే తీసుకోండి," అంటూ తన పాత్రలోని గంధం ఇచ్చేసింది. కృష్ణుడు ఆ గంధాన్ని ముందు బలరాముడి కిచ్చి, తనకు కావలిసినది తాను కూడా పూసుకుని, మిగిలినది అక్కడ ఉన్న పిల్లల కిచ్చేశాడు. అతనికి ఆ కుబ్జను మామూలు మనిషి చెయ్యాలనిపించింది. అందుకని అతను, ఆ కుబ్జ కాలివేళ్ళను తన కాలివేళ్ళతో నొక్కిపట్టి, చూపుడు వేలుతో ఆమె ముఖం పైకెత్తాడు. వెంటనే ఆమె రూపు మారిపోయి, ఆమె శరీరం వంకలు తీరింది. సన్నని నడుమూ, చదునైన వీపూ, దీర్ఘమైన దేహమూ ఏర్పడ్డాయి. ఆమె తనను తాను చూసుకుని అద్భుతమూ, ఆనందమూ పొంది, నవ్వుతూ కృష్ణుణ్ణి చూసి, "నా కెంతో మహోపకారం చేసిన మహానుభావుడవు, మా యింటికి వచ్చి నన్ను ధన్యురాలిని చెయ్యి. నీ దారిన నువు పోతానంటే ఊరుకోను," అన్నది, అతని చేతిని తన చేత్తో పట్టుకుని.

"నా కిప్పుడు బోలెడంత పని ఉన్నది. మళ్ళీ వస్తాను. నువు నా దానివే ననుకో," అంటూ కృష్ణుడు మంచిగా ఆమె చెయ్యి విడిపించుకుని, బలరాముడితో సహా ముందుకు సాగాడు. వాళ్ళిద్దరూ తమ ఉద్దేశాలనూ, బింకాన్నీ పైకి కనబడనీయక, మామూలు గొల్లవాళ్ళలాగానే ప్రవ

ర్రించుతూ, నెమ్మదిగా నడుచుకుంటూ కంసుడి మందిరద్వారాన్ని చేరుకున్నారు. అక్కడ చాలా కోలాహలంగా ఉన్నది. కంసుడికి ఎందరెందరో రాజులు పంపిన కానుకలు, ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ, సుందర వస్తువులూ వేల సంఖ్యలో ఎడతెగకుండా వచ్చి చేరుతున్నాయి.

లోపల ఆయుధాగారం ఉన్నది. దాన్ని బంగారంతోనూ, పెద్దపెద్ద మణులతోనూ చాలా అందంగా నిర్మించారు. అనేకమంది రాజులు దాన్ని చూడవచ్చారు. అసంఖ్యాకులైన భటులు దానికి రక్షగా ఉన్నారు.

"కంసమహారాజుగారి విల్లు ఇక్కడేనా ఉండేది? దాన్ని చూద్దామని చాలా దూరం నుంచి వచ్చాం. ఏదీ? చూడవచ్చునా?" అని బలరామకృష్ణులు అమాయికంగా అనేసరికి, రక్షకభటులు వాళ్ళను విల్లున్న చోటికి తీసుకుపోయారు. అది బ్రహ్మాండమైన విల్లు; తక్షకుడి శరీరంలాగున్నది.

దాన్ని చూసి కృష్ణుడు, "దీన్ని ఎక్కుపెట్టటం దేవతలకూ, దానవులకూ కూడా సాధ్యం కాదంటారే. నిజం ఏమిటో చూస్తాం," అంటూ ఆ విల్లును ఒక్కచేత అవలీలగా ఎత్తి, చులాగ్గా నారి సంధించి మీటాడు. అది చేసిన మోత భయంకరంగా అన్ని దిక్కులా ప్రతిధ్వనించింది. అక్కడ ఉన్నవారంతా నిర్ఘాంతపోయి చూస్తూండగా, కృష్ణుడు ఆ వింటిని తన పిడికిటపట్టి పెళుక్కున విరిచేశాడు. గొప్ప ఉత్సవం చేసుకోనున్న ఆ విల్లు కాస్తా ముక్కలుముక్కలయింది. కృష్ణుడు తనకేమీ తెలియనట్టు చల్లగా జనంలో కలిసిపోయి ఆయుధాగారం నుంచి బయటపడ్డాడు. ఆయుధాగారాన్ని రక్షించే భటులు ఒకరి కన్న ఒకరు ముందు పరిగెత్తి కంసుడి అంతఃపురానికి వెళ్ళి, జీరపోయిన గొంతులతో, జరిగిన సంగతంతా కంసుడికి నివేదించారు.





# కృష్ణావతారం

ఆయుధాగారపు భటులు వచ్చి తన విల్లు విరిగిందని చెప్పగానే, కంసుడికి తన వీపే విరిగినట్టయింది. అతను పుట్టెడు విచారంతో లేచి, ఉత్సవానికి చేసిన ఏర్పాట్లు చూడబోయాడు. ఒక అందమైన రంగస్థలం ఏర్పాటుచేసి, రాజూ, మంత్రులూ, పై నుంచి వచ్చే రాజులూ, రాజబంధువులూ, భృత్యులూ, పౌరులూ, విలాసినులూ కూర్చోవటానికి వేరువేరు స్థలాలు నిర్మించి, వాటికి మెట్లు అమర్చారు. అంతటా కనులపండువైన శిల్పాలూ, తెరలూ, తోరణాలూ ఉన్నాయి. అంతటా అలంకార వస్తువులూ, పూలూ, ధూపాలూ ఏర్పాటై ఉన్నాయి. వీటన్నిటినీ పరీక్షించి, పనివాళ్ళకు అవసరమైన పనులు చెప్పి, కంసుడు తన అంతఃపురానికి తిరిగివచ్చి, చాణూరముష్టికులనే మల్లులను పిలిపించి, "ప్రపంచంలో మీసాటి మల్లులు లేరు. బలరాముడూ, కృష్ణుడూ అనే గొల్లకుర్రకుంకలు ఇప్పటిదాకా అడవిలో తిరిగినవాళ్ళు. వాళ్ళకు ధైర్యమూ, ప్రతాపమూ, శౌర్యమూ ఏ కోశానా లేవు. వాళ్ళు మీతో తలపడినప్పుడు మీరు వాళ్ళతో చాలాసేపు పెట్టుకోక, ఒక దెబ్బన చంపేసినట్టయితే నాకు చాలా మేలు కలుగుతుంది," అన్నాడు.

రాజు ఈ విధంగా అడిగినందుకు సంతోషించి మల్లులు, "మా కింతగా చెప్పాలా? ఆ గొల్లబ్బాయిలు చిక్కగానే నలిపేస్తాం. మా సంగతి తమ రెరగరా? ఇది మా కొక పనా?" అని చెప్పి, పెద్దగా

## 11. కంసవధ



మల్లులు చరిచి, బొబ్బలుపెట్టి తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

తరవాత కంసుడు మహామాత్రు డనే మావటివాణ్ణి పిలిపించి, "నువు నాకు చాలా ఆప్తుడివి. నీతో ఇప్పుడు ముఖ్యమైన పని పడింది. వసుదేవుడి కొడుకులు గొల్ల పల్లెలో పెరిగి, గొల్లలలాగే తయారైనారు. వాళ్ళు మహా చెడ్డవాళ్ళు, బలవంతులు. వాళ్ళిక్కడికి వచ్చి ఉన్నారు. ముందుగానే వేకువవేళ నువు కువలయాపీడాన్ని తీసుకుని రాజభవనద్వారం దగ్గిర సిద్ధంగా ఉండి, వాళ్ళు అక్కడికి రాగానే వాళ్ళ మీదికి దాన్ని ఉసిగొల్పు. కువలయాపీడం వాళ్ళిద్దర్నీ క్షణంలో పీనుగులను చేసేస్తుంది," అన్నాడు.

మర్నాడు తెల్లవారింది. రాజ శాసనం ప్రకారం అందరూ వచ్చి రంగస్థలాన ఎవరెవరి స్థానాలలో వారు కూర్చుని, బలరామ కృష్ణుల రాక కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నారు. కంసుడు చాలా ఎత్తున బంగారు సింహాసనం మీద, తెల్ల బట్టలూ, ముత్యాలతో కూడిన ఆభరణాలూ ధరించి, తెల్లటి గొడుగూ, వింజామరాలు వేయించుకుని, తెల్లని బట్టలు కట్టిన విలాసినులతో సహా చంద్రుడి లాగా ప్రకాశిస్తున్నాడు.

చాణూర ముష్టికులు మదించిన ఏనుగుల లాగా ఉత్సవ రంగం ప్రవేశించి, కంసుడి కెదురుగా నిలబడ్డారు. మహామాత్రుడు కువలయాపీడాన్ని ఎక్కి వచ్చి, ద్వారం వద్ద నిలిపి, బలరామ కృష్ణుల రాక కెదురు చూస్తున్నాడు.

కొంచెం సేపటికి బలరామ కృష్ణులు ద్వారం వద్దకు వచ్చారు. వారిని అందరూ అమితాశ్చర్యంతో చూశారు. వాళ్ళు ఎంతో నిశ్చింతగానూ, నిర్వికారంగానూ ఉన్నట్టు కనపడ్డారు. వాళ్ళు ద్వారం వద్ద కనిపించగానే వాద్యాల మోతా, ప్రేక్షకుల హర్షధ్వానాలూ మిన్ను ముట్టాయి. ఆ కోలా



హలం మధ్య మహామాత్రుడు కువలయా పీడాన్ని వాళ్ళ మీదికి తోలాడు.

అది గమనించిన కృష్ణుడు బలరాముడి కేసి నవ్వుతూ, "కంసుడు మనని చంపించ టాని కొక ఏనుగుగున్నను సిద్ధం చేశాడు. పాపం, తాను మృత్యువు కోరల సందున ఉన్న సంగతి ఎరగడు. నువు నన్ను గమ నిస్తూ ఉండు," అని ముందుకు నడిచాడు. పెద్ద దంతాలూ, భయంకరమైన తొండమూ ఎత్తి, భూమి అదిరేలాగా అడుగులు వేస్తూ కువలయాపీడ మనే ఏనుగు మహా రౌద్రంగా కృష్ణుడి పైకి వచ్చింది.



కృష్ణుడు దానితో యుద్ధం చేసే మిష మీద తన బలం అందరికీ చూపుదామనీ, కాస్సేపు వినోదం పొందుదామనీ, ముందు ఏనుగును దాని తొండంతో తన రొమ్ముమీద కొట్ట నిచ్చాడు. తరవాత, ఎగిరి, దాని దంతాల పైన కాళ్ళు పెట్టి నిలబడి, ఎడమ కాలితో దాని కుంభస్థలాన్ని బలంగా తన్ని, దాని వీపు మీదికి వెళ్ళి, అది వెనక్కు చాచిన తొండాన్ని పట్టుకుని, కిందికి దూకి, పిడికిటితో దాని డొక్కల్లో పొడిచాడు. ఏనుగు వెనక్కు తిరిగే సరికి, దాని కాళ్ళ సందుగా వెనక్కు వెళ్ళి, దాని తోక పట్టు కుని గుండ్రంగా తిప్పాడు. ఏనుగు చేసేది లేక కింద పడి, వెంటనే లేచి, అమిత రోషంతో అతని పైన తొండంతో బాదింది, దంతాలతో పొడిచింది. కృష్ణు డిక దాన్ని చంప నిశ్చయించి, ఎగిరి కాలితో దాని ముఖం మీద తన్ని, దాని దంతం ఒకటి బలంగా పెరికి, దానితోనే ఏనుగు తలను బద్దలు కొట్ట నారంభించాడు. త్వరలోనే కువలయాపీడం నేల కూలి ప్రాణాలు విడి చింది. దానితో బాటు కింద కూలిన మావటి వాడి తల దాని దంతంతోనే పగలగొట్టి కృష్ణుడు వాణ్ణి కూడా చంపేశాడు.

ఏనుగు చేసిన గాయాల నుంచి రక్త ధారలు కారుతూ, చేతిలో దాని దంతం





పట్టుకుని మహా భయంకరాకారంతో సభలో ప్రవేశించిన కృష్ణుణ్ణి చూసి కంసుడు అమిత క్రోధంతో చాణూరుడి కేసి చూసి, కృష్ణుడితో మల్లయుద్ధం చెయ్యమని ఆజ్ఞాపించాడు. అలాగే ముష్టికుణ్ణి బలరాముడితో యుద్ధం సాగించమన్నాడు.

చాణూర ముష్టికులు అంధ్రులు. దిగ్గజాలను పోలినవాళ్లు. ప్రపంచంలో తమకు చాలినవాళ్లు లేరన్న గర్వాతిశయం గలవారు. చాణూరుడు కృష్ణుణ్ణి సమీపించి వెటకారంతో కూడిన కోపంతో, "గోవులను కాస్తూ, గొల్ల పిల్లలను భయపెట్టి గొప్ప ఖ్యాతి సంపాదించావు గాని, ఇవాళ నా పాల పడ్డావు, తప్పించుకోలేవు. మహారాజు, మెచ్చుకునేటట్టుగా నిన్నిప్పుడే యమకింకరుల కప్పగిస్తాను," అన్నాడు.

కృష్ణుడు చాణూరుడితో తాపీగా, "కంసుడు నీ మీద చాలా ఆశలు పెట్టుకుని ఉన్నాడు. అందుచేత నీ బలమంతా చూపించు. వ్యర్థాలాపాలతో ఏమవుతుంది?" అంటూ మల్లచరిచాడు.

చాణూరుడు కృష్ణుడి పైకి కలియబడ్డాడు. సభలో ఉన్న యాదవులు కృష్ణుణ్ణి గురించి భయపడ్డారు. "కొండంత చాణూరుడికీ, పిల్లవాడు కృష్ణుడికీ మల్లయుద్ధమేమిటి? అన్యాయం! ఇక్కడ ఉండే పెద్దలకు ఆ మాత్రం జ్ఞానం లేదా? అదీ గాక, మల్లయుద్ధం చేసే పద్ధతి ఇది కానే కాదు. మల్లులతో యుద్ధం చేసేవారికి సహాయకులు వెంట ఉండి, అలిసినప్పుడు శైత్యాది ఉపచారాలు చెయ్యాలి, మోటు బలానికీ నేర్పరితనానికీ తేడా గమనించాలి, అవసరమైనప్పుడు యుద్ధం ఆపాలి. ఇది వినోదం గాని, విరోధుల మధ్య కొట్లాట కాదే! అయినంత మటుకు చాలు. రాజుగారు ఇద్దరినీ తగిన విధంగా సత్కరించి, యుద్ధం అపు జెయ్యటం మంచిది," అని యాదవులు తమలో తాము అనుకోసాగారు.





ఆ మాటలు విని కృష్ణుడు వారితో, "నన్ను ఇలాగే పోట్లాడ నివ్వండి. మనో బలమూ, పరాక్రమమూ, ఓపికా, ఉత్సాహమూ, జయమూ ప్రదర్శించే యోధుడికి ఒడ్డూ, పొడుగూ, వయసూతో ఏం పని? నేను పగపట్టి వీణ్ణి చంపాలనే ఉద్దేశంతోనే ఉన్నాను. మిమ్మల్ని మెప్పిస్తాను. మీరు అదీ ఇదీ అనక, చూస్తూ ఉండండి. ఈ చాణూరుడు కరూశ దేశంలో పుట్టినవాడు. ఎందరో మల్లులను హతమార్చిన వీణ్ణి పడగొట్టి గొప్ప కీర్తి సంపాదిస్తాను," అని చాణూరుడితో మల్లయుద్ధం ప్రారంభించాడు.

ఆ యుద్ధంలో ఆరితేరిన చాణూరుణ్ణి మించిన నేర్పు కృష్ణుడు చూపాడు. ఒకరి నొకరు వంచుతూ, తోస్తూ, వంగుతూ, ఎగురుతూ, ఒదుగుతూ, పక్కకు తొలుగుతూ చాలా అద్భుతంగా వాళ్ళు యుద్ధం చేశారు. వీపుకు వీపూ, తలకు తలా తగిలినప్పుడూ, ఒకరినొకరు గుద్దుకున్నప్పుడూ గొప్ప ధ్వనులు పుట్టాయి. ఒకరినొకరు చేతులతోనూ, కాళ్ళతోనూ తన్నుకుంటూ, దంతాలతోనూ, గోళ్ళతోనూ రక్కుకుంటూ పోరాడుతుంటే చూసేవారికి అతి భయంకరంగా ఉన్నది.



మొత్తం మీద అన్ని రకాలపట్లలోనూ కృష్ణుడి నేర్పే హెచ్చుగా కనబడి, సభికులు హర్షధ్వానాలు చేస్తే, కంసుడు కోపంగా "ఆపండి" అన్నట్టు చేత్తో సంజ్ఞ చేశాడు. కృష్ణుడు కొంతసేపు తన చాకచక్యం ప్రదర్శించి, చాణూరుడి పని తేల్చెయ్య నిశ్చయించాడు. చాణూరుడి పని కూడా చాలావరకు అయిపోయింది. దుర్బలుడైపోతున్న ఆ మల్లుడిపైన కృష్ణుడు ఒక్కపెట్టున లంఘించి, వాడి నడి తల మీద పిడికిలితో ఒక్కపోటు పొడిచి, ఎగిరి మోకాలితో వాడి గుండెలో ఒక్కతాపు తన్నాడు. ఆ దెబ్బతో చాణూ



రుడు గుడ్లు వెళ్ళబెట్టి, నోట నెత్తురు కక్కుతూ కిందపడి ప్రాణాలు వదిలాడు.

కృష్ణుడు చాణూరుణ్ణి చంపే లోపునే బలరాముడు ముష్టికుణ్ణి హత మార్చేశాడు. మల్లు లిద్దరినీ కడతేర్చి, బలరామకృష్ణులు రంగస్థలాన విజయులై నిలబడ్డారు. వాళ్ళు కంసుడి కేసి చూసిన చూపూ, కంసుడి ముఖంలో కనిపించిన క్రౌర్యమూ చూసి నందగోపుడు మొదలైన గోపకు లందరూ భయంతో వణుకుతూ, ఉక్కిన పేనుల్లాగా ఉండిపోయారు.

తాను కని పారేసిన కొడుకు చాణూరుడి చేతిలో ఏమైపోతాడో, ఇంత కాలానికి కన



పడి అంతలోనే ప్రాణాలు విడుస్తాడేమో నని తల్లడిల్లిన దేవకీదేవి, చాణూరుణ్ణి చంపిన తన కొడుకు దర్పం చూసి ఆనం దాశ్రువులు రాల్చింది. వసుదేవుడి ఆనం దానికి కూడా మేరలేదు.

కంసుడికి మాత్రం ముఖాన చెమటలు పోస్తున్నాయి. దురాగ్రహంతో శరీరమంతా కంపిస్తున్నది. ఊపిరి భారంగా తీస్తు న్నాడు. ఎర్రటికళ్ళ నుంచి నిప్పులు కక్కే వాడిలాగా చూస్తూ అతను, నాలుగు వైపులా చూసి, తన నౌకర్లను పిలిచి, "ఈ గొల్ల కుర్రాళ్ళను ఇద్దరినీ తీసుకుపోయి నగరం దాటి పంపెయ్యండి. నందగోపుణ్ణి పట్టు కుని, సంకెళ్ళతో బంధించండి. మిగిలిన గోపకులందరినీ శిరశ్ఛేదం చెయ్యండి. నా రాజ్యంలో గొల్లవాడన్నవాడు కనిపిస్తే దొంగలను శిక్షించినటు శిక్షించండి. గొల్లల సొత్తు తీసేసుకోండి. కుటిలుడైన వసుదేవు డికి క్రూరమైన శిక్ష ఇవ్వండి." అని ఆజ్ఞాపించాడు.

ఈ మాటలు విని ఎక్కడివాళ్ళక్కడ కొయ్యబారిపోయారు. మళ్ళీ శోకం ముంచు కొచ్చి దేవకీదేవి మూర్ఛపోయింది.

కృష్ణుడు తన తల్లిదండ్రుల దైన్యమూ, బంధువర్గంపడే బాధా, సభలో ఉన్న

వాళ్ళ అసహాయస్థితి చూసి ఆగ్రహావేశం చెందాడు. అతను ఊహించరాని వేగంతో సింహాసనం మీద కంసుడున్న చోటికి మెల్లెక్కి వచ్చాడు.

సభలో వాళ్ళకు కృష్ణుడు ఎక్కరావటం కనిపించలేదు. ఒక క్షణం రంగస్థలంలో ఉన్నాడు, మరుక్షణం అతను కంసుడి వద్ద ఉన్నాడు.

మరుక్షణం అతను కంసుడి కిరీటాన్ని తన్నేశాడు, దాని మణులు రాలాయి. కంసుణ్ణి జుట్టు పట్టుకుని తల వంచి, తల అంతటా పిడికిలితో తెగ పొడిచాడు. మోకాలితో గుండెల్లో పొడిచాడు. కంసుడు ఏమీ చెయ్యలేకపోయాడు. అతని మెడలో హారాలు తెగిపోయాయి. చెవిలో పెట్టుకున్న పూలు రాలాయి. బట్ట ఊడిపోయింది. ముక్కునా, చెవులా, నోటా రక్తం చిమ్మేలాగా, కనుగుడ్లు వెళ్ళుకొచ్చేలాగా కంసుణ్ణి కృష్ణుడు పై నుంచి కిందికి తోసి, చేత్తో నెట్టాడు. ఆ తోపుతో కంసుడి శవం రంగద్వారాన పరిఘ ఆకారంలో పడిపోయింది.

ఇదే సమయంలో బలరాముడు, కంసుడి తమ్ముడైన సునాముడనేవాడి పైన సింహంలాగా లంఘించి, వాణ్ణి హతమార్చేశాడు.

కృష్ణుడు కంసుణ్ణి చంపిన చేతులతోనే వసుదేవుడి పాదాలు తాకి నమస్కరించాడు. వసుదేవుడు కృష్ణుణ్ణి గాఢంగా కౌగలించుకుని ఆశీర్వదించాడు. తరవాత కృష్ణుడు దేవకికి నమస్కరించాడు. ఆమె అతన్ని కౌగలించుకుని తల వాసన చూసింది.

తరవాత కృష్ణుడు ఉగ్రసేనుడికీ, పెద్దలకూ మొక్కి వారి దీవనలు పొంది, అందరినీ వెళ్ళిపొమ్మని చెప్పి, తాను బలరాముడితో సహా తన తండ్రి ఇంటికి వెళ్ళిపోయాడు.





# కృష్ణావతారం

కంసుడు చచ్చిన వార్త తెలియగానే అతని భార్య లందరూ మూర్తీభవించిన శోక దేవతలలాగా వచ్చి, తమ భర్త కళేబరం మీద పడి వైనవైనాలుగా ఏడ్చారు. మూడు లోకాలలోనూ కంసుణ్ణి జయించ గలవాడు లేడని వాళ్ళ నమ్మకం. అలాటివాడు ఒక కుర్రవాడి చేతిలో ఇంత దారుణంగా మరణిస్తాడనీ, ఇంతలోనే తమకు వైధవ్యం సంప్రాప్త మవుతుందనీ వారు అనుకోలేదు.

కంసుడి తల్లి కూడా తన కోడళ్ళతో బాటు కొడుకు కోసం దుఃఖించింది. ఆమె తన భర్త అయిన ఉగ్రసేనుడి వద్దకు వెళ్ళి, "పిడుగు పడి కూలిపోయిన కొండలాగా పడి ఉన్న నీ కొడుకును చూసుకున్నావా? వాడికి దహనసంస్కారాలు జరపాలి గదా? తన బాహుబలంతో కృష్ణుడు రాజ్యాన్ని గెల్చుకున్నాడు. కృష్ణుణ్ణి ఉత్తరక్రియలకు అనుమతించమని అడుగు," అన్నది.

కంసుడి చావు చూసి మరీ వెళ్ళిపోదా మన్నట్టుగా సూర్యుడు అస్తమించాడు. ఆ సంధ్యవేళ యాదవుల మధ్య ఉన్న కృష్ణుడికి కంసుడి భార్యల రోదనలు వినవచ్చాయి. అతని కళ్ల నీళ్ళు తిరిగాయి. అతను తన చుట్టూ ఉన్న బంధుజనంతో, "నేను అతి బాల్యం మూలాన ఉద్రేకంతో ఎంత మంది స్త్రీలకు వైధవ్యదుఃఖం కలిగించాను! కాని, నిజం ఆలోచిస్తే, కంసుడి దుర్మార్గానికి మరొక విరుగుడు లేదు. ఈ దుర్మార్గుడిలాగా తన తండ్రిని నిర్బంధంలో ఉంచి తానే రాజ్యం ఏలినవా డెక్కడైనా

12. బలరామకృష్ణుల విద్యాభ్యాసం



ఉన్నాడా? పాపిని చూసి జాలిపడటం కూడా పాపమే నని చెబుతారు. లోకక్షేమం కోరి నే నీ దుర్మార్గుణ్ణి చంపాను. ముందు ఏం చెయ్యాలో కూడా నేను ఆలోచించే పెట్టాను," అన్నాడు.

అత నిలా అంటూండగానే ఉగ్రసేనుడు, శిని మొదలైన యాదవవృద్ధులను వెంట బెట్టుకుని వచ్చి, కృష్ణుడి ముందు కొద్దిసేపు తల వంచుకుని నిలబడి, కన్నీరు కార్చి, తల ఎత్తి, గద్గద కంఠంతో, "నాయనా, అతి భయంకరుడైన శత్రువును హతమార్చి గొప్ప ఖ్యాతి సంపాదించుకున్నావు; యాదవ వంశానికి మహదానందం చేకూర్చావు. ఇక



రాజ్యం నీదే. నువే రాజువు. ఏ లోటూ లేకుండా మహా వైభవంగా రాజరికం అనుభవించు. నీ శత్రువు పోయాడు గనక, నీ మనసులో పగ పెట్టుకోక, నా బోటివారి పట్ల ఆదరంతో ప్రవర్తించు. ప్రస్తుతం కంసుడి ప్రేతవిధి జరగవలసి ఉన్నది. ఇందుకు నువు అనుమతించే పక్షంలో నేనూ, నా భార్యా, నా కోడళ్ళూ ఇన్ని నీళ్ళు వదలుతాము. ఆ తరవాత నేను జటావల్కలాలు ధరించి అరణ్యవాసం చేసుకుంటాను," అన్నాడు.

ఆ మాటకు కృష్ణుడు, "దీనికి నా అనుమతి కావాలా? కంసుడి ఉత్తరక్రియలకు నేను అభ్యంతరం చెబుతానా? ఒక్క మాట చెప్పవలసి ఉన్నది. నాకు రాజ్యంతో పని లేదు. నేను రాజధనం మీది ఆశ కొద్దీ కంసుణ్ణి చంపలేదు. వంశద్రోహీ, లోక కంటకుడూ కనక లోకహితం కోరి అతన్ని చంపాను. అందువల్ల నాకు వచ్చే కీర్తి చాలు. ఇక నేను నా మానాన ఆవులమందల మధ్యకు వెళ్ళి, అడవి జంతువులాగా గోపాలకులతో కలిసి ఆటలూ, పాటలూ సాగిస్తాను. నా మనవి ఒకటి ఉన్నది. నే నీ మాటలు కపటంగా అంటున్నవి కావు. న్యాయంగా నీదైన





రాజ్యాన్ని నీచుడై నీ కొడుకు హరించాడు. అది చివరకు నీదే అయింది. హాయిగా రాజ్యాభిషేకం చేసుకో. ఈ రాజ్యం నేను గెలిచి నీ కిస్తున్నాను. నా మీద వాత్సల్య ప్రేమలున్న పక్షంలో నా కోరిక నిరాకరించ వద్దు," అన్నాడు.

అనటంతో పోనివ్వక కృష్ణుడు ఉగ్ర సేనుడికి అప్పటికప్పుడే అందరి మధ్యా రాజ్యాభిషేకం జరిపించేశాడు. ఉగ్రసేనుడు బలరామ కృష్ణులకు చేయించవలసిన సంస్కరణలన్నీ చేయించాడు. కృష్ణుడు పూనుకుని మధురానగరాన్ని పూర్వంకన్న చాలా వైభవంగా తయారుచేశాడు.

ఒకనాడు అతను బలరాముడితో, "మనం పుట్టిన నాటినుంచీ చదువూ, సంస్కారమూ, ఆచారమూ లేకుండా అడవుల వెంటబడి తిరిగాం. ఇప్పటికైనా ఒక గురువు దగ్గిర చేరి చదువుకోవటం మంచిది గదా!" అన్నాడు.

ఈ ఆలోచన రాగానే బలరామకృష్ణులు తమ అభిప్రాయాన్ని అయినవాళ్ళకు చెప్పి, వారి అనుమతితో అవంతిపురంలో ఉండే సాందీపను డనే బ్రాహ్మణుడి వద్దకు వెళ్ళి, తమ గోత్రనామాలు తెలుపుకుని, చదువు చెప్పమని ప్రార్థించారు. ఆయన వాళ్ళను



తన శిష్యులుగా పరిగ్రహించి, అరవైనాలుగు రోజులలో నాలుగు వేదాలూ, షడంగాలూ చెప్పాడు. వాళ్ళు పన్నెండు రోజులలో ధర్మశాస్త్రమూ, తర్కమూ, న్యాయ శాస్త్రమూ, గణితమూ, సంగీతమూ, సైనిక విద్యలూ నేర్చుకున్నారు, యాభై రోజులలో అస్త్రశాస్త్రం పూర్తిగా అభ్యసించారు. సాందీపనుడు వారి అధ్యయన శక్తి చూసి, "వీళ్లు మానవ రూపంలోవచ్చిన సూర్య చంద్రులా ఏమిటి?" అనుకుని ఆశ్చర్యం పొందాడు.

బలరామకృష్ణులు గురువు వద్ద విద్యా భ్యాసం పూర్తిచేసి, ఆయనకు నమస్క



రించి, "మీ దయవల్ల మేము విద్యావంతుల మయాం. మా వల్ల మీకు ఏం కావాలో కోరండి. ఎంత దుర్ఘటమైనా సరే, మీ కోరిక నెరవేరుస్తాం," అన్నారు.

ఆ మాట విని సాందీపనుడు, "నా కొక కొడుకుండేవాడు. వాడు తీర్థయాత్రలు చేస్తూ సముద్రస్నానం చేస్తూండగా ఒక తిమి వాణ్ణి మింగింది. ఆ పుత్రశోకం నన్నిప్పటికీ దహించుతూనే ఉన్నది. నా కొడుకును ఎలాగైనా నాకు తిరిగి ఇప్పించండి, అంతేచాలు," అన్నాడు.

ఆయన కోరిన గురుదక్షిణ చెల్లించటానికి నిశ్చయించి కృష్ణుడు, అన్న అనుమతి పొంది, ధనుర్బాణాలు తీసుకుని సముద్ర తీరానికి వెళ్ళి, సముద్రుడితో, "మా గురువు గారు సాందీపనుడు తన కొడుకును నీలో పోగొట్టుకున్నాడట. అతన్ని మింగిన దుష్టుణ్ణి తక్షణం చూపించు," అన్నాడు.

వెంటనే సముద్రుడు ప్రత్యక్షమై చేతులు జోడించి, "పంచజను డనే రాక్షసుడు తిమి రూపంలో వచ్చి మీ గురువుగారి కొడుకును మింగేశాడు. ఆ రాక్షసుణ్ణి ఇప్పుడే నీ ముందుంచుతాను," అన్నాడు.

మరుక్షణమే సముద్రపు కెరటాలు తిమి రూపంలో ఉన్న పంచజనుణ్ణి తెచ్చి ఒడ్డున పారేశాయి. కృష్ణుడు కత్తితో దాని పొట్ట చీల్చి చూస్తే దానిలో గురుపుత్రుడు లేడు, కాని ఒక గొప్ప శంఖం ఉన్నది. దాన్ని చూడగానే కృష్ణుడికి ముచ్చట వేసి, తన ఉపయోగం కోసం ఉంచుకున్నాడు. పంచజనుడి కడుపులో దొరికింది గనక ఆ శంఖానికి పాంచజన్య మనే పేరు వచ్చింది.

అయితే గురుపుత్రుడి సమస్య తీరలేదు. ఆ కుర్రవాడు ఏమై ఉంటాడు? చచ్చిపోయి యమలోకానికే పోయి ఉండాలి. ఇలా అనుకుని కృష్ణుడు తిన్నగా దక్షిణ దిక్కుగా బయలుదేరి యమలోకానికి వెళ్ళి, సింహాసనం మీద కూర్చుని ఉన్న యమధర్మ



రాజును చూసి, కోపంగా, "మా గురువు గారైన సాందీపనుడి కొడుకును నువు తీసుకొచ్చావు. అతన్ని నాకు తిరిగి ఇచ్చెయ్యి. ఇవ్వకుండా దౌర్జన్యానికి దిగావో, నీ ప్రాణాలు తీస్తాను," అన్నాడు.

యముడు వొణికిపోతూ లేచి నిలబడి, చేతులు జోడించి, "నేను ప్రాణుల పుణ్యపాపాలు నిర్ణయించే వాణ్ణేగాని, ప్రాణాలు తెచ్చేవాణ్ణి కాను. అది మృత్యువు పని," అని చెప్పాడు.

"మృత్యువు కింత పొగరా? మా గురుపుత్రుణ్ణి తీసుకు పోవటమే గాక, మమ్మల్ని ఇంత దూరం తిప్పిస్తాడా? వాడి ఆయువు మూడింది!" అంటూ కృష్ణుడు వింటికి ఒక దివ్య బాణం ఎక్కుపెట్టాడు. అది చూసి భయపడి మృత్యువు గురుపుత్రుడి ప్రాణాలను తిరిగి శరీరంలో ఉంచి తెచ్చి, కృష్ణుడి ముందుంచాడు.

ఈ విధంగా కృష్ణుడు సముద్రుణ్ణీ, యముణ్ణీ, మృత్యువునూ గడగడ లాడించి, పాంచజన్యాన్నీ, ప్రాణాలతో గురుపుత్రుణ్ణీ సాధించి, తన గురువు దగ్గిరికి తిరిగివచ్చాడు. గురువుగారు ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ వివశుడై, తన కొడుకుని కౌగలించుకుని, అపూర్వమైన గురుదక్షిణ ఇచ్చినందుకు కృష్ణుణ్ణి వెయ్యివిధాల ఆశీర్వదించాడు. బలరామకృష్ణులు మరికొన్ని రోజులు గురువుగారింట ఉండి, ఆయన వద్ద సెలవు పుచ్చుకుని, మధురానగరానికి తిరిగి వచ్చారు.

వాళ్ళకు ఉగ్రసేనుడు బ్రహ్మాండమైన స్వాగతమూ ఊరేగింపూ ఏర్పాటుచేసి, బంధువులనూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని వాళ్ళకు ఎదురువెళ్ళి, మేళతాళాలతో తీసుకొచ్చాడు. బలరామకృష్ణులు వసుదేవుడి ఇంటికి చేరుకుని, తమ విద్యాభ్యాసం అనుభవాలు అందరికీ చెప్పి, సుఖంగా కాలం గడపసాగారు.





జరాసంధుడు మగధదేశానికి రాజు. ఇతని కుమార్తెలు అస్తి, ప్రాప్తి అనేవాళ్ళు కంసుడి భార్యలు. తన అల్లుణ్ణి కృష్ణుడు చంపి, తన కుమార్తెలకు వైధవ్యం కలిగించాడన్న వార్త విని ఆ కోపంతో, జరాసంధుడు, అనేకమంది రాజులను కూడగట్టుకుని, ఇరవైఒక్క అక్షౌహిణీల సేనను వెంటబెట్టుకుని మధుర మీదికి యుద్ధానికి బయలుదేరి వచ్చి, యమునా తీరాన విడిసి, విందుడూ, అనువిందుడూ అనే రాజకుమారులను కృష్ణుడి వద్దకు తన దూతలుగా పంపాడు. వారు ఉగ్రసేనుడి సభకు వచ్చి, ఆ సభలోనే బలరాముడితో సహా కూర్చుని ఉన్న కృష్ణుడితో, జరాసంధుడి మాటలుగా ఇలా చెప్పారు:

"నువ్వూ, నీ అన్నా పెద్ద మొనగాళ్ళలాగా వచ్చి కంసుణ్ణీ, అతని తమ్ముణ్ణీ చంపారు. కంసుడు నా అల్లుడు. నా కుమార్తెల వైధవ్యదుఃఖం చూడలేక, నీతో యుద్ధం చెయ్యటానికి వచ్చాను. నువు త్వరగా యుద్ధానికి రా. నువ్వయినా బతికి ఉండాలి, నేనైనా బతికి ఉండాలి; మన ఇద్దరికీ భూమి మీద చోటు లేదు. ఎదట నిలబడి నాతో యుద్ధం చేశావా నిన్ను చంపేస్తాను; యుద్ధం చెయ్యలేక పారిపోయావా, పాతాళంలో దూరినా వెంటతరిమి హతమార్చుతాను. నే నెలాటివాణ్ణో అక్రూరుణ్ణి అడిగినా, నీ తమ్ముడు సాత్యకిని అడిగినా చెబుతారు. రేపే మధురానగరానికి ముట్టడి వేస్తున్నాను. కనక నువు సిద్ధంగా ఉండు."

జరాసంధుడి మాటలుగా దూతలు చెప్పిన ఈ మాటలు విని కృష్ణుడు నవ్వుతూ, "చాలా సంతోషం. నేను ఇన్ని మాటలవాణ్ణి కాను. జరాసంధుడి కొవ్వు అణచటానికి నేనే వద్దామనుకుంటుండగా తానే వచ్చాడు. రానీ. పూర్వం రాక్షసి అతికించిన అతని శరీరాన్ని మళ్ళీ రెండుగా

చీలుస్తాను. కంసుణ్ణి చంపి ఈ రాజ్యాన్ని ఉగ్రసేనుడి కిచ్చినట్టే, జరాసంధుణ్ణి చంపి, అతని కొడుక్కు మగధ రాజ్యాభిషేకం చేస్తాను," అన్నాడు.

జరాసంధుడి దూతలుగా వచ్చిన రాజ కుమారులు కృష్ణుడి చేత సత్కారాలు పొంది వెళ్ళి, అతను చెప్పిన జవాబు జరాసంధు డికి అందించారు.

జరాసంధుడి పేరు వినగానే ఉగ్ర సేనుడు మొదలుగా గల యాదవు లందరికీ కాళ్ళు చల్లబడ్డాయి. వారిలో వికద్రు డనే యదువృద్ధుడు, కృష్ణుడితో ఇలా అన్నాడు:

"నాయనా, కమలంలో బ్రహ్మ పుట్టి నట్టుగా ఈ యదువంశంలో నువ్వు పుట్టావు. నువ్వుండగా యాదవులకే భయమూ ఉండదు. జరాసంధుడికి అంతులేని రాజుల అండ ఉన్నది. అతను యుక్తిపరుడు, దారుణ స్వభావుడు. అతన్ని యుద్ధంలో ఓడించే శక్తి నీ కొక్కడికే ఉన్నది. కంసుడు బలగర్వితుడై కోటకు ఎలాటి రక్ష ణలూ లేకుండా ఉంచాడు. ఆయుధాలు సిద్ధంగా లేవు, ఆహారపదార్థాలు అంతకన్నా లేవు. నిజాని కిది ఇవాళ దుర్గమే కాదు. అకస్మాత్తుగా శత్రువు వచ్చి పడ్డాడు. అతన్ని ఎదిరించక ఎవరి మానాన వారు చేతులు కట్టుకు కూర్చుంటే ఈ రాష్ట్రం దక్కదు. పూర్వం ముచికుందుడూ, పద్మవంతుడూ, సారసుడూ, హరితుడూ అనే యాదవ రాజులు ఋక్షవంతమూ, వింధ్యమూ, సహ్యమూ అనే పర్వతాలలోనూ, పడమటి సముద్రంలోని దీవులలోనూ శత్రువులకు లొంగని దుర్గాలెన్నో నిర్మించారు. వీరు నలుగురికీ పూర్వమే మాధవుడు ఈ మధు రను పాలించాడు. ఈ నాడు దీనిని బల పరచటం సాధ్యం కాదు. వేరే మరొక దుర్గం ఏర్పాటు చేసుకోవలిసిందే. సూచన ప్రాయంగా చెప్పాను. కర్తవ్యం నువే ఆలోచించు."





# కృష్ణావతారం

విక్రుడు చెప్పిన మాటలు కృష్ణుడు శ్రద్ధగా విని, "దీనికి ప్రస్తుతం ఒకటే ఉపాయం తోస్తున్నది. నేనూ, అన్నా కూడా వెంటనే బయలుదేరి, జరాసంధుడు మొదలైనవారు చూస్తూండగా దక్షిణ దిక్కుగా పోతాం. అప్పు డతను మధురానగరాన్ని ముట్టడించే యత్నం మాని మా వెంట పడతాడు. మేము వింధ్యాద్రి మొదలైన పర్వతాలలో గల దుర్గాలను పట్టుకుని, జరాసంధుడితో యుద్ధం చేస్తాం. మే మిలా చెయ్యటం వల్ల మన కులం వారికీ, రాష్ట్రవారులకూ అపద తప్పుతుంది," అన్నాడు.

దీనికి అందరూ సమ్మతించారు. బలరామ కృష్ణులు నిరాయుధులై మధుర నుంచి బయలుదేరి, ధైర్యంగా జరాసంధుడి దగ్గిరికే వెళ్ళి, "మగధరాజా, నానా దేశాల సైన్యాలను వెంట బెట్టుకుని ఇక్కడికి ఏ ఉద్దేశంతో వచ్చావో చెప్పు. మేము కూడా సహాయం చేస్తాం," అన్నారు.

జరాసంధుడు కృష్ణ బలరాముల రాక విని, కవచమూ, బాణమూ, రెండు అంబుల పొదులూ ధరించి వచ్చి, "మీ రిద్దరూ మహా బలవంతులని విని, మిమ్మల్ని యుద్ధంలో గెలుద్దామనే ఉద్దేశంతో నే వచ్చాను. మీ ప్రాణాలు తీయకుండా తిరిగి వెళ్ళేది లేదు. కనక మీరు కూడా యుద్ధ సన్నద్ధులై రండి," అన్నాడు.

అత నా మాట అనగానే బలరామ కృష్ణులు కొంచెం కూడా తొణకకుండా, అక్కడి నుంచి బయలుదేరి దక్షిణదిక్కుగా

13. జరాసంధ పరాజయం





తేజాలతో వెలిగిపోతున్న పరశురాముణ్ణి సమీపించి, బలరామకృష్ణులు ఆయన కాళ్ళకు తలలు తాకేలాగా ప్రణామం చేసి, ఆయనను స్తోత్రం చేశారు.

కృష్ణుడు ఆయనకు తమ కథను సంగ్రహంగా తెలుపుతూ, "మహాత్మా, మా నివాసం యమునా నదీ ప్రాంతాన గల మధుర. యాదవ శ్రేష్ఠుడైన వసుదేవుడు మా తండ్రి. నా పేరు కృష్ణుడు, మా అన్న పేరు బలరాముడు. కంసుడి భయం చేత మా తండ్రి మమ్మల్ని పుట్టినప్పుడే గోకులానికి పంపెయ్యగా, అక్కడ పెరిగి పెద్ద వాళ్ళమయాము. తరవాత మధురా నగరానికి తిరిగి వచ్చి, కంసుణ్ణి చంపి, అతని రాజ్యాన్ని అతని తండ్రికే ఇచ్చాం. కంసుణ్ణి చంపినందుకు మా మీద అలిగి జరాసంధుడు మా మీదికి పెద్ద సేనతో ఎత్తి వచ్చాడు. నిరాయుధులం కావటంచేత అతనితో యుద్ధం చేసే అవకాశం లేక, అతను చూస్తుండగానే కాలినడకన ఇటుగా వచ్చాం. మే మిప్పుడేం చెయ్యాలో సలహా ఇచ్చి మమ్మల్ని అనుగ్రహించండి," అని కోరాడు.

పరశురాముడు అంతా విని, "మీ రిటు దక్షిణాపథానికి రావటం చూశాడు కనక,

నడుచుకుంటూ వెళ్ళిపోయారు. వాళ్ళు అలా అనేక దేశాలూ, నగరాలూ దాటి, వింధ్యారణ్యాలను సమీపించి, సహ్యాద్రి మీది అరణ్యంలో ఒక మహా వటవృక్షం కింద పరశురాముణ్ణి చూశారు.

అక్కడ పరశురాముడు శివార్చన చేస్తున్నాడు. ఒక పక్కగా హోమధేనువు, దూడతో సహా కట్టి ఉన్నది. ఆయనకు ఒక పక్కన స్రుక్స్రువాలూ, అరణీ, కమండలువూ, చక్కగా ప్రజ్వలిస్తున్న అగ్ని ఉన్నాయి; మరొక పక్కన ఒక మహా ధనువూ, బాణాలూ, ఖడ్గమూ, గండ్రగొడ్డలీ ఉన్నాయి. ఈ విధంగా బ్రాహ్మణ క్షాత్ర







ఉన్నట్టే కనిపిస్తాయనీ, అనేక లంకలతో సహా సముద్రం కనిపిస్తుందనీ పరశురాముడు బలరామకృష్ణులకు చెప్పాడు.

"మీ రీ కొండ మీద నుంచి యుద్ధం చేసినట్టయితే జరాసంధుడూ, అతని వెంట వచ్చిన రాజులూ, ఓడి వెళ్ళిపోతారు," అన్నా డాయన.

ఆ తరువాత ముగ్గురూ అతి వేగంగా పర్వతం పైకి ఎక్కారు.

"మీ శత్రువులు చేరవస్తున్నట్టు ధ్వనులు వినిపిస్తాయి, మీరు మహా జాగ్రత్తగా ఉండండి. ఇక నేను వెళ్ళి వస్తాను," అని పరశురాముడు అనేసరికి, బలరామకృష్ణు లాయనను గౌరవంగా సాగనంపారు.

తరవాత బలరామ కృష్ణులు ఆ పర్వతం మీది గుహలూ, దృశ్యాలూ చూస్తూ గడిపారు. అంతలో జరాసంధుడి సేన అర్భాటంగా వచ్చి, పర్వతం చుట్టూ విడిసింది. ఆ సేనలో జరాసంధుడి వెంట శిశుపాలుడూ, రుక్మి, చేకితానుడూ, బాహ్లికుడూ, ద్రుపదుడూ, విరాటుడూ, ఉత్తమౌజుడూ, జయద్రథుడూ మొదలైన రాజులున్నారు.

జరాసంధుడు వీరందరినీ పిలిపించి సభ చేసి, "యాదవ కుమారులు ఈ కొండ మీద ఉన్నట్టు తెలిసింది. పర్వతాన్ని ఎక్క

జరాసంధుడు తన సైన్యంతో సహా మిమ్మల్ని వెంబడించి వస్తాడు. జరాసంధుణ్ణి జయించటానికి అనుకూలంగా ఉండే దుర్గం ఒకటి ఉన్నది. నేను మీ వెంట వచ్చి అక్కడ దిగ విడుస్తాను," అన్నాడు.

ముగ్గురూ కలిసి బయలుదేరారు. వారు కొన్నిరోజులు నడిచి గోమంత మనే పర్వతాన్ని చేరారు.

గోమంతం ఒక మహా పర్వతం. దానికి ఒకే ఒక శిఖరం ఉన్నది. ఆ పర్వతం మీదికి వెళ్ళి ఆ శిఖరాన్ని చేరుకున్నట్టయితే, అక్కడి నుంచి సూర్యచంద్రులు ఉదయించే చోటూ, అస్తమించే చోటూ దగ్గిరలో



టానికి వీలుగా రాళ్లూ, తిప్పలూ ధ్వంసం చేయింతాం. అక్కడక్కడా ఒడిసెల వాళ్ళను ఏర్పాటు చేతాం. పైనుంచి ఎవరు తొంగిచూసినా బాణాలూ, ఈటెలూ విసురుదాం. అవసరమైతే ఈ పర్వతాన్ని పిండి కొట్టి అయినా మనం వచ్చిన పని పూర్తిచేసి మరీ తిరిగి పోదాం," అన్నాడు.

దానికి శిశుపాలుడు, "ఈ పర్వతం దేవతలకే సాధ్యంకాదంటారు. రథాల మీద విశ్రాంతి తీసుకునే మన రాజులు నడిచి దీన్ని ఎక్కగలరా? చాలామందిమి ఉన్నాం గదా అని విరుచుకుపడటం నీతీ కాదు, ఉపాయమూ కాదు. బలరామకృష్ణులను పిల్లల కింద జమకట్టవద్దు. దుర్గం వాళ్ళ అధీనంలో ఉన్నది కాబట్టి, యుద్ధం చేసే కన్న ముట్టడివేసి, వాళ్ళకు అన్నపానాలు లేకుండా చెయ్యటం తెలివైన పని. మరొక ఉపాయం కూడా ఉన్నది. కొండ చుట్టూ నిప్పు పెట్టామంటే వాళ్ళు దానికి ప్రతిక్రియ చెయ్యలేక చిక్కులోపడతారు," అన్నాడు.

చేదిరాజైన శిశుపాలుడు చెప్పిన ఈ ఉపాయం జరాసంధుడికి నచ్చింది.

సైనికులు పర్వతం చుట్టూ ఎండిన మానులూ, పొదలూ, కంపా పేర్చి, గాలి వాలున అవి మండేటట్టుగా నిప్పుపెట్టి,



ఆ మంటల మీదికి కట్టెలూ, గడ్డీ ఎగదోశారు. వెంటనే పర్వతం చుట్టూ కార్చిచ్చు బయలుదేరింది. మంటలూ, నిప్పురవ్వలూ, పొగా ఆకాశంలోకి లేచాయి.

ఇదంతా చూస్తున్న బలరాముడు కృష్ణుడితో, "చూశావా, మన మూలాన ఈ పర్వతాని కెంత దుర్దశ కలిగిందో! మనం చూస్తూ ఊరుకోవటం కన్న వేరే అపకీర్తి ఏముంటుంది? నే నిప్పుడే ఈ జరాసంధుణ్ణి నా భుజబలంతో చంపేస్తాను. ఇన్ని దేశాల నుంచి, ఇంతమంది రాజులు ఇంత సైన్యాన్ని వెంట బెట్టుకుని యుద్ధానికి వస్తారా? భూమిమీద రాజనేవాడు లేకుండా





చేస్తాను," అని కొండ మీది నుంచి, కింద ఉన్న సేన మధ్యకు ఎగిరి దూకాడు, ఆ క్షణమే కృష్ణుడు కూడా అలాగే దూకాడు. రెండు మందర పర్వతాలు ఒక్కసారిగా పడితే సముద్రం అల్లకల్లోలమైనట్టుగా, జరాసంధుడి సేన వాళ్ళపాటుకు చెల్లా చెదరయింది. వాళ్ళ పాదఘట్టనతో పర్వతం కొంచెం కుంగి, పాతాళ గంగ పైకి వచ్చి, మంటలు ఆరిపోయాయి.

ఆ అన్నదమ్ముల శౌర్య సాహసాలను మెచ్చి, దేవతలు ఆకాశం నుంచి వారిద్దరికీ రకరకాల ఆయుధాలు అందించారు. ఆ క్షణంలో కృష్ణుడు విష్ణుమూర్తి లాగానూ,



బలరాముడు సహస్రఫణాలు గల ఆదిశేషుడు లాగానూ కనిపించారు. వాళ్ళిద్దరూ విజృంభించి సైన్యాన్ని ఎడాపెడా వధ చేస్తూంటే రాజులు పారిపోసాగారు.

వాళ్ళను వెనక్కు పిలుస్తూ జరాసంధుడు, "యుద్ధంలో వెన్నిచ్చి పారిపోయే వారికి భ్రూణహత్యాపాతకం లాటిది చుట్టుకుంటుందని పెద్దలు చెప్పారు. మీరంతా మహామహా యోధులై ఉండి, ఇద్దరు గొల్లపిల్ల వాళ్ళకు దడిచి పారిపోతున్నారా? మీరు కాలుతొక్కుకు నిలబడి నన్ను చూడండి. నేనుండగా మీకే అపాయమూ రానివ్వను. ఈ యాదవులను నా బాణాలకు ఎరచేసేస్తాను," అన్నాడు.

ఈ మాటలు విని పారిపోయే రాజులు వెనక్కు తిరిగి, తమ సేనలను వెనక్కు తిప్పి, బలరామకృష్ణులను చుట్టుముట్టారు. అంతమంది తమ పైన వివిధాస్త్రాలనూ, శస్త్రాలనూ ప్రయోగిస్తున్నా చలించక, బలరామకృష్ణులు తమ చుట్టూ ఉన్న సేనను ఊచకోత కోస్తూ, పీనుగు పెంట కుప్పలు వేశారు. రాజులు క్రమంగా వెనక్కు తగ్గసాగారు. అప్పుడు కృష్ణుడు వారితో, "అందరూ వాహనాలెక్కి ఉన్నారు; అందరూ అనేక యుద్ధాలలో ఆరితేరినవారే;







నేల మీద నిలబడి యుద్ధంచేసే మమ్మల్ని ఎదుర్కోలేక వెనక్కు తగ్గటం ఏమీ బాగా లేదు. మిమ్మల్ని అడ్డంపెట్టుకుని ఆ జరాసంధుడు దూరదూరంగా ఉంటున్నాడు. అతని కోసం మీరెందుకు చావాలి? అతన్ని పట్టుకురండి, నా యుద్ధ పటిమ చూపిస్తాను," అన్నాడు,

ఈ మాట విని జరాసంధుడు, పౌరుషం వచ్చి, ఒక రథం మీద ఒంటరిగా కృష్ణుడున్న చోటికి వచ్చాడు. అతను కృష్ణుణ్ణి చూసి, "నేనుండగా మధ్య ఈ రాజుల నెందు కవమానిస్తావు? యుద్ధ మంటే అడవిలో పశువులను కాయటం కాదు. నువేదో మహా బల పరాక్రమాలు కలవాడివిట. అదంతా నా మీద చూపించినప్పుడు గదా సార్థకమయేది? నువు నిలిచి పోట్లాడు. క్షణంలో నిన్ను యమధర్మరాజు దగ్గిరికి పంపేస్తాను," అన్నాడు.

"నా ప్రతాపం తెలుసుకో గోరితే నేను ఎదటే ఉన్నాను గద. శూరుడు ప్రగల్భాలాడరాదు. నీ శస్త్రాస్త్రపటిమ చూపించు," అంటూ కృష్ణుడు జరాసంధుడి పైన ఎనిమిది బాణాలూ, అతని సారథిపైన అయిదు బాణాలూ వేశాడు. ఆ క్షణంలోనే బలరాముడు జరాసంధుడి చేతిలోని వింటిని తన బాణాలతో విరగగొట్టాడు. జరాసంధుడికి కాపుగా అతని సేనాపతులు, కౌశిక చిత్రసేను లనేవాళ్ళు, బలరామకృష్ణుల మీదికి వచ్చారు. యుద్ధం అతి దారుణంగా సాగింది. యుద్ధంలో దెబ్బతిని కృష్ణుడూ, బలరాముడూ, జరాసంధుడూ కూడా ఒకరి తరవాత ఒకరు మూర్ఛపోయారు. జరాసంధుడి పక్షాన కొందరు చచ్చారు. చివరకు జరాసంధుడు నిలవలేకపోయాడు. అతనూ, అతని సేనా ఓడి పారిపోయారు. కృష్ణుడు విజయగర్వంలో పాంచజన్యం ఊదాడు.

బలరామకృష్ణులు కొంత కాలంపాటు గోమంతగిరి మీదనే విశ్రాంతి తీసుకుందా



మని నిశ్చయించారు. అంతలో ఒక చిత్ర మైన సంఘటన జరిగింది.

జరాసంధుడి వెంట రాజులందరూ వెళ్ళి పోయారు. అయితే చేదిదేశపు రాజైన దమ ఘోషు డనేవాడు, శిశుపాలుడి తండ్రి, తన సేనలతోసహా గోమంతానికి తిరిగివచ్చి, కృష్ణుణ్ణి కలుసుకుని, "నాయనా, నేను మీ మేనత్త పెనిమిటిని. నా పేరు దమ ఘోషుడు. ఈ జరాసంధుడు మరీ ధూర్తుడు. కృష్ణుడితో వైరం వద్దని చాలా సార్లు చెప్పి చూశాను, కాని విన్నాడుకాడు. వాడంటే భయంగాని, లేకపోతే ఎన్నడో విడిచిపెట్టి ఉందును. ఇవాళ వాడి ఓటమి చూసి, నాకు అయిన వారందరితో సహా నీ పక్షం వచ్చేశాను. కాని వీడు బలవంతుడు. ఇంతటితో వీడి పీడ విరగడ అయిందనుకోకు, మళ్ళీ ఏదో వంక వెతుకుతాడు. ఈ పీనుగు పెంటల మధ్య ఇంకా నువ్వు దేనికి ఉన్నట్టు? పోదాంపద. ఇక్కడికి దగ్గరలోనే కరవీరపురం అని ఉన్నది. దాన్ని పాలించే సృగాల వాసుదేవుడికి నీ పైన చాలా ఈర్ష్య. వాణ్ణి అణచటం అవసరం. ఇవిగో, రెండు ఉత్తమ రథాలు. వీటిని మీ అన్నదమ్ము లిద్దరూ తీసుకోండి," అన్నాడు.

కృష్ణుడు దమఘోషుణ్ణి అభిమానంతో చూసి, "బంధుత్వంతో గూడిన ప్రేమ అంటే ఇలాగే ఉండాలి. నీ మాటలు మాకు మహదానందం కలిగించాయి. నీవంటి వాడి ప్రాపు దొరకటంచేత మేము ధన్యులం. ఇప్పుడు జరిగిన యుద్ధం చూశావుగద! ఇదే పద్ధతిలో మేము ఎన్ని యుద్ధాలైనా చెయ్యగలం," అన్నాడు.

ఆ రోజే బలరామకృష్ణులు రథాలెక్కి దమఘోషుడి బలాల వెంట బయలుదేరి, దారిలో రెండు మజిలీలు వేసి, మూడో నాడు ఉదయం కరవీరపురం చేరి అక్కడ శిబిరం వేశారు.





# కృష్ణావతారం

కరవీరపురం చేరుతూనే కృష్ణుడు అక్కడి కావలివాళ్ళతో తాను ఫలానా అనీ, సృగాలవాసుదేవుడితో యుద్ధానికి తామంతా వచ్చామనీ, వెంటనే ఆ సృగాలవాసుదేవుడు వచ్చి యుద్ధం చెయ్యవలిసిందనీ చెప్పి కబురు చేశాడు. వాళ్ళు వెళ్ళి తమ రాజుకు యీ వార్త చెప్పారు.

ఆ మాట వింటూనే సృగాలవాసుదేవుడు కోపంతో కళ్ళెర్ర చేసి, పూర్వం సూర్యుడు తనను మెచ్చి ఇచ్చిన బంగారు రథం ఎక్కి, బంగారు కవచం ధరించి, అమోఘమైన విల్లూ, బాణాలూ, ఖడ్గమూ మొదలైన ఆయుధాలు వెంట తీసుకుని, సైన్యాన్ని వెంట రావద్దని చెప్పి, ఒంటరిగా బయలుదేరి వచ్చాడు.

యమధర్మరాజు లాగా వచ్చే సృగాలవాసుదేవుణ్ణి చూసి బలరామకృష్ణులు సంభ్రమం చెందారు. దమఘోషుడు వారిద్దరికీ ఉత్సాహం కలిగించాడు. తరవాత కృష్ణుడు తన రథాన్ని శత్రురథానికి ఎదురుగా నడిపించుకుంటూ వెళ్ళాడు. ఆ మీద ఇద్దరికీ భయంకరమైన ద్వంద్వ యుద్ధం జరిగింది.

ఒకరి పైన ఒకరు బాణవర్షం కురిపించారు. ఒకరు వేసిన అస్త్రాలను ఒకరు ఛేదించారు. కృష్ణుడు తన విరోధి విల్లు విరగగొట్టి, సారథిని చంపాడు. సృగాలవాసుదేవుడు లక్ష్యపెట్టక, మరొక విల్లు తీసుకుని, రథాన్ని తానే నడుపుకుంటూ కృష్ణుడితో, "గోమంతం దగ్గిర కొందరు

14. సృగాలవాసుదేవుడి వధ



రాజులను జయించి, ఆ గర్వంతో ఇక్కడికి వచ్చావు. ఆ రాజులు మూఢులు, అల్పులు. నేను ఒంటరిగా వచ్చాను. నువు కూడా ఒంటరిగానే నాతో యుద్ధానికి వచ్చావు. ఇది ధర్మయుద్ధం. ఈ ప్రపంచంలో ఇద్దరు వాసుదేవు లుండటానికి వీల్లేదు. అందుచేత నిన్ను చంపి, నేనొక్కణ్ణే వాసుదేవు డని పించుకుంటాను," అన్నాడు.

కృష్ణుడు వెటకారంతో, "నీలో ఇంకా యుద్ధ వాంఛ ఉన్నట్టయితే నీ ప్రతాపం చూపించు, చూస్తాను. తరవాత నేను చేసే దేదో చేస్తాను. దాన్ని గురించి ఇప్పుడు చెప్పవలిసిన పని లేదు," అన్నాడు.

సృగాలవాసుదేవుడు అతి వేగంగా కృష్ణుడి పై బాణాలూ, తోమరాలూ, చక్రాలూ, గొడ్డళ్ళూ, పరిఘలూ, ఖడ్గాలూ విసిరి, చీకటి కమ్మే లాగా చేశాడు.

కృష్ణు డది చూసి, "నీ శక్తి చూపావు, చూశాను. ఇదుగో నేను చెయబోతున్నది," అంటూ తన చక్రాయుధాన్ని అతడి మీద ప్రయోగించాడు. అది మహాభయంకరంగా తిరుగుతూ మెరుపులా వెళ్ళి, సృగాలవాసు దేవుడి తలను రెండుగా నరికి, కృష్ణుడి చేతికి తిరిగి వచ్చింది.

ఈ విధంగా సృగాలవాసుదేవుడు యుద్ధంలో చనిపోయాడని విని, అతని అంతఃపుర కాంతలు గొల్లున ఏడుస్తూ తమ భర్త పడిపోయిన చోటికి వచ్చారు. పట్టపు రాణి తన కొడుకైన శక్రదేవుణ్ణి తెచ్చి, కృష్ణుడి పాదాల మీద పడేసి, ఏడ్చింది. కృష్ణు డామె నోదార్చి, మంత్రులనూ సామంతులనూ, పౌరముఖ్యులనూ, పురోహితులనూ పిలిపించి, శక్రదేవుడికి రాజ్యాభిషేకం చేయించాడు.

తరవాత కృష్ణుడు మధురకు తిరిగి పోతా డని తెలిసి అతని మేనమామ అయిన దమఘోషుడు, వెళ్ళివస్తానని చెప్పి, తన సైన్యంతో సహా చేదిదేశానికి వెళ్ళిపోయాడు.

బలరామకృష్ణులు అయిదు రోజులు ప్రయాణించి ఆరో నాటికి మధురా నగరాన్ని చేర వచ్చారు. నగరం అంత దూరాన కనబడగానే కృష్ణుడు పాంచజన్యం పూరించాడు. ఆ శంఖనాదం విని యాదవులు, ఉగ్రసేనుణ్ణీ, ప్రధాన పురోహితులనూ వెంటబెట్టుకుని, ఏనుగులనూ, గుర్రాలనూ, సైనికులనూ ఆయత్తపరిచి, గొడుగులు తీసుకుని, మంగళవాద్యాలతో సహా ఎదురు వచ్చారు. వందిమాగధుల స్తోత్రాలూ, బ్రాహ్మణుల ఆశీర్వాదాలూ మారుమోగుతూండగా బలరామకృష్ణులు మహావైభవంగా మధురా ప్రవేశం చేశారు.

కృష్ణబలరాముల చేత ఓడిపోయి మగధకు తిరిగి పోయిన జరాసంధుడు అవమానంతో కుమిలిపోతున్నాడు. అంతమంది రాజులనూ, అంత సేననూ వెంట పెట్టుకుని పోయి, ఇద్దరు యాదవ కుమారుల చేతిలో ఓడి పారిపోవటం కన్న సిగ్గుబాటు ఇంకేముంటుంది? ఈ అవమానంతో అతనికి మనశ్శాంతి లేకుండా పోయింది.

చివరకు జరాసంధుడు రాజుల నందరినీ తిరిగి సమావేశపరిచి, "పాపిష్ఠి దేవుడు అనుకూలించక పోయేసరికి మనం, ఇంత బలపరాక్రమా లుండి కూడా ఇద్దరు గోప బాలకుల చేతిలో దెబ్బ తిన్నాం. మనకు





కలిగిన ఈ అపఖ్యాతి శాశ్వతంగా ఉండి పోతుంది. అలా కాకుండా చెయ్యాలంటే మనం ఆ యాదవు లిద్దరినీ ఎలాగైనా చంపటం తప్ప మరొక మార్గం లేదు. మీ రందరూ మీ మీ సైన్యాలతో మధుర పైకి బయలుదేరండి. మన బలాల ముందు క్షుద్రులైన యాదవులు నిలవటం కల్ల," అని చెప్పాడు.

ఈ మాటకు అందరూ సమ్మతించారు. ఎందుచేతంటే, వారంతా గోమంతం దగ్గిర అవమానం పొందినవారే. పై పెచ్చు వారిలో జరాసంధుడి దాయాదులూ, సగోత్రీకులూ, మిత్రులూ, బంధువులూ



ఉన్నారు. పౌండ్ర, కళింగ, దంతవక్త్ర, శిశుపాల, సాల్వ, రుక్మి, గాంధార, త్రిగర్త, భగదత్తులూ, మరికొందరూ కృష్ణద్వేషులు. అంగ, వంగ, విదేహ, కాశ, కరూశ, మద్ర, పాండ్య మొదలైన దేశాల రాజులు కూడా జరాసంధుడి పక్షాన పోరాడటానికి సిద్ధంగా ఉన్నారు. తిరిగి ఇరవైఒక్క అక్షౌహిణీల సేన సమకూడింది. వాళ్ళు అంచె ప్రయాణాల మీద మధురానగరాన్ని చేరవచ్చి, నగరం చుట్టూ ఉండే తోటలలో యమున పొడుగునా విడిశారు.

కృష్ణుడు మొదలైనవాళ్ళు కోట గోడ లెక్కి చూస్తే జరాసంధుడి సేన ప్రళయానికి ముందుండే సముద్రం లాగా కనబడింది. కృష్ణుడు బలరాముణ్ణి చూసి నవ్వుతూ, "భూభారం తగ్గించటానికి దేవుడీ ఏర్పాటు చేసినట్టున్నది," అన్నాడు.

ఇద్దరూ కలిసి సేనలతో శత్రువును ఎదిరించటానికి నిశ్చయించారు.

జరాసంధుడు తన వెంట వచ్చిన రాజులతో తన యుద్ధ తంత్రం ఈ విధంగా చెప్పాడు. వెంటనే సేనలు మధురా నగరాన్ని చుట్టుముట్టాలి. గునపాలతో కోట గోడలు అక్కడక్కడా బద్దలు కొట్టాలి. నగరాన్ని పూర్తిగా నాశనం చెయ్యాలి.







గోమంతపర్వతాన్ని చుట్టుముట్టినప్పుడు ఎవ రెవరు ఏయే దిక్కులలో నిలబడ్డారో, అదేవిధంగా మధుర చుట్టూ కూడా నిలబెట్టాడు జరాసంధుడు.

ఈసారి యాదవులు జరాసంధుడితో యుద్ధమంటే జంకలేదు. నిజానికి జరాసంధుడి బలాలముందు తమ బలాలు ఎందుకూ పనికిరావు, కాని తమ వెంట కృష్ణుడున్నాడు. అదే వారి ధైర్యం. గరుత్మంతుడి జెండా గల రథంలో చక్రం మొదలుగా గల ఆయుధాలు పెట్టుకుని కృష్ణుడూ, నాగలి, రోకలి మొదలైన ఆయుధాలు వెంటబెట్టుకుని బలరాముడూ యుద్ధానికి వస్తుంటే చాలా కనులపండువుగా కనిపించింది. వాళ్ళిద్దరూ ఉగ్రసేనుడితోసహా తమ సేనకు ముందుండి నడుస్తూ, జరాసంధుడి సేనను సమీపించారు. తన సేనకు ముందు నిలబడి ఉన్న జరాసంధుడు వాళ్ళను ఎదుర్కొని, కృష్ణుడి పక్కనే ఉన్న ఉగ్రసేనుడితో, "భోజవంశం వారు రాజ్యాలేలితే, యాదవులు వారికి సేవచేస్తారు. అలాటి భోజవంశంలో పుట్టి కూడా నువు వంశ ప్రతిష్ఠ పోగొట్టుకున్నావు. నీ కన్న మూర్ఖుడుంటాడా? ఈ కృష్ణుడు నీ కొడుకును చంపి రాజ్యం కాజేసి, ఉత్త సింహాసనం మటుకు నీ కిచ్చాడు. వాడు పెట్టే పిండాకూడు తింటున్నావు. ఎందుకు? ఏళ్ళు వచ్చాయి! నీదీ ఒక జన్మేనా? సిగ్గులేక ఈ భోగం ఎలా అనుభవిస్తున్నావు? కృష్ణుడికి నువు బంటువు తప్ప రాజువు కావు," అన్నాడు.

కృష్ణుడిది విని మండిపడి, "గౌరవనీయుడైన ఉగ్రసేనుణ్ణి నిందించటంలోనే ఉన్నదా ఏమిటి నీ పౌరుషం? ఏమైనా అనదలిస్తే నన్నే అను. నీకు నేనేగదా అసలు విరోధిని? ఆ రోజు గోమంతం దగ్గిర నాతో యుద్ధం చేసినవాడవేగదా. హాస్యాస్పదంగా మాట్లాడకు. ఈసారైనా పారిపో





కుండా నిలిచి యుద్ధంచెయ్యి, నా ప్రతాపం పూర్తిగా చూతువుగాని," అంటూ జరాసంధుణ్ణీ, సారథినీ బాణాలతో కొట్టి, అతని విల్లు విరగగొట్టాడు.

ఉభయపక్షాల వీరుల మధ్యా తీవ్రంగా యుద్ధం సాగింది. ఈ యుద్ధంలో ఉగ్రసేనుడు కూడా గొప్ప పరాక్రమం ప్రదర్శించాడు. ఒకసారి కృష్ణుడికీ రుక్మికీ ద్వంద్వ యుద్ధం జరిగింది. అందులో రుక్మి చిత్తుగా ఓడి తప్పుకు పోయాడు.

బలరాముడు చెలరేగి తన పక్షంవాళ్ళను మందను తోలినట్టు తోలటం చూసి జరాసంధుడు అతన్ని ప్రతిఘటించాడు. ఇద్దరూ ఒకరి రథాలొకరు ధ్వంసం చేసుకుని, గదా యుద్ధానికి దిగారు. వాళ్ళ యుద్ధం చూడటానికి మిగిలినవాళ్ళంతా యుద్ధం మానేశారు. వాళ్ళిద్దరూ ఒకరి దెబ్బలు ఒకరు తప్పించుకుంటూ, ఒకరి నొకరు గదలతో మోదుకుంటూ, రక్తధారలు కారుతూ, భూమి దద్దరిల్లేలాగా, రెండు పెద్ద పులుల మాదిరి యుద్ధం చేశారు. చివరకు ఎవరిని ఎవరూ చంపకుండానే ఆ గదా యుద్ధం ముగిసింది.

ఈ విధంగా కొన్ని రోజులపాటు యుద్ధం జరిగింది. జరాసంధుడు కోరిన విధంగా అతనికి విజయం లభించలేదు. అతని బలాలు రోజు రోజుకూ క్షీణిస్తున్నాయి. అతను ప్రాణం విసిగి, దైవం తనకు అనుకూలించటం లేదనుకుని, తన పక్షాన వచ్చిన రాజులనూ, సేనలనూ వెంట బెట్టుకుని మగధకు తిరిగిపోయాడు.

కాని జరాసంధుడు అంతటితో వదలలేదు. ఇదేవిధంగా అతను మధుర మీదికి పద్దెనిమిదిసార్లు దండెత్తి వచ్చాడు. కృష్ణుణ్ణి చంపటం జరాసంధుడి వల్లా కాలేదు, జరాసంధుణ్ణి చంపటం కృష్ణుడి వల్లా కాలేదు. కారణం, జరాసంధుడు మరొకరి చేతిలో చావవలిసి ఉన్నాడు.

రోజులు సుఖంగా గడుస్తున్నాయి. బలరాముడికి తన చిన్ననాటి విషయాలన్నీ జ్ఞాపకం వచ్చి, ఒకసారి గోకులం చూడాలనిపించింది. కృష్ణుడితో చెబితే అతన్ని వెళ్ళిరమ్మన్నాడు; కాని తాను బయలుదేర లేదు. బలరాముడు అరణ్యప్రాంతాలకు తగిన వేషం వేసుకుని వ్రేపల్లెకు వెళ్ళాడు. అతన్ని అంత దూరంలోనే చూసి గోపకులు పరమానందంతో ఎదురు వెళ్ళారు. బలరాముడు కొందరికి దణ్ణాలు పెట్టాడు, కొందరి చేత పెట్టించుకున్నాడు, మరి కొందరిని కౌగిలించుకున్నాడు. గోపికలందరూ అతని చుట్టూ మూగితే వారందరినీ ప్రేమగా పలకరించాడు.

వృద్ధగోపులు అతన్ని తమ మధ్య కూర్చొబెట్టుకుని ఇష్టాగోష్ఠి జరిపారు.

"నాయనా, నువు రావటం గొప్ప విశేషం. ఎటువంటి వాళ్ళకైనా జన్మస్థలం మీద ప్రేమ పోదనటానికి ఇంతకంటె ఏం నిదర్శనం కావాలి? మీ అన్న దమ్ములు చాణూరముష్టికులను చంపారు, కంసుణ్ణి హతమార్చారు, గోమంతం దగ్గిర మహాసేనను జయించారు, సృగాల వాసుదేవుణ్ణి చంపారు, ఎంతో కీర్తి సంపాదించారు. అయినా నువు గోవులను కాచిన చోటు వెతుక్కుంటూ వచ్చావు!" అన్నారు గోపవృద్ధులు.

"మీరు పెంచబట్టేగదా మాకీ ఖ్యాతి వచ్చింది? మీవంటి బంధువులు కావాలంటే మటుకు దొరుకుతారా? నాకూ, నా తమ్ముడికీ ఆ రాజభోగాల మీద మనసు పోదు. ఇక్కడ చిన్నతనంలో గడిపిన రోజులు మరుద్దామన్నా మరవలేం," అన్నాడు బలరాముడు.

ఈ మాటకు అందరూ సంతోషించి అతను తాగటానికీ, తినటానికీ ఉత్తమమైన పానీయాలూ, భక్ష్యాలూ పెట్టి ఎంతో ప్రేమతో ఆదరించారు.





# కృష్ణావతారం

గోకులానికి ఎలాటి బట్టలతో వెళ్ళాడో వాటితోనే బలరాముడు మధురకు వచ్చి, తిన్నగా కృష్ణు డింటికి వెళ్ళాడు. కృష్ణు డతని పాదాలకు నమస్కారం చేసి, స్వాగతం తెలిపాడు. తరవాత అన్నదమ్ము లిద్దరూ వసుదేవుడి ఇంటికి వెళ్ళారు. వసుదేవుడు బలరాముణ్ణి కౌగలించుకుని, విశేషాలు అడిగాడు. బలరాముడు గోకులంలో తాను చేసిన ఘనకార్యం ఒకటి చెప్పాడు.

అతను ఒకనాడు తాను కూర్చున్న చోటి నుంచి కాళిందీనదిని పిలిచి, తన దగ్గిరికి వచ్చి, తన చేత స్నానం చేయించమన్నాడు. కాళిందీనది రాలేదు. బలరాముడికి కోపం వచ్చింది. అతను తన నాగలిని కాళిందికి వేసి లాగాడు. ఆ విధంగా బృందావనానికి కాళింది కాలువ ఒకటి ఏర్పడి, గోపకులకు చాలా ఉపకారం జరిగింది.

కొంతకాలం గడిచింది. ఒకనాడు కృష్ణుడు యాదవుల సభలో ఒక ప్రతిపాదన ఈ విధంగా చేశాడు:

"మనం నివసించే ఈ మధుర లాటిది ప్రపంచంలో మరొకటి లేదు. ఇలాటి క్షేత్రం కూడా మరెక్కడా ఉండదు. మేం వ్రేపల్లెలో పెరిగినా, పుట్టటం ఇక్కడే పుట్టాం. ఇక్కడికే తిరిగివచ్చి సకలైశ్వర్యాలూ సంపాదించుకున్నాం. అయితే, ఇక్కడ మనకు శత్రుబాధ జాస్తి అయింది. ప్రపంచంలో ఉండే రాజులందరూ జరాసంధుడి వెంట ఎత్తివచ్చి, ఎటువంటి హింసాకాండ జరిపారో మీరు చూశారు కద!




ఈ ప్రమాదం తుదముట్ట లేదు. మనకు మంది మార్బలం ఉన్నది. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ ఉన్నాయి. పుష్కలంగా బంగారమూ, రత్నరాసులూ ఉన్నాయి. కాని ఏం లాభం? మన శత్రువులు వచ్చి పడ్డప్పుడల్లా మనం మనకున్నది నష్టపోతున్నాం. ఇది సహించరానిది. అందుచేత మనం ఇక్కడినుంచి వెళ్ళిపోవటం నాకు కర్తవ్య మనిపిస్తున్నది. మనం ఉండటానికి మరొక ప్రదేశం చూస్తాను. అక్కడికి పోయి సుఖంగా ఉందాం."

కృష్ణుడు చెప్పిన మాటలు యాదవులకు సరిగా ఉన్నట్టే తోచాయి. జరాసంధుణ్ణి



చంపటం సాధ్యం కాదు. అతని వెనక అంతులేని సేన ఉంటున్నాయి. యుద్ధం చెయ్యవచ్చు. ఆ యుద్ధం ఎప్పటికీ తెగదు. జరిగేదల్లా ఉభయ పక్షాలవారూ నాశనం కావటం. కృష్ణుడు నిరపాయ స్థలం చూపే పక్షంలో అక్కడికి పోవటమే మంచిదని యాదవనాయకు లనుకున్నారు.

కృష్ణుడు యాదవుల నందరినీ ఫలాని చోటికి తీసుకుపోవాలని తన మనసులో నిశ్చయించుకుని, అందరినీ ప్రయాణ సన్నాహాలు చేయమన్నాడు.

ఇదే సమయంలో కాలయవను డనే వాడు మధుర మీదికి సైన్యాలతో సహా బయలుదేరాడనీ, జరాసంధుడు కూడా అదే ప్రయత్నం ప్రారంభించాడనీ తెలియవచ్చింది. ఈ సంగతి వింటూనే కృష్ణుడు, "మనం ఇవాళే బయలుదేరుదాం. ఈ రోజు చాలా బాగుంది," అని తన వారికి చెప్పాడు.

వసుదేవుడూ, ఉగ్రసేనుడూ, బలరామకృష్ణులూ, వారి వెంట వృష్ణి, అంధక వీరులూ, వారి కుటుంబాలూ, అంతులేని ఏనుగులతో, రథాలతో, గుర్రాలతో, తమ సంపద లన్నిటినీ వెంట తీసుకుని మధురా నగరం విడిచి, పడమటి దిక్కుగా ప్రయాణ మయారు. వారు అలా రోజూ ప్రయాణం





చేస్తూ పశ్చిమ సముద్రతీరాన్ని చేరు కున్నారు. అది అనేక చెట్లతోపులతో కూడు కుని ఉన్న గరువుప్రదేశం. ఆ ప్రాంతం లోనే పూర్వం ఏకలవ్యుడు ద్రోణాచార్యు లను పూజించాడు.

ఎక్కడ ఇళ్ళు కట్టాలో, ఎక్కడ తోటలు పెంచాలో, ఎక్కడ నీటి సదుపాయా లున్నాయో బాగా ఆలోచించి, అక్కడ ఒక అందమైన నగరం నిర్మించి, దానికి ద్వారవతి అని పేరు పెట్టారు. అందరికీ నగరంలో మంచి ఇళ్ళు ఏర్పాటయాయి. యాదవులకు శత్రుభయం తీరిపోయింది. వాళ్ళు సుఖంగా, నిశ్చింతగా ద్వారవతిలో జీవించసాగారు. అయితే ద్వారవతీ నిర్మా ణానికి ముందు చాలా కథ నడిచింది.

ఎటువంటి శత్రువునూ లక్ష్యపెట్టని కృష్ణుడు కాలయవనుడికి వెరిచి, మధుర విడిచిపెట్టి, పడమటి సముద్రాన నగరం నిర్మించుకోవటానికి కారణం ఉన్నది. అదొక చిన్న కథ.

ఒకప్పుడు వృష్ణి, అంధకకులాల వారికి గర్గు డని ఒక గురువు ఉండేవాడు. అతను అజన్మబ్రహ్మచర్యం అవలంబించాడు. గర్గుడు యాదవుల మధ్య ఉండగా ఒకసారి ఎవడో ఆయనను చూసి, మగవాడు కాదు,



ఆడది అని అపహాస్యం చేశాడు. యాదవులు ఆ మాట విని ఊరుకున్నారు గాని తమ ఆక్షేపణ తెలపలేదు.

గర్గుడికి మండిపోయింది. అతను అడవికి వెళ్ళి, పన్నెండేళ్ళ పాటు లోహ చూర్ణం తింటూ, అతి ప్రచండమైన తపస్సు చేసి, శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, వృష్ణి, అంధకులను పీడించగల కొడుకు తనకు కలిగేటట్టు వరం పొందాడు. ఈ సంగతి తెలిసి, కొడుకులు లేని యవనేశ్వరుడు, అతన్ని పిలుచుకు పోయి, తన గోవుల మందల మధ్య అతనికి నివాసం ఏర్పాటు చేసి, అతనికి కావలసిన ఏర్పాట్లన్నీ చేశాడు.





69





"ఈ నాడు యాదవులను మించిన వీరులు ప్రపంచంలో లేరు," అంటూ నారదుడు చాలా గొప్పగా వర్ణించి చెప్పాడు. నారదుడి మాటలు వింటున్న కొద్దీ కాలయవనుడికి మాత్సర్యం పుట్టుకొచ్చింది. శకవంశానికి చెందిన రాజులూ, హిమాలయంలో ఉండే దస్యులూ అతనెలా చెబితే అలా నడుచుకుంటారు. అందుచేత వారినందరినీ చేర్చి ఒక సేనగా తయారుచేసి, ఏనుగులనూ, గుర్రాలనూ, గాడిదలనూ అమితంగా వెంటబెట్టుకుని, మధుర మీదికి కాలయవనుడు బయలుదేరాడు.

ఈ సంగతి నారదుడి వల్లనే విని కృష్ణుడు పరిస్థితి అంతా చక్కగా ఆలోచించి, మధుర విడిచి వెళ్ళటమే కర్తవ్యమని నిశ్చయించుకున్నాడు. తానీ నిశ్చయానికి రాగానే యాదవులను హెచ్చరించాడు.

కృష్ణుడు మరొక పని కూడా చేశాడు. అతను ఒక కుండలో ఒక కాలసర్పాన్ని ఉంచి, దానికి వాసెన కట్టి, ఒక దూత చేతికిచ్చి కాలయవనుడి దగ్గిరికి పంపుతూ, ఇలా చెప్పమన్నాడు: "ఈ కుండలో ఉన్న కాలసర్పం లాటిది కృష్ణుడి పరాక్రమం."

ఆ మాట విని కాలయవనుడు ఏమీ అనక, కాలసర్పం ఉన్న కుండలో కంద

గర్గుడు అలా గోవుల మందల మధ్య నివసిస్తూండగా ఒక అప్సరస గోపిక రూపంలో అతని వద్దకు వచ్చి, ఈశ్వరాదేశం ప్రకారం గర్భవతి అయి, కాలయవనుణ్ణి కన్నది. ఆ కుర్రవాణ్ణి యవనరాజు తన కొడుకుగా పెంచి, పెద్దవాణ్ణి చేశాడు. కాలయవనుడు గొప్ప తేజోవంతుడూ, పరాక్రమవంతుడూగా పెరిగాడు. అతను ఎంతటి వారినీ లక్ష్యపెట్టేవాడు కాడు.

ఒకనాడు యవనరాజు వద్దకు నారదుడు వచ్చాడు. అప్పుడు కాలయవను డాయనను, "ప్రపంచంలో గొప్ప వీరు లెవరు?" అని అడిగాడు.







చేశారు. ఈ లోపల కృష్ణుడి రాక విన్న కాలయవనుడు తాను కూడా నిరాయుధుడూ, పాదచారీ అయి కృష్ణుడికి ఎదురు వచ్చి, కృష్ణుణ్ణి సమీపించాడు. కాని కృష్ణుడు అతనికి చేయి ఇవ్వబోయేవాడి లాగా నటిస్తూ, ఇవ్వకుండానే అతి వేగంగా ఒక గుహలో ప్రవేశించాడు.

ఆ గుహలో ముచికుందుడనేవాడు నిద్ర పోతున్నాడు. ఈ ముచికుందుడు మాంధాత కొడుకు. అతను దేవాసుర యుద్ధంలో చాలా కాలం యుద్ధం చేసి, దేవతలకు విజయం చేకూర్చి, శ్రమతీరటానికి నిద్ర పోబోతూ, తనకు నిద్రాభంగం కలిగించిన వాణ్ణి తన చూపులతోనే భస్మం చేసేటట్టు వరం పొందాడు. ఈ సంగతి కృష్ణుడికి తెలుసు. అతను గుహలో ప్రవేశిస్తూనే ముచికుందుడి తల వైపున దాక్కున్నాడు.

అతని వెనకగా గుహలోకి వచ్చిన కాలయవనుడు, నిద్రపోతున్న ముచికుందుణ్ణి చూసి కృష్ణుడే నని భ్రమపడి, కాలితో తన్ని, "ఇలా చావు తప్పించుకుందా మనుకుంటున్నావా? లే, లే. నీ బలం తెలిసింది," అంటూ వికటాట్టహాసం చేశాడు.

నిద్రాభంగం కలిగి ముచికుందుడు లేచి కూర్చుని, కాలయవనుడి కేసి కోపంగా

చీమలను కొన్నిటిని వేసి, మళ్లీ వాసెన కట్టి, దాన్ని తీసుకుపోయి కృష్ణుడి కియ్యమన్నాడు. "నువు ఎంత బలవంతుడివైనా, అనేక మంది మధ్య ఒంటరిగా చిక్కితే నీ బలం ఎందుకూ పనికిరాదు," అని కాలయవనుడి సందేశం. దాని అంతరార్థం గ్రహించి కృష్ణుడు మధురానగరం నుంచి, యాదవు లందరితోనూ బయలుదేరాడు.

అతను ద్వారవతి నుంచి నిరాయుధుడుగా, కాలినడకన బయలుదేరి తన శత్రువు ఉండే నగరం చేరాడు. అక్కడి వాళ్ళు కృష్ణుణ్ణి గుర్తించి, "చుట్టుముట్టండి. పట్టుకోండి," అని ఆర్భాటం



చూశాడు. మరుక్షణమే కాలయవనుడు, పిడుగుపడిన చెట్టులాగా అయి, నిలువునా లేచిన మంటలలో బూడిద అయిపోయాడు.

తరవాత కృష్ణుడు తాపీగా ముచికుందుడి ఎదటపడి, "అయ్యా, నీ విక్కడ ఉన్న సంగతి నాకు నారదుడి ద్వారా తెలిసింది. నా పని నీ మూలాన నెరవేరింది. తృప్తి పడ్డాను. ఇక వెళ్ళివస్తాను," అన్నాడు.

ముచికుందుడు కృష్ణుణ్ణి చూసి, "అయ్యా, నీ వెవరు? ఇక్కడికి ఏం పని మీద వచ్చావు? నాకు నిద్రాభంగం కలిగించిన ఈ మనిషి ఎవరు? నే నిక్కడ ఎంతకాలంగా నిద్రపోతున్నాను? తెలిస్తే చెప్పు," అన్నాడు.

దానికి కృష్ణు డిలా చెప్పాడు:

"చంద్రుడికి సాటి అనదగినవాడు నహుషుడు. ఆయన కొడుకు యయాతి. యయాతికి అయిదుగురు కొడుకులు. వారందరిలోకీ పెద్దవాడు యదువు. ఆ యదువు సంతతిలో వసుదేవు డనే మహనీయుడు పుట్టాడు. ఆ వసుదేవుడికి దేవకి అనే భార్య యందు నేను పుట్టాను. ఆయనకు రోహిణి అనే భార్య యందు పుట్టిన బలరాముడికి తమ్ముణ్ణి, నన్ను వాసుదేవు డంటారు. నీ కోపాగ్నికి ఆహుతి



అయిన ఇతను కాలయవను డనే ప్రసిద్ధుడు, వరం వల్ల పుట్టినవాడు. మరొకవిధంగా చావనివాడు, నా శత్రువు. నీవు త్రేతా యుగంలో పుట్టినట్టు విన్నాను. ఇప్పుడు కలియుగం సమీపిస్తున్నది."

ముచికుందుడు గుహ నుంచి బయటికి వస్తూ తిరిగి రాజ్యం చేసుకుందా మనుకున్నాడు. కాని తీరా భూమి మీద సంచరించే మనుషుల అల్పప్రమాణమూ, అల్పబుద్ధులూ, అల్ప పరాక్రమమూ చూస్తే ఆయనకు రాజ్యాలేలా లనిపించలేదు. అందుచేత ఆయన తపస్సు చేసుకోవటానికి హిమాలయారణ్యాలలోకి వెళ్ళిపోయాడు.



తన ప్రబల శత్రువు చనిపోయాక కృష్ణుడు కాలయవనుడి సేనలోని ప్రధాన వీరులను తన దివ్యాస్త్రాలతో అనాయాసంగా చంపేసి, మిగిలిన సేనలను తన వశం చేసుకుని, అతి వేగంగా వెళ్ళి తన వారిని చేరుకున్నాడు. ఇదంతా జరిగాకనే ద్వారవతీనగర నిర్మాణం జరిగింది.

ద్వారవతీ నిర్మాణానికి విశ్వకర్మ సహాయం పొంద నిశ్చయించి కృష్ణుడు ఆ దేవశిల్పిని స్మరించాడు. వెంటనే విశ్వకర్మ ప్రత్యక్షమై, "నన్నెందుకు స్మరించావు? నా వల్ల ఏం పని కావాలి?" అని అడిగాడు.

"స్వర్గంలో ఇంద్రుడి నగరం ఎలా ఉత్తమంగా ఉంటుందో, భూలోకంలో అలా సర్వోత్తమంగా ఉండే నగరాన్ని నాకు కట్టిపెట్టాలి," అన్నాడు కృష్ణుడు.

"ఈ జనాని కంతకూ తగిన నగరం నిర్మించాలంటే ఇక్కడ ఉన్న ప్రదేశం చాలదు. సముద్రం కొంత వెనక్కు పోయి సట్టయితే, చక్కని విశాలనగరం నిర్మించవచ్చు," అన్నాడు విశ్వకర్మ.

కృష్ణుడు సముద్రుణ్ణి ప్రార్థించాడు. సముద్రుడు ప్రత్యక్షమై, ఎటుచూసినా పన్నెండు యోజనా లుండేటట్టుగా భూమి వదిలి, తాను వెనక్కు వెళ్ళిపోయాడు. అప్పుడక్కడ విశ్వకర్మ దివ్యమైన నగరాన్ని నిర్మించాడు. బంగారపు కోటా, ఆకాశాన్ని అంటే మణిగోపురాలూ, ఎత్తయిన ప్రాసాదాల వరసలూ, హర్మ్యాలూ, చక్కని రాజమార్గమూ, చైత్యాలూ, సభలూ, చావడులూ, తోరణాలూ, బురుజులూ, బావులూ, సరస్సులూ, కల్పిత శిలోద్యానాలూ అవతరించాయి. రాజభవనంలో కృష్ణుడు ఉన్నతాసనంలో కూర్చుంటే, యాదవప్రముఖులందరూ సభతీరారు. కృష్ణుడు విశ్వకర్మను సముచితంగా సత్కరించి ఇంద్రలోకానికి పంపేశాడు.






# కృష్ణావతారం

ఒకనాటి రాత్రి కృష్ణుడు తన తండ్రి ఇంట ఉండి ఒక ఆలోచన చేశాడు. తన వారికి వైభవోపేతమైన ద్వారకానగరం ఏర్పడింది. కాని వారికి జీవనం సుఖప్రదంగా జరిగే ఒనరు ఏర్పడలేదు. అందుచేత అతను శంఖనిధిని తలుచుకున్నాడు. వెంటనే శంఖనిధి ప్రత్యక్షమై, చేతులు మోడ్చి నమస్కరించి, "స్వామీ, ఎందుకు నన్ను స్మరించావు? నీ ఆజ్ఞ ఏమిటో తెలిస్తే నిర్వర్తిస్తాను," అన్నది.

"నిధిదేవతా, దరిద్రుడు చచ్చినవాడితో సమానం. నా వారిలో దీనులూ, అనాథులూ, ఆర్తులూ ఉండగా చూసి సహించలేను. అన్ని ఇళ్ళలోనూ సంపత్సమృద్ధి ఉండే టట్టు చూడు," అన్నాడు కృష్ణుడు.

"చిత్తం," అని శంఖనిధి వెళ్ళి మిగిలిన ఎనిమిది నిధులనూ కలుసుకుని, కృష్ణుడి కోరిక తెలిపింది. వెంటనే ద్వారక అంతటా నవనిధులూ వెలిశాయి. ఆ నగరంలో పేదవాడంటూ లేకుండా పోయాడు.

ఇదే విధంగా కృష్ణుడు మరొకసారి వాయుదేవుణ్ణి స్మరించాడు. వాయుదేవుడు వచ్చి కృష్ణుడికి నమస్కరించి నిలబడ్డాడు.

"వాయుదేవుడా, బలంలో నీకు చాలిన వాడు ఎవడూ లేడు. నా కొక పని చేసి పెట్టాలి. అదేమిటంటే; ఇంద్రుడికి విశ్వ కర్మ సుధర్మ అనే సభ చేసి యిచ్చాడు. మా యాదవులకు కూడలిగా ఒక మంచి సభ అవసరం. అందుచేత నువు ఇంద్రు డితో నా ఆజ్ఞగా చెప్పి, అతని అనుమతి

16. రుక్మిణీవివాహప్రయత్నం



63



మీద మా కా సభ తెచ్చిపెట్టు," అన్నాడు కృష్ణుడు. వాయుదేవుడు సరేనని దేవలోకానికి వెళ్ళి, దేవతలతో కృష్ణుడి కోరిక చెప్పి, వారి అంగీకారంతో సుధర్మ అనే సభాభవనాన్ని తెచ్చి, కృష్ణుడికి అప్పగించి వెళ్ళిపోయాడు.

ఈ విధంగా కృష్ణుడు సమస్త లోకాలలోనూ ఉన్న సర్వోత్తమమైన వస్తువులన్నీ తెప్పించి ద్వారకలో ఉంచాడు. కృష్ణుడు తాను పై నుండి పరిపాలన నడుపుతూ ఈ విధంగా ముఖ్యస్థానాలలో వారి వారిని నియమించాడు: రాజు ఉగ్రసేనుడు; కాశ్యపుడనే బ్రాహ్మణుడు పురోహితుడు; విక్రుదుడు మంత్రి; వివిధ రాజ్యాంగ శాఖలు నిర్వహించటానికి పదిమంది యాదవ ప్రముఖులు, మంచి మేధావులైన వృద్ధులు నియమించబడ్డారు; దారుకుడు కృష్ణుడికి సారథి; అస్త్రవిద్యలో ద్రోణాచార్యుడితో సమానుడనదగిన సాత్యకి సేనాధిపతి.

ఈ విధంగా ప్రజల జీవితాన్ని వ్యవస్థాపించిన మీదట ద్వారక భూలోక స్వర్గంలాగా, అత్యంత వైభవంగా విలసిల్లింది. రైవతుడికి రేవతి అనే చక్కని కుమార్తె ఉన్నది. ఆమెను బలరాముడు పెళ్ళాడాడు. ఆ తరవాత కృష్ణుడికి వివాహమయింది. అదొక కథ.

వింధ్యపర్వతానికి దక్షిణంగా విదర్భ దేశం ఉన్నది. అందులో కుండిననగరాన్ని భీష్మకుడనే రాజు పాలించేవాడు. ఆయనకు రుక్మి అనే కొడుకుండేవాడు. ఈ రుక్మి మేటి వీరుడు. అతను ద్రుముడనే రాజు వద్ద అనేక అస్త్రాలూ, పరశురాముడి నుంచి బ్రహ్మాస్త్రమూ పొందాడు. అతనికి మొదటి నుంచీ కృష్ణుడంటే ఎంతో మత్సరం ఉండేది.

ఆ రుక్మికి చెల్లెలు రుక్మిణి; గొప్ప తేజస్విని, అసమాన సౌందర్యవతి. ఆమె





అందం మూడు లోకాలలోనూ ప్రఖ్యాతి పొందినది. ఆమె గొప్పతనాన్ని మూడు ముక్కలలో చెప్పవచ్చు; కృష్ణుడి ప్రేమకు పాత్రురాలయింది; మన్మథుడు ఆమె గర్భాన తిరిగి జన్మించాడు; మునీశ్వరులామెను దేవతగా పూజించారు. అంతకంటె ఇంకేం చెప్పాలి?

రుక్మిణిని గురించి తన ఆప్తులు చెప్పుకుంటూంటే కృష్ణుడు విన్నాడు. అదే విధంగా కృష్ణుణ్ణి గురించి నలుగురూ చెప్పుకుంటూంటే రుక్మిణి విన్నది. ఇద్దరి మనసులలోనూ ఒకరి మీద ఒకరికి అనురాగం పుట్టుకొచ్చింది. దాని ఫలితంగా ఇద్దరూ మన్మథావస్థలకు గురి అయి, వేదన అనుభవించారు.

"నేను వరించిన దాన్ని నాకు కాకుండా చెయ్యగలవాడు మూడు లోకాలలోనూ ఎవడున్నాడు?" అన్న ధైర్యంతో ఉన్నాడు కృష్ణుడు. రుక్మిణి మనస్సులో కృష్ణుడి ఆలోచన తప్ప మరొక ఆలోచన లేకుండా పోయింది.

కాని రుక్మికి కృష్ణుడంటే బొత్తిగా పడదు. "నందగోపుడి యింట పశువులను కాచిన వాడికీ నాకూ వంతేమిటి?" అన్న ధీమాలో ఉన్నాడతను.

ఇలా ఉండగా, మగధ దేశంలోని గిరివ్రజపురం నుంచి జరాసంధుడు రుక్మిణిని శిశుపాలుడి కివ్వవలసిందని కబురు చేశాడు. శిశుపాలుడు జరాసంధుడి పెంపుడుకొడుకు. వాస్తవానికి అతని తండ్రి దమఘోషుడు. అతని తల్లి వసుదేవుడి తోబుట్టువైన శ్రుతశ్రవ. దమఘోషుడూ జరాసంధుడూ జ్ఞాతులు. అందుచేత దమఘోషుడు, జరాసంధుడు కోరిన మీదట తన నలుగురు కొడుకులలోనూ పెద్దవాడైన శిశుపాలుణ్ణి అతడికి పెంపుడిచ్చాడు.

శిశుపాలుడికి సునీధుడనే పేరు కూడా ఉన్నది.





జరాసంధుడు శిశుపాలుడికి రుక్మిణి నిచ్చి పెళ్ళి చెయ్యమని కబురు చెయ్యగానే రుక్మిణి తండ్రి అయిన భీష్మకుడు సరేనన్నాడు. నిజానికి భీష్మకుడి ఉద్దేశం రుక్మిణిని కృష్ణుడి కిస్తేనే బాగుంటుందని. కాని రుక్మికి కృష్ణుడంటే ద్వేషమని ఆయనకు తెలుసు. రుక్మి తన చెల్లెలిని శిశుపాలుడికే ఇవ్వాలన్న ఉద్దేశం బయట పెట్టాడు. కొడుకుకు ఎదురు చెప్పటం ఇష్టం లేక భీష్మకుడు సరేనన్నాడు.

తన కోరిక ఈడేరినందుకు జరాసంధుడు సంతోషించి తన ఆప్తులైన రాజు లందరికీ శుభలేఖలూ, ఆహ్వానాలూ పంపాడు. అంగ, వంగ, కళింగ, పౌండ్ర, పాండ్య, కాశ, కరూశ మొదలైన రాజు లనేకమంది పెళ్ళికి బయలుదేరారు. శిశుపాలుడికి తోడుగా వచ్చిన వారిలో కరూశ రాజకుమారుడు పౌండ్రక వాసుదేవుడూ, ఏకలవ్యుడి కొడుకు వీర్యవంతు డనేవాడూ, దంతవక్త్రుడి కొడుకు సువక్రు డనేవాడూ, ఇంకా అనేక మంది ఇతర రాజకుమారులూ ఉన్నారు. ఈ బలగాన్ని అంతనూ వెంట బెట్టుకుని జరాసంధుడు కుండిననగరానికి వచ్చాడు.

రుక్మి అనేక రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ వెంట బెట్టుకుని ఎదురు వచ్చి, జరాసంధుడికి స్వాగతం తెలిపి, సమస్త మర్యాదలూ జరిపి, వచ్చిన వారందరినీ విడుదులలో ఏర్పాటు చేశాడు.

ముహూర్తాలు పెట్టేవాళ్ళు వచ్చి, మర్నాడే లగ్నం ఉన్నదన్నారు. వెంటనే ఆ విషయం నగరమంతటా చాటింపు వేశారు. రాజులందరూ తమ తమ హోదాలకు తగినట్టుగా సేనలను అలంకరించారు. శిశుపాలుడు పెళ్ళికొడుకై తన తోటి రాజకుమారుల మధ్య ఉల్లాసంగా ఉన్నాడు.

ఇక్కడ ఇలా ఉంటే అక్కడ ద్వారకకు నారదుడు వచ్చాడు. తెల్లని శరీరమూ, బంగారు రంగులో ధగధగా మెరిసే



జుట్టుముడీ, శరీరం మీద ధరించిన చర్మమూ, నెత్తిన నెమలిఈకల గొడుగూ, గాలి తాకుడుకు నాదం చేస్తున్న వీణా— ఈ అవతారాన్ని ద్వారకాపురవాసులు అతి వింతగా చూశారు.

నారదుడు వచ్చాడని లోపలికి కబురు రాగానే, ఉగ్రసేనుడూ, వాసుదేవుడూ, కృష్ణ బలరాములూ, మిగిలిన యాదవ ప్రముఖులూ ఎదురు వచ్చి, నారదుణ్ణి సుధర్మ సభాభవనానికి తీసుకు పోయి, ఒక బంగారు ఆసనం మీద కూర్చోబెట్టి, అర్ఘ్యపాద్యాలిచ్చి సత్కరించారు.

కృష్ణుడు అందరినీ కూర్చోమని, తాను కూడా కూర్చుని, చేతులు జోడించి, "నువు క్షేమంగా ఉన్నావా, నారదా? లోకాలకూ, దేవతలకూ క్షేమమే కదా? లోకాలన్నీ స్వేచ్ఛగా సంచరించే నీకు తెలియని దేముంటుంది? ఒకటి మాత్రం నిజం, నీ రాకకు ఏదో ప్రయోజనం ఉంటుంది. మా యాదవ వంశానికి ఏదో మంచి చెయ్యటానికే నువు వచ్చి ఉండాలి. నీ రాకవల్ల మేము ధన్యులమైనా మనటానికి ఎలాటి సందేహమూ లేదు," అన్నాడు.

కృష్ణుడు చేసిన స్తోత్రపాఠాలకు ప్రీతుడై నారదుడు ఇలా అన్నాడు:



"నువు తలచుకున్నంత మాత్రాన సమస్త ప్రాణులకూ క్షేమం కలుగుతుంది గదా, అన్ని యుగాలలోనూ నీ పాద సేవలోనే మునిగితేలే నా బోటి వాళ్ళ క్షేమం వేరే అడగాలా?"

ఇలా అని నారదుడు తన వీణను శ్రుతి చేసి, కృష్ణుడి సంతోషం కోసరం అత్యంత మధురంగా వాయించాడు; మీనావతారం దగ్గిర నుంచీ రామావతారం వరకూ గల అవతార కథలను పాటలుగా పాడాడు; తరవాత కృష్ణుడి బాలక్రీడలూ, పరాక్రమాలూ, కాళియమర్దనమూ, గోవర్ధనోద్ధరణా, కంసవధా మొదలైనవి ప్రస్తు



తించుతూ చక్కని పాటలు పాడాడు. ఆయన పాటలు విన్న వాళ్ళందరూ తన్మయత్వంలో మునిగిపోయారు. నారదుడు ఆ పాటలలో కీర్తించిన కృష్ణుడు తమకు ఆత్మీయుడూ, నాయకుడూ అయినందుకు వాళ్ళు ఎంతో గర్వపడ్డారు. నారదుడు పాట చాలించి, వీణ పక్కన పెట్టెయ్యగానే, ఏ మేమి కబుర్లు చెబుతాడో వినాలని చాలా ఆతురతగా ఉన్నారు.

అప్పుడు కృష్ణుడు నారదుడి కేసి నవ్వుతూ చూసి, "బాబూ, ఒక్కటి కూడా బీరు పోనివ్వకుండా నేను చేసిన పనులన్నీ ఏకరు పెట్టావు, చాలు గాని నువ్విప్పుడు

వచ్చిన పని ఏమిటో చెబుతావా? నువు ఊరికే వచ్చేవాడివి కావు," అన్నాడు.

అందుకు నారదు డిలా చెప్ప నారంభించాడు:

"దక్షిణ సముద్రతీరాన గోకర్ణ మనే మహా పుణ్యక్షేత్రం ఉన్నది. అక్కడ శంకరుడు దివ్య లింగరూపంలో ఉంటాడు. ఆ దేవుడి ముందు వీణ వాయించి, సంకీర్తన చేసి, భక్తితో అర్చన చేసి, అక్కడి నుంచి కదిలి కుబేరుణ్ణి చూద్దామని బయలు దేరాను. దారిలో కుండిన పురాన్ని ఏలే భీష్మకుణ్ణి చూశాను. అతను కూడా నన్ను చాలా గౌరవించి, సంతోష పెట్టాడు. అయితే అక్కడ నాకు జరాసంధుడు మొదలుకుని భూమి మీద ఉండే రాజులందరూ కనపడ్డారు. వీరంతా ఇక్కడ ఏం చేస్తున్నారని భీష్మకుణ్ణి అడిగాను. అడిగితే, తన కుమార్తెను రుక్మిణిని చేది దేశపురాజైన శిశుపాలుడి కిచ్చి పెళ్ళి చేస్తూ అందరినీ ఆహ్వానించాననీ, రేపు ఉదయమే లగ్నమనీ చెప్పాడు. సరే, ఈ ముక్క నీ చెవిని వేసి పోదామని వచ్చాను."

నారదు డింకా ఇలా అన్నాడు:

"నీ మనసులో ఆ రుక్మిణిని నువు కోరుకున్నావు. ఆ భీష్మకుడేమో ఆ పిల్లను



నీ పగవాడి కిచ్చి పెళ్ళి చేయ సంకల్పించాడు. ఈ పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోతుంది. ఇలాగే జరిగినట్టయితే నీకు ఎంత అపకీర్తో చూడు. అందుచేత ఏం చేస్తావంటే, ఉగ్రసేన మహారాజును వెంట బెట్టుకుని, సాత్యకినీ, మిగిలిన యోధులనూ, సేనలనూ తీసుకుని ఈ పూటే బయలుదేరు. అక్కడికి వెళ్ళి, అక్కడ చేరిన రాజుల మూకలను చావబాది, సంతోషంగా ఆ పిల్లను తెచ్చుకో. నీ దగ్గర సుదర్శనచక్రం ఉండగా అసాధ్యమేమిటి? ఇంకో సంగతి చెబుతాను విను. నేను ఆకాశమార్గాన అదృశ్యంగా ఉండి, ఆ రుక్మిణి లీలోద్యానంలో తన చెలికత్తెల మధ్య కూర్చుని కంట తడి పెట్టుకుంటూ ఉండటం చూశాను. నిన్నే తలుచుకోవటమూ, నిన్ను గురించే మాట్లాడటమూ, నిన్ను చూడటం కోసం ఆరాటపడటమూ తప్ప ఆ పిల్లకు మరో ప్రపంచమే ఉన్నట్టు లేదు. పాపం, ఆ పిల్ల స్థితి వర్ణనాతీతంగా ఉన్నది. నున్నటి చెక్కిళ్ళు వడిలిపోయి, కన్నీరుతో తడిసి ఉన్నాయి. మెడలో ఒంటి పేట హారం తప్ప లేదు. పాపిట చెదిరిపోయింది. జుట్టంతా రేగి ఉన్నది. ఊపిరి విడిచినప్పుడల్లా ప్రాణం పోతుందేమో నన్నట్టుగా తోస్తున్నది. శరీరం కంపించిపోతున్నది. చెలికత్తెలు ఎన్ని శైత్యోపచారాలు చేసినా ఏమీ ఫలితం లేకుండా ఉన్నది. వాళ్ళు నీ పేరు తప్ప మరెవరి పేరెత్తినా చచ్చిపోతానని చెలికత్తెలతో అంటున్నది. నిజంగా ఆమెను చూస్తే ఎంత కటికవాడికి కూడా గుండె కరిగిపోతుంది. సహజ కరుణా స్వభావుడివైన నువు ఏ మాత్రమూ చూస్తూ ఊరుకోదగదు. పాపం, ఆ రుక్మిణి ప్రాణాలు ఎలాగైనా కాపాడు. కాపాడటం నీ వంటి వాడికి ధర్మం. ఇక నేను వెళ్ళివస్తాను."

ఈ మాట కాస్తా అని నారదుడు తన దారిన తాను వెళ్ళిపోయాడు.





# కృష్ణావతారం

రుక్మిణికి మర్నాడు జరగనున్న వివాహం గురించి చెప్పి నారదుడు వెళ్ళిపోగానే, కృష్ణుడు తన వారితో, "నారదమహాముని మన శ్రేయస్సు కోరి చెప్పిన మాటలు మీ రంతా విన్నారు కద! ఇంక అలస్యం దేనికి? పనికి ఉపక్రమించుదాం - వెంటనే బయలుదేరి కుండిన పురానికి పోదాం. మీ మీ వాహనాలనూ, సేనలనూ అయత్తం చేసుకోండి. బలగం బయలుదేరేటప్పుడు ముందు సాత్యకీ, మధ్యలో బలరాముడూ, చివరలో ఉగ్రసేన మహరాజూ ఉండేటట్టు చూడండి. నేను దారకుణ్ణి వెంట తీసుకుని, శమస్తమైన ఆయుధాలతో సహ ముందు వెళ్ళి, అ శిశుపాలుడూ, రుక్మి, జరాసంధుడూ మొదలైన వాళ్ళ సంగతి అంతు చూసి, రుక్మిణిని సంపాదించుకుంటాను," అన్నాడు.

ప్రయాణ దుందుభి మోగించారు. యాదవులందరూ ఆర్భాటంగా ప్రయాణ సన్నాహాలు చేశారు. కృష్ణుడు తృప్తిపడి, తనను తాను చక్కగా అలంకరించుకుని రథంలో బయలుదేరాడు.

అతను పెళ్ళికొడుకు లాగా, మహా వైభవంతో ప్రయాణం చేసి, విదర్భదేశం చేరి, కుండిన పురాన్ని చేరబోతూండగా, రుక్మిణి తండ్రి అయిన భీష్మకుడు ఎదురు వచ్చి, ఆదరించి, నగరం బయట ఉన్న విడిదికి తీసుకుపోయి, అతిథి మర్యాదలన్నీ చేశాడు.

పెళ్ళికి వచ్చిన రాజులందరూ కృష్ణుణ్ణి చూసి రకరకాలుగా మాట్లాడుకున్నారు.

17. రుక్మిణి అపహరణం





"శిశుపాలుడు కృష్ణుడికి మేనత్త కొడుకేగా? అతని పెళ్ళిగదా అని చూడ వచ్చి ఉంటాడు," అన్నారు కొందరు.

"అదంతా ఏమీ లేదులే. ఈ కృష్ణుడికి జరాసంధ శిశుపాలు లంటే ఏ మాత్రమూ పడదు. అటువంటి వాడు ఎందుకు వచ్చినట్టు?" అన్నారు మరి కొందరు.

"అన్నట్టు, ఆ రుక్మిణికి కృష్ణు డంటే చాలా ప్రేమ అని చెప్పుకున్నారే?" అన్నారు మరి కొందరు.

యాదవుల నందరినీ వెంట బెట్టుకుని కృష్ణుడు వచ్చాడని వినగానే రుక్మిణికి, వేసవి ఎండలకు తెగ కాలి ఉన్న భూమి మీద వర్షం పడినంతగా పరమానంద మయింది. "నన్ని కష్టాల నుంచి ఉద్ధరించటానికే కృష్ణుడు వచ్చాడు, అందుకు సందేహ మేమీ లేదు. నా జన్మ నిజంగా తరించింది, నా కోరిక ఈడేరింది. అతన్ని ఎప్పుడు కళ్ళ చూస్తానో!" అనుకున్నదామె.

ఆమె కృష్ణుణ్ణి గురించి రకరకాలుగా ఊహించుకో నారంభించింది; చెలికత్తెలతో అతని కథలు మళ్ళీ మళ్ళీ చెప్పించింది; ఆమెలో ముందుండిన దైన్యమంతా పోయి కొత్త కళ వచ్చింది.

కృష్ణుడు కూడా మిగిలిన విషయా లేవీ పట్టించుకోక రుక్మిణిని గురించిన ఆలోచనలలో మునిగిపోయాడు. ఆమెను తాను ఎలా చూస్తాడు? ఆమెను ఎలా అపహరిస్తాడు? తనకు అడ్డపడే శత్రువుల నందరినీ ఎలా ఎదుర్కొంటాడు? ఇంతకూ ఆమెకు తన మీద మనస్సున్నదని విన్న మాట నిజమో కాదో ఎలా తెలుసుకోవటం?

"ఏమైనా కానీ, ఆమె నా కేసి అపేక్షగా చూసిందో, దేవతలు అడ్డపడేదిగాక, ఆమెను తప్పక సంపాదిస్తాను," అనుకున్నాడతను.

తెల్లవారింది. తేనెటీగలు పద్మాల మీదికి ముసిరాయి. చక్రవాకాలకు గుడ్డి తనం పోయింది. హంసలు కొలనుల్లో విహరించ







సాగాయి. కలువలు ముడుచుకు పోయాయి. సూర్యోదయమయింది. కృష్ణుడు కాల కృత్యాలు తీర్చుకుని, చక్కగా అలంక రించుకుని, తన పరివారాన్ని వెంట బెట్టు కుని, విడిది నుంచి రథం మీద బయలు దేరాడు. రుక్మిణిని చూడాలన్న కోరిక అతన్ని తీవ్రంగా ఆవేశించింది.

రాజసౌధంలో రుక్మిణిని చెలికత్తెలు చక్కగా అలంకరించి ముస్తాబు చేశారు. అలంకరణ పూర్తి కాగానే ఆమె ఒక బంగారు పల్లకీలో ఎక్కి, చెలికత్తెలు వెంట రాగా, నగరం వెలపల ఉండే గౌరీదేవిని అర్చించి రావటానికి బయలుదేరింది. ఆమె ఆలయం దగ్గిర పల్లకి దిగి, లోపలికి చెలి కత్తెల మధ్య నడిచి వెళ్ళి, దేవికి మొక్కి, "తల్లీ, నాకు కృష్ణుడే భర్త అయేటట్టు అనుగ్రహించు," అని ప్రార్థించింది.

రుక్మిణి గౌరీఆలయం నుంచి బయటికి వచ్చే సమయానికి కృష్ణుడు అక్కడికి వచ్చి, మొట్ట మొదటిసారిగా ఆమెను చూశాడు. ఆమె అప్పుడే పాలసముద్రం నుంచి పైకి వచ్చిన లక్ష్మిలాగా అతనికి కన బడింది. బ్రహ్మసృష్టిలో అంతటి సౌందర్య వతి మూడు లోకాలలో చూసినా ఉంటుం దని అతనికి తోచలేదు. ఆమెను గురించి విన్నదానితో కలిగిన ఉద్రేకాన్ని ఎలాగో భరించాడు గాని, ఆమెను కళ్ళ ఎదట చూస్తూ ప్రేమోద్వేగాన్ని నిగ్రహించు కోవటం అతనికి సాధ్యంగా కనబడలేదు.

రుక్మిణిని తన దాన్ని చేసుకోవటానికి తగిన చోటూ, సమయమూ దైవికంగా అత నికి కలిసి వచ్చాయి. ఇలాంటి అవకాశాన్ని పోగొట్టు కోవటం అవివేకం అని అతను తనలో అనుకున్నాడు.

ఇదే సమయంలో రుక్మిణి కూడా కృష్ణుణ్ణి మొదటిసారిగా చూసింది. అతనే కృష్ణుడని చెలికత్తెలామెకు చెప్పారు. ఆమె అతని కేసి ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసింది.





ఇంతకాలమూ తాను విడవకుండా ధ్యానం చేస్తున్నవాడు అకస్మాత్తుగా తన కళ్ళ ముందు కనిపించేసరికి ఆమెకు ఆశ్చర్యమూ, కంపమూ, ఆనందమూ ఒకే సారిగా కలిగాయి. ఆమె కళ్ళు చల్లగా చెమ్మగిల్లాయి. సమాధిస్థితి లోకి వెళ్ళి పోయిన యోగిలాగా ఆమె తనను తానే మరచి పోయింది. ఆమె అలా అయిపోవటం చూసి చెలికత్తెలు భయపడ్డారు.

ఇంతలో బలరాముడు వచ్చి కృష్ణుణ్ణి కలుసుకున్నాడు. కృష్ణుడు తాను చేయదలచిన పనిని గురించి తన అన్నకు సంగ్రహంగా చెప్పి, రుక్మిణిని అమాంతంగా



కౌగలించుకుని, ఎత్తి తెచ్చి తన రథం మీద పెట్టాడు. రుక్మిణి చెలికత్తెలు కంగారు పడ్డారు. సమీపంలో ఉండే భటులు కృష్ణుడి మీదికి రాసాగారు. బలరాముడు చెట్టొకటి పీకి, మీదికి వచ్చే రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ, సైనికులనూ చావమోది, చెల్లా చెదరు చేశాడు.

ఈ ఆర్భాటం విని, ఉగ్రసేనుడూ, సాత్యకీ, శతద్యుమ్నుడూ, విదూరథుడూ, ప్రసేనజిత్తు మొదలైన యదువృష్ణి భోజాంధక వీరులు తమ తమ బలాలతో వచ్చి బలరాముడికి అండగా నిలబడి, కృష్ణుడితో, "నువ్వా పిల్లను తీసుకుని ద్వారకకు వెళ్ళి పో. ఇక్కడ ఉండే వాళ్ళందరి సంగతీ మేము చూసుకుంటాం," అన్నారు.

వీరంతా యుద్ధానికి సిద్ధపడుతూ ఉంటే, రుక్మిణి అంగరక్షకులైన భటులలో చావగా మిగిలిన వాళ్ళు వెళ్ళి, రుక్మిణి అపహరణం గురించి భీష్మకుడికీ, జరాసంధుడికీ, శిశుపాలుడికీ, వారి వెంట వచ్చిన రాజులకూ తెలిపారు. అందరూ ఈ వార్త విని ఆశ్చర్యపడుతూ, "ఇంతమంది మహాయోధు లిక్కడ ఉండగా కృష్ణు డింత పని చేశాడే! వాడి కెంత పొగరు, ఎంత సాహసం, ఎంత ధైర్యం!" అనుకున్నారు.







జరాసంధుడు కోపంతో దహించుకు పోతూ, కళ్ళ నిప్పులు రాల్చుతూ, "ఒక గొల్లవాడి కొడుకు మహా జగదేక వీరుడల్లే వచ్చి నా ప్రయత్నమంతా పాడు చేశాడు. నేను నా సేనతో సహా బయలుదేరి వెళ్ళి వాడి మీద దాడి చెయ్యబోతున్నాను. ఇష్ట మైతే మీరు కూడా సహాయం రండి," అని మిగిలిన వారితో అన్నాడు. సముద్రమే కోటగా గల ద్వారకలో ప్రవేశించినా సరే, కృష్ణుణ్ణీ అతడి బంధువుల నందరినీ హత మార్చి, ద్వారకను ధ్వంసం చేసి, రుక్మిణిని తెస్తానని ఆ జరాసంధుడు ప్రతిజ్ఞ చేశాడు.

పౌండ్రక వాసుదేవుడు జరాసంధుణ్ణి వారిస్తూ, "నీ భృత్యుణ్ణి నే నుండగా నీ కెందుకు శ్రమ? నేను వెళ్ళి, ఆ కృష్ణుణ్ణి ముక్కలు ముక్కలుగా నరికి, అడవి పక్షు లకు ఆహారంగా వేస్తాను. భూమి మీద ఇద్దరు వాసుదేవు లెలా ఉంటారు? ఈ పొర పాటు సరి చెయ్యటానికీ, నీకు ఆనందం చేకూర్చటానికీ గొప్ప అవకాశం నాకు దొరి కింది. ఇంకేం కావాలి?" అన్నాడు.

అంతలోనే శిశుపాలు డొక పెద్ద పరిఘ చేత-బట్టి నిలబడి, అందరూ వినేటట్టుగా, "ఆగండి! ఎవరూ కదలవద్దు! ఈ అవ మానం నాది. పెళ్ళి చేసుకుందామని ఉబలాటంతో వచ్చి చివర కిలా భంగపాటు పొందిన వాణ్ణి నేను. ఈ ఒక్క పరిఘతోనే ఆ కృష్ణుణ్ణీ, మిగిలిన యాదవులనూ రూపు మాపి, జరాసంధుడి భృత్యుడుగా గొప్ప కీర్తి సంపాదించుకుంటాను. నిజంగా క్షత్రియుడైనవాడు మరొకడి భార్య కోసం ఇలా ఆశపడతాడా? ఈ యాదవ గోత్రి కుడు చాలా హీనుడై ఇలా చేశాడు. వాడు పెరిగినది వావీవరసాలేని పశువుల మధ్య. అందుచేత, కృష్ణుణ్ణి చంపి రుక్మిణిని తీసుకు రావటం నా పని," అన్నాడు

తరవాత జరాసంధుడు మొదలైన రాజు లందరూ, కవచాలు ధరించి, రథా లెక్కి,



యుద్ధసన్నద్ధులయారు. అదే విధంగా సేనలన్నీ భేరీలూ, శంఖాలూ మొదలైన వాద్యాలు మోగించుకుంటూ అట్టహాసంగా బయలుదేరాయి. త్వరలోనే వారు, రథం మీద రుక్మిణిని ఉంచుకుని పోతున్న కృష్ణుణ్ణీ, అతని వెనకగా పోతున్న యాదవ సేనలనూ చేర వచ్చారు.

బలరాముడు మొదలైన యాదవ వీరులు తమ సేనలను ఆపి, జరాసంధుడి బలాలతో యుద్ధం ప్రారంభించారు. యాదవ సేన చిన్నది, జరాసంధుడి సేనలు పెద్దవి. అయినా జరాసంధుడి సేనలోనే హెచ్చుగా రక్తపాతం జరిగింది. ఉభయ పక్షాల



వీరులూ ద్వంద్వ యుద్ధాలు చేశారు. సాత్యకీ, జరాసంధుడూ మహా దారుణమైన యుద్ధం చేశారు. శక్రదేవుడూ, అక్రూరుడూ కలిసి దంతవక్త్రుడితో యుద్ధం చేశారు. శిశుపాలుడు ముగ్గురు యాదవ వీరులతో ఒకేసారి పోరాడాడు. కృతవర్మకూ పౌండ్రక వాసుదేవుడికీ యుద్ధం జరిగింది.

అందరికన్న బలరాముడు మహా భయంకరంగా శత్రునాశనం చేశాడు. అవతలి పక్షాన జరాసంధుడు కూడా చాలా దారుణంగా యుద్ధం చేశాడు. చివరకు బలరాముడే అతన్ని గదా యుద్ధంలో మూర్ఛపోగొట్టాడు. వెంటనే జరాసంధుణ్ణి అతని సారథి రథం మీద పెట్టుకుని, దూరంగా తీసుకుపోయాడు. అది చూసి సేనలు పలాయనం సాగించాయి. ఆ పారిపోయే వాళ్లను సాత్యకి మరింత తరిమాడు. సాత్యకి శంఖం పూరించటం విని కృష్ణుడు, జరాసంధుడు పారిపోయినట్టు గ్రహించి, తన పాంచజన్యాన్ని ఊదాడు.

కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకుపోతున్నాడన్న వార్త విని జరాసంధుడు మొదలైన రాజులు తమ విడిది నుంచి సైన్యాలతో సహా బయలుదేరే సమయంలోనే, రాజభవనంలో ఉన్న రుక్మి కూడా ఆ వార్త





విని, మండిపడి, యుద్ధంలో కృష్ణుణ్ణి చంపి, రుక్మిణిని తీసుకురాకుండా తిరిగి నగరంలో అడుగు పెట్టనని తన తండ్రి ఎదటా, బంధువుల ఎదటా శపథం చేసి, గదుడూ, కైశికుడూ మొదలైన యోధులనూ, సేనలనూ వెంటబెట్టుకుని, యుద్ధసన్నద్ధుడై బయలుదేరాడు. అతనితో బాటు దక్షిణ దేశాల రాజులు కూడా ఉన్నారు.

వారికి కృష్ణుడి రథం నర్మదా తీరం వెంబడి ఒంటరిగా నడుస్తూ అంత దూరాన కనిపించింది. రుక్మి మిగిలిన వారందరినీ వెనకనే వదిలేసి, అతి వేగంగా తన రథాన్ని తోలించి, కృష్ణుడి రథానికి ఎదురు వెళ్ళి, "ఎక్కడికి 'పోతావురా, గొల్లవాడి కొడకా! ఇతరుడి భార్యను అపహరించే వాడా! నేను రుక్మిని! విదర్భరాజు కొడుకును! ప్రాణాలు దక్కించుకో దలిస్తే రుక్మిణిని తక్షణం వదిలెయ్యి, లేదా నాతో యుద్ధం చెయ్యి," అంటూ కృష్ణుడి పైన బాణవర్షం కురిపించాడు. కృష్ణుడు క్షణంలో అతని సారథిని చంపి, అతని శరీరం నిండా బాణాలు గుచ్చాడు.

రుక్మి దుస్థితి చూసి దక్షిణదేశపు రాజులు తమ మిత్రుణ్ణి కమ్ముకుని కృష్ణుడితో యుద్ధానికి పూనుకున్నారు. కృష్ణుడికీ, వారికీ మధ్య తీవ్రమైన యుద్ధం జరిగింది. కొంత సేపటికి రుక్మి తిరిగి బలం తెచ్చుకుని, మరొక రథం మీద వచ్చి, కృష్ణుడిపై తల పడ్డాడు. కృష్ణుడు అతని రొమ్ములో దిగే లాగు మూడుబాణాలు కొట్టి, రుక్మిని మూర్ఛపోగొట్టాడు. నేల మీద స్పృహ తప్పి పడిపోయిన అన్నను చూసి రుక్మిణి కృష్ణుడి రథం మీద కూలబడిపోయి, దుఃఖించసాగింది.

కృష్ణుడు రుక్మిణిని కౌగలించుకుని, ఓదార్చి, రుక్మిని ఏమీ చేయనని అభయ మిచ్చి, రథాన్ని తిరిగి వెనక్కు తిప్పించి, తన నగరానికి బయలుదేరాడు.





# కృష్ణావతారం

యాదవులు జరాసంధుడు మొదలుగాగల రాజుల సేనలను ఓడించి, విజయోత్సాహంతో సింహనాదాలు చేస్తూ, విజయ దుందుభులు మోగిస్తూ, బలరాముణ్ణీ, సాత్యకినీ ముందుంచుకుని ద్వారకకు తిరిగిపోయారు.

కృష్ణుడు రుక్మిణిని తీసుకుని వెళ్ళిపోగానే శ్రుతపర్వుడు రుక్మిని తన రథం మీద కూర్చో బెట్టుకుని బయలుదేరాడు. అయితే రుక్మి, తన చెల్లెలైన రుక్మిణిని తీసుకు రాకుండా కుండినపురం ప్రవేశించనని ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు; ఆ ప్రతిజ్ఞ విఫలం అయింది గనక, అతను భోజకటక మనే నగరం నిర్మించి, అందులోనే ఉండిపోయాడు.

జరాసంధుడు మూర్ఛ తెలియగానే, చెల్లాచెదరైన తన సేనలను తిరిగి ఏకం చేసుకుని, పూర్తిగా నవ్వుల పాలైపోయిన శిశుపాలుణ్ణి వెంట బెట్టుకుని తన దేశానికి వెళ్ళిపోయాడు.

యాదవవృద్ధులు కృష్ణుడి వివాహానికి ముహూర్తం నిశ్చయించి, బంధుకోటికీ, ఇతర రాజులకూ ఆహ్వానాలు పంపారు. రాచనగరుకు పెళ్ళిముస్తాబు జరిగింది. మణులు కూర్చిన గోడలను కుంకంపువ్వుతో తుడిచి ధగధగా మెరిసేటట్టు చేశారు. బంగారు స్తంభాలకు కట్టిన గుడ్డలు ఊడదీసి, వాటి పైనున్న చెక్కడపు పనితనం అందరికీ కనపడేలాగు చేశారు. గచ్చునేలల మీద కస్తూరి నీరు పోసి రుద్ది మెరుగు

18. శంబరాసుర వధ





లకూ చెందిన ప్రముఖులు నానా దేశాల నుంచి పెళ్ళికి తరలి వచ్చారు. వచ్చిన వారందరికీ సాత్యకి తగిన సత్కారాలు జరిపి, వసతులు ఏర్పాటు చేశాడు.

పెళ్ళిరోజు వచ్చింది. బ్రాహ్మణుల వేదాధ్యయనమూ, రాజులకు వంది మాగధులు చేసే కైవారాలూ, స్త్రీలు తిరుగాడుతూంటే వారి ఆభరణాల ధ్వనీ, ఏనుగుల ఘీంకారాలూ, గుర్రాల సకిలింపులూ, పెళ్ళి బాజాలూ, ఆకాశాన దేవదుందుభులూ, అన్నీ కలిసి చాలా సందడిగా ఉన్నది.

నాలుగు బంగారు స్తంభాలతో కళ్యాణ మండపం కట్టి, మాణిక్యాలతోనూ, పువ్వులతోనూ అలంకరించి, రంగవల్లులు చిత్ర విచిత్రంగా రచించి, అందులో మణిమయమయిన వేదిక మీద కృష్ణుడు కూర్చున్నాడు. అతని చుట్టూ ఉగ్రసేనుడూ, వసుదేవుడూ, బలరాముడూ, యదువృద్ధులూ, మునులూ కూర్చున్నారు. పురోహితుడు అగ్నిముఖం చేసి వేల్చుతున్నాడు.

ముహూర్తం వచ్చింది. సౌకుమార్యానికీ, సౌందర్యానికీ, సౌభాగ్యానికీ, సౌశీల్యానికీ ప్రతిరూపంగా కనిపించే రుక్మిణిని కృష్ణుడు పాణిగ్రహణం చేశాడు. అతని మీద ముత్తయిదువులు అక్షతలనూ, ఆకాశం

పెట్టారు. రకరకాల ముత్యాల ముగ్గులు చక్కగా అలంకరించారు. అంతటా పోక మానులూ, అరటిచెట్లూ అమర్చి, లేత రావి ఆకులతోనూ, మామిడాకులతోనూ తోరణాలు గట్టి, చీనాంబరాలతో తయారు చేసిన ధ్వజా లెత్తారు.

కృష్ణుడి పెళ్ళికి అతని బంధువులూ, అనేకమంది రాజులూ తమ తమ వైభవాలు ఉట్టిపడేలాగా, రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ వెంట బెట్టుకుని ఎంతో స్నేహ భావంతో వచ్చారు. కృష్ణుణ్ణి చూసి తమ తపస్సులు ఫలింప జేసుకుందామని మునులు వచ్చారు. ఇంకా, నాలుగు వర్ణా







నుంచి దేవతా స్త్రీలు పుష్పాలనూ ఒకేసారి చల్లారు. బ్రాహ్మణులు ఆశీర్వచనం చేశారు. కృష్ణుడు తన తల్లిదండ్రులకూ, పెద్దలకూ నమస్కారం చేసి, వారి దీవనలు పొందాడు. తరవాత అతను అసంఖ్యాకులైన బ్రాహ్మణులకు ఎనిమిదివేల రథాలూ, పదకొండు వేల అయిదువందల ఏనుగులూ, అంతులేని గుర్రాలూ, ఆవులూ దానం చేసి, నగలనూ, బంగారాన్నీ, వెండినీ, దాసదాసీలనూ కానుకలుగా ఇచ్చి, సూతులూ, మాగధులూ, నర్తకులూ, వంది వైతాళికులూ మొదలైన వారికి అంతులేని బహుమానా లిచ్చి, అందరికీ భోజనాలు పెట్టి సంతృప్తులను చేశాడు.

పెళ్ళిరోజులు సుఖంగా వెళ్ళిపోయాయి. పెళ్ళికి వచ్చినవారు కృష్ణుడికి కట్నాలు చదివించి, అతని చదివింపులు అందుకుని, వెళ్ళిపోయారు.

కృష్ణుడు రుక్మిణితో దాంపత్య సౌఖ్యంలో ఓలలాడుతూనే, మిత్రవిందా, జాంబవతీ, సత్యభామా, కాళిందీ, సుదంతా అనే వారిని కూడా పెళ్లాడాడు.

కొద్ది కాలానికే కృష్ణుడి అగ్ర భార్య అయిన రుక్మిణి గర్భవతి అయింది. కృష్ణుడు తన హోదాకు తగినట్టుగా ఆమెకు పుంసవనమూ, సీమంతమూ మొదలైన వేడుకలు జరిపాడు. కాలక్రమాన రుక్మిణి ఒక మగ శిశువును ప్రసవించింది. పూర్వం శివుడి మూడో కంటి మంటకు భస్మమైన మన్మథుడే రుక్మిణి కడుపున జన్మించాడు. అతనికి ప్రద్యుమ్ను డని పేరు పెట్టుకున్నారు.

రుక్మిణి కడుపున పుట్టే ఈ బిడ్డ వల్ల తనకు చావున్నదని ముందే తెలిసి శంబరుడనే రాక్షసుడు, ఏడు రోజుల బాలింత పక్కలో పడుకుని ఉన్న ప్రద్యుమ్నుణ్ణి అర్ధ రాత్రి వేళ అపహరించి తీసుకు పోయి సముద్రంలో పారేశాడు. ఆ బిడ్డను ఒక పెద్ద చేప మింగింది. ఆ చేపను ఒక జాలరి వలలో పట్టి, అంత పెద్ద చేపను పట్టి





నందుకు సంతోషించి, దాన్ని తమ రాణి అయిన మాయావతికి కానుకగా ఇచ్చాడు. ఈ జాలరి ఇక్షుమతీ పురంలో ఉండే వాడే. ఆ ఇక్షుమతీ పురాన్నే శంబరుడు పాలిస్తున్నాడు. మాయాపతి శంబరుడి భార్య.

మాయాపతి జాలరి ఇచ్చిన చేపను తానే స్వయంగా తరిగి, అందులో అందమైన పిల్లవాడుండటం చూసి ఎంతో ముచ్చటపడి, వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసింది. తనకు పిల్లలు లేని కారణం చేత శంబరుడు కూడా ఆ పిల్లవాణ్ణి చూసి మురిశాడు.

మాయావతి పెంపకంలో పెరిగిన ప్రద్యుమ్నుడు రాక్షస మాయలన్నీ తెలుసుకున్నాడు; సకల విద్యలూ నేర్చుకుంటూ పెరిగి పెద్దవాడయాడు. చివరకు అతను ఎంత అందంగానూ, ఆకర్షణీయంగానూ తయారయాడంటే, పసితనం నుంచీ అతన్ని పెంచిన మాయావతికే అతని పైన మోహం పుట్టుకొచ్చి, తన కోరిక అతనితో చెప్పింది. అతను బుద్ధిమంతుడు కనక మాయాపతితో, "నువు తల్లివి, నేను కొడుకును. నా పైన నీ కిలాటి భావం ఎలా కలిగింది? దీని కేదన్నా కారణం ఉంటే చెప్పు," అన్నాడు.

దానికి మాయావతి, "నీ తండ్రి యాదవ వంశోద్ధారకుడైన కృష్ణుడు. నీ తల్లి రుక్మిణి





ప్రద్యుమ్నుడు శంబరుడి పైన ఏడు మాయలు ప్రయోగించి, విఫలుడై, చివరకు ఎనిమిదవ మాయతో చంపేశాడు.

తరవాత అతను మాయావతిని వెంట బెట్టుకుని మాయా ప్రభావంతో ఆకాశ మార్గాన ప్రయాణం చేసి, కృష్ణుడి అంతః పురంలో దిగాడు. అకస్మాత్తుగా తమ మధ్య దిగిన ప్రద్యుమ్నుణ్ణి చూసి కృష్ణుడి భార్య లందరూ భయపడ్డారు. అతని అంద చందాలు చూసి సంతోషం కూడా పొందారు. రుక్మిణి ఆ యువకుణ్ణి చూసి, తనకు పుట్టిన బిడ్డ బతికి ఉంటే ఈ పాటికి ఇంతవాడై ఉండే వాడు కదా అనుకున్నది. చూస్తున్న కొద్దీ ఈ కుర్రవాడిలో కృష్ణుడి లక్షణాలు కనిపించి, ఒకవేళ తన కొడుకే బతికి ఉండి ఇలా వచ్చాడేమో అన్న అనుమానం కూడా కలిగింది. కృష్ణుడు కూడా ఆ కుర్ర వాణ్ణి ముఖమంతా కళ్ళు చేసుకుని చూస్తూ, ఆనందించ సాగాడు.

ఇంతలో నారదుడు అక్కడికి వచ్చి కృష్ణుడితో ప్రద్యుమ్నుడి కథ అంతా చెప్పాడు. అంతా స్పష్టమైపోయింది. ప్రద్యు మ్నుడు రుక్మిణి కొడుకే. మాయావతి కూడా పూర్వజన్మలో మన్మథుడి భార్య అయిన రతీదేవి. తిరిగి మళ్ళీ అతనికి భార్య

దేవి. పురిటిలోనే నిన్ను శంబరుడు సము ద్రంలో పారేస్తే, దైవికంగా నువ్విక్కడికి చేరావు. నేను నిన్ను ఇంతకాలమూ రక్షిం చాను. నీ కోసం నీ తల్లి ఇంతకాలమూ బెంగపడి ఉన్నది. నువు వెళ్ళి ఆమె కళ్ళ ఎదట పడు. నేను నీ అందం చూసి ప్రేమిం చాను. నన్ను నిరాకరించకు. శంబరుణ్ణి నేను మాయా మోహితుణ్ణి చేసి అతని భార్యగా నటిస్తూ వచ్చాను. అతను విరోధి. అతన్ని చంపెయ్యి," అన్నది.

మాయావతి ఇలా చెప్పేసరికి ప్రద్యు మ్నుడు శంబరుణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో







అయింది. మన్మధుడు పోయాక ఆమె శంబరుడికి చిక్కి, మాయారూపం ధరించి శంబరుణ్ణి మభ్యపెడుతూ, తన పాతి వ్రత్యాన్ని కాపాడుకున్నది.

తన కొడుకు తనకు మళ్ళీ దక్కినందుకు రుక్మిణి పరమానందం చెందింది. కృష్ణుడి భార్యలందరూ ఎంతో సంతోషించి, అంతఃపురంలో ఎన్నో విందులూ, వేడుకలూ చేసుకున్నారు.

రుక్మిణి తొలి కాన్పుకు ప్రద్యుమ్నుణ్ణి కనటమే గాక, వరసగా తొమ్మిదిమంది కొడుకులను కని, చిట్టచివర ఒక కూతుర్ని కూడా కన్నది. ప్రద్యుమ్నుడి అనంతరం రుక్మిణి కన్న తొమ్మిదిమంది కొడుకుల పేర్లు చారుదేష్ణుడూ, సుదేష్ణుడూ, సుషేణుడూ, చారుగుప్తుడూ, చారువాహనుడూ, చారువిందుడూ, చారుభద్రుడూ, చారుగర్భుడూ, చారుడూ; కడగొట్టు పిల్ల పేరు చారుమతి. కృష్ణుడికి ఇతర భార్యలయందు భానుడూ, భానువిందుడూ, సంగ్రామజిత్తూ, దీప్తిమంతుడూ, వృకుడూ మొదలుగాగల అనేకమంది కొడుకులూ, మిత్రవతి మొదలైన అనేకమంది కూతుళ్ళూ కలిగారు.

ప్రద్యుమ్నుణ్ణి రుక్మిణి కన్న నెల లోపునే జాంబవతి సాంబుడనే కొడుకును కన్నది. అతను ప్రసిద్ధుడు. పసితనంలోనే బలరాముడు అతన్ని చేరదీసి, తన కొడుకులాగా పెంచాడు, అతనికి యుద్ధవిద్యలన్నీ నేర్పాడు. బలరాముడికి రేవతి యందు నిశాతుడూ, ఉల్ముకుడూ అనే కొడుకులు కలిగారు. ఈ విధంగా బలరామకృష్ణులు పెద్ద బలగాన్ని కని, ఎంతో సుఖంగా జీవిస్తూ వచ్చారు.

విదర్భదేశంలో రుక్మిణి అన్న అయిన రుక్మికి శుభాంగి అని ఒక కూతురున్నది. ఆ శుభాంగి యుక్త వయస్కురాలయింది. ఆ పిల్లకు తగిన వరుణ్ణి సంపాదించటం కోసం రుక్మి స్వయంవరం ఏర్పాటు చేసి,



భూమి మీద ఉండే రాజులందరికీ ఆహ్వానాలు పంపాడు. ఆ స్వయంవరానికి ఎందరెందరు రాజులో వెళ్ళారు; తన తల్లిదండ్రుల అనుమతి పొంది ప్రద్యుమ్నుడు కూడా సపరివారంగా బయలుదేరి వెళ్ళాడు. స్వయంవరం యథావిధిగా జరిగింది. శుభాంగి అదివరకే ప్రద్యుమ్నుడి అందచందాలను గురించి విని, అతన్ని వరించటానికి నిశ్చయించుకుని ఉండటం చేత అతని మెడలోనే వరమాల వేసింది. స్వయంవరానికి వచ్చిన ఇతర రాజులందరూ ఆమె నిర్ణయాన్ని మెచ్చుకుని, వధూవరులు ఒకరి కొకరు తగి ఉన్నారని శ్లాఘించారు.

ప్రద్యుమ్నుడు శుభాంగిని పెళ్ళాడి ఇంటికి తిరిగి వచ్చాడు. కొంతకాలానికి ఆ దంపతులకు అనిరుద్ధుడు పుట్టాడు. అనిరుద్ధుడు పెరిగి పెద్దవాడవుతూ సమస్త శాస్త్రాలూ, శస్త్రాస్త్ర విద్యలూ నేర్చి యుక్త వయస్కుడయాడు. అతనికి పెళ్ళి యీడు వచ్చింది.

రుక్మికి రుక్మవతి అనే మనమరాలు, కొడుకు కుమార్తె, ఉన్నది. ఆ పిల్లను అనిరుద్ధుడికి అడగమని కృష్ణుడు సూచించగా ప్రద్యుమ్నుడు దూత ద్వారా రుక్మికి కబురు పంపాడు.

రుక్మి కూడా, పాత పగలు మరచి, సరేనన్నాడు. పెళ్ళి నిశ్చయమయింది. పెళ్ళికి బలరామకృష్ణులూ, ప్రద్యుమ్నుడు మొదలైన కుమారులూ, అనిరుద్ధుడూ, రుక్మిణీ, అనేకమంది యాదవ ముఖ్యులూ తరలి వెళ్ళారు. వివాహం వైభవంగా జరిగింది.

అందరూ మహోల్లాసంగా ఉన్న సమయంలో వేణుధారీ, శ్రుతపర్వుడూ, అంశుమంతుడూ, జయత్సేనుడూ మొదలైన దాక్షిణాత్యులు తమ మిత్రుడైన రుక్మితో, "నువు జూదంలో నేర్పరివి గద. బలరాముణ్ణి కదిలించి చూడు. అతను కాస్త వ్యసనపరుడు. అతన్ని ఓడించి మనం ప్రతిష్ఠ సంపాదింతాం," అని బోధించారు.





# కృష్ణావతారం

తన దక్షిణాది మిత్రులు చెప్పిన సలహా తలకెక్కి, రుక్మి, చక్కగా అలంకరించి ఉన్న సభాభవనంలో జూదం ఆడటానికి ఒక బంగారు పలకా, పావులూ, పాచికలూ ఏర్పాటు చేయించి, సరదాగా జూదం ఆడదాం రమ్మని బలరాముడికి కబురు పంపాడు. ద్యూతప్రియుడైన బలరాముడు వెంటనే ఉత్సాహంతో వచ్చాడు.

బలరాముడితో రుక్మి ఆడితేనే బాగుంటుందని దాక్షిణాత్యులు అన్నారు. పందెం కాయటానికి ముత్యాలూ, మణులూ, బంగారమూ కుప్పలు పోశారు. జూదం ఆరంభమయింది. పదివేల బంగారు మాడలు పందెంకాచి బలరాముడు ఓడిపోయాడు. మళ్ళీ అంతే పందెంకాచి మళ్ళీ ఓడాడు. అదే విధంగా ప్రతిసారీ బలరాముడే ఓడుతూ వచ్చాడు.

చిట్టచివరకు బలరాముడు కోటి బంగారు మాడలు పందెంకాచి గెలిచాడు. కాని రుక్మి గెలుపు తనదేనని గట్టిగా కేకపెట్టాడు. "బలరాముడికి పందెం వెయ్యటమే చేత కాదు. నేను కోటి బంగారం గెలుచుకున్నాను, చూసుకోండి," అన్నాడతను

అతని మిత్రుడైన కళింగరాజు, "నిజమే! అంతే!" అంటూ పళ్ళన్నీ బయటపెట్టి నవ్వాడు. బలరాముడికి కోపం వచ్చింది. కాని అతను తనను తాను నిగ్రహించుకుని, అక్కడ చేరినవాళ్ళతో, "పందెం నేను గెలిస్తే, ఇతను తాను గెలిచానంటాడేమిటి? మీరు నిజం చెప్పండి," అన్నాడు.

**19. నరకుడి విజృంభణ**





అందరూ తలలు వంచుకున్నారు. ఒక్కరూ జవాబు చెప్పలేదు.

రుక్మి బలరాముడితో, "నేను గెలిచానన టానికి సందేహమేమీ లేదే! ఎందుకిలా కక్కుర్తిపడి అబద్ధాలాడుతున్నావు?" అన్నాడు. అంత పచ్చి అబద్ధానికి ఏమి సమాధానం చెప్పాలో బలరాముడికి అర్థం కాలేదు. ఇంతలో ఆకాశవాణి, "బల రాముడి మాటే నిజం. రుక్మి అబద్ధ మాడాడు. మీరంతా మొద్దులల్లే చూస్తూ ఊరుకుంటారేం?" అని పలికింది.

అప్పటికీ ఎవరూ మాట్లాడలేదు. బల రాముడు ఇక నిగ్రహించుకోలేక ఆవేశంతో రుక్మిని ఒక్క గుద్దుతో హతమార్చి, జూదపు పలక తీసుకుని కాళింగుడి తల పగిలేటట్టు కొట్టాడు. మిగిలిన రాజులు తన పైకి వస్తే, కత్తి దూసి ఊచకోత కోశాడు. అలా కొందరు చావగా, మిగిలినవాళ్ళు బెదిరి పారిపోయారు.

బలరాము డిలా భీభత్సం చేసి, తన బసకు వెళ్ళి, కృష్ణుడితో జరిగిన సంగతి చెప్పాడు. కృష్ణుడు జరిగినదాన్ని గురించి ఆక్షేపించలేదు, హర్షించనూలేదు. కాని మిగిలిన యాదవులు బలరాముణ్ణి తెగ మెచ్చుకుని, అతనికి చాలా తృప్తి కలిగించారు.

ఆ తరవాత అందరూ వధూవరులను వెంటబెట్టుకుని ద్వారకకు తిరిగి వచ్చేశారు.

బలరాముడు సాటిలేని బల పరాక్రమాలూ, శక్తి సామర్థ్యాలూ కలవాడు. పది వేల ఏనుగుల బలం కలవాడని ఖ్యాతి పొందిన భీముడు బలరాముడి వద్దనే శిక్షణ పొందాడు. ఇద్దరికీ యుద్ధం జరిగే పక్షంలో భీముడు గెలుస్తాడన్న నమ్మకం కూడా ఉండేదికాదు.

ఒకసారి కృష్ణుడి కొడుకైన సాంబుడు, దుర్యోధనుడి కుమార్తె అయిన లక్షణను మోహించి, ఆమెను తీసుకుని పారిపో





సాగాడు. అప్పుడు కౌరవులు సాంబుణ్ణి తరిమి పట్టుకుని, హస్తినాపురానికి తెచ్చి, చెరలో ఉంచారు. అది తెలిసి బలరాముడు ఉగ్రుడై హస్తినాపురానికి వచ్చి సాంబుణ్ణి విడిచిపుచ్చుమని మర్యాదగా అడిగాడు. అందుకు కౌరవులు ఒప్పుకోలేదు.

అప్పుడు బలరాముడు హస్తినాపురాన్ని జనంతోనూ, ఇళ్ళతోనూ సహా గంగలోకి తోస్తానని ప్రతిజ్ఞచేసి, ప్రాకారం కింద తన నాగలి వేసి ఎత్త నారంభించాడు.

దుర్యోధనుడు మొదలైన వాళ్ళంతా బెదిరిపోయి, సాంబుణ్ణి తెచ్చి బలరాముడికి అప్పగించి, శాంతింపచేశారు. అప్పుడే దుర్యోధనుడు బలరాముడికి తాను శిష్యుడుగా ఉంటానని చెప్పి, గురుపూజ చేశాడు. బలరాముడి మూలాన హస్తినాపురం శాశ్వతంగా ఒక పక్క పైకి లేచి, రెండోవైపు ఏటవాలుగా ఉండిపోయింది. దుర్యోధనుడు బలరాముడి శిష్యుడుగా గదాయుద్ధంలో సాటిలేని కీర్తి సంపాదించాడు.

ఇది ఇలా ఉండగా రాక్షస ప్రపంచంలో నరకు డనేవాడు ప్రచండుడుగా పైకి వచ్చాడు. అతని రాజధాని ప్రాగ్జ్యోతిష పురం. అతను భూదేవి కొడుకు. బ్రహ్మచేత వరాలు పొందినవాడు. ఏ దేవతలకూ ఓడే



వాడు కాడు. అన్ని లోకాలనూ తన బల పరాక్రమాలతో అదలగొట్టసాగాడు.

నరకుడు ముందుగానే ఇంద్రుడి నగరానికి తన రాక్షససేనతో సహా వెళ్ళి, నగర ద్వారాలను తన పిడికిలి పోట్లతో పగలగొట్టి, సింహనాదం చేసి, యుద్ధానికి రమ్మని ఇంద్రుణ్ణి పిలిచాడు. ఇంద్రుడు వచ్చాడు. వజ్రాయుధం చేతబట్టి, ఐరావతాన్ని ఎక్కి వచ్చిన ఇంద్రుణ్ణి ఏమాత్రమూ లక్ష్యపెట్టక, నరకుడు అతనితో యుద్ధానికి తలపడ్డాడు. ఇంద్రుడికి తోడుగా యమ, వరుణ, కుబేరులు తమ సైన్యాలను తెచ్చి, యుద్ధంలో పాల్గొన్నారు.



నరకుడికి కూడా ముగ్గురు రాక్షస నాయకులు, హయగ్రీవుడూ, నికుంభుడూ, మురుడూ అనేవాళ్ళు, తోడుగా ఉన్నారు. వారిలో హయగ్రీవుడితో వరుణుడు యుద్ధం చేసి, తల పగిలి, నెత్తురు కక్కుకూ, మూర్ఛపోయి, స్పృహ తెలియగానే పారిపోయాడు. వరుణుడితోనే అతని సేన కూడా పోయింది. అలాగే నికుంభుడి చేతిలో యముడూ, మురాసురుడి చేతిలో కుబేరుడూ చావు దెబ్బలు తిని, సైన్యాలతో సహా పారిపోయారు. చివరకు నరకుడి దెబ్బకు తట్టుకోలేక ఇంద్రుడు కూడా పారిపోయాడు. నరకుడు అమరావతీ నగరం



ప్రవేశించి, తన విజయాన్ని దేవలోకమంతటా చాటింపు చేయించాడు.

తరవాత నరకుడు ఇంద్రుడి సింహాసనం అధిష్ఠించి, ఊర్వశిని పిలిపించి, "దిక్పాలకులందరినీ ఓడించాను. సమస్త దేవతలకూ ఇక నేనే రాజును. అందుచేత ఇక నుంచీ నన్ను నువ్వు సుఖపెట్టు," అన్నాడు.

దానికి ఊర్వశి, "అలాగా? అయితే మునులందరూ యజ్ఞాలలో నిన్నే పూజించినట్టయితే నేను విధిగా నీకు ఉంపుడుగత్తెగా ఉంటాను," అన్నది. నరకుడు సరేనన్నాడు. అతను అమరావతిని కొల్లగొట్టి, సుమేరు పర్వతంలోని రత్నరాసులన్నీ తవ్వించి, ఎనిమిదివేల దేవకన్యలను చెరపట్టి, విశ్వకర్మ కూతురిని కూడా తీసుకుని, రత్నాలు పొదిగిన అదితి కుండలాలు సంగ్రహించి, తన నగరానికి తిరిగి వచ్చాడు.

నరకుడి ఆజ్ఞపొంది అతని అనుచరులైన రాక్షసులు పధ్నాలుగు లోకాలలోనూ, ఎక్కడ ఏ విలువగల వస్తువున్నా, దాన్ని తెచ్చి అతనికి ఇస్తూ వచ్చారు. వాళ్ళు పోయిన చోటనల్లా పీడన కలిగిస్తూ, అప్సరస్త్రీల నందరినీ తెచ్చారు, పదహారువేల ఒక వంద గంధర్వ కన్యకలనూ, అనేక లక్షల యక్ష స్త్రీలనూ, అసంఖ్యాకులైన కిన్నర,





సిద్ధ, సాధ్య, విద్యాధర స్త్రీలనూ చెర పట్టి తెచ్చారు.

ప్రాగ్జ్యోతిష నగరాన్ని నాలుగు వక్కలా నలుగురు మహాయోధులు—మురుడూ, హయగ్రీవుడూ, నిశుంభుడూ, పంచ జనుడూ రక్షించేవారు. మురాసురుడికి వేల సంఖ్యలో కొడుకులుండేవారు. వాళ్ళ మూలాన నరకుడి నగరం ఎలాటి వారికీ చొరరానిదిగా ఉండేది.

నరకుడికి భూలోకమంతా వశపరచుకో వాలనిపించింది. అతను అంతటా తిరుగుతూ యజ్ఞాలు ధ్వంసం చేశాడు, బ్రాహ్మణులను చంపాడు, మునులను హింసించాడు, రాజు లందరినీ రకరకాలుగా పీడించాడు, ధర్మ నాశనాన్నే తన ఆశయంగా పెట్టుకున్నాడు.

ఒకసారి నరకుడు బదరీవనానికి వెళ్ళే సరికి అక్కడ అనేకమంది ఋషులు యజ్ఞ కార్యంలో మునిగి ఉన్నారు. అప్పుడు నరకుడికి ఊర్వశి అన్న మాట జ్ఞాపకం వచ్చింది. అతను వాళ్ళను, "ఎవరిని తలపెట్టి ఈ యజ్ఞం చేస్తున్నారు?" అని అడిగారు.

"వేదాలు చెప్పిన విధంగా ఇంద్రుణ్ణి గురించి యజ్ఞం చేస్తున్నాం," అని వాళ్ళు జవాబు చెప్పారు.

ఈ మాటకు నరకుడు అలిగి, "మీ ఇంద్రుణ్ణి వరుణ యమ కుబేర సహితంగా నేను యుద్ధంలో ఓడించాను. అతని రాజ్య మంతా గెలుచుకున్నాను. విశ్వాని కంతకూ నేనే ఏలికను. అందుచేత నన్నే కొలవండి, నాకే మొక్కండి. నన్ను సంతృప్తిపరచి నట్టయితే నేను మీ కోరికలు తీర్చు తాను," అన్నాడు.

దానికా ఋషులు, "ఈ మాట ఎంత మాత్రమూ సబబుగాలేదు. లోకాలను పాలించవలసినవాడు ఇంద్రుడు. నువ్వు దుష్ట రాక్షసుడివి. నిన్ను మే మెలా కొలుస్తాం?" అన్నారు.



నరకుడు ఈ మాటకు మండిపడి తన బంట్లతో, "ఈ బ్రాహ్మణులు మదమెక్కి కారుకూతలు కూస్తున్నారు. వీళ్ళ యజ్ఞం ధ్వంసం చెయ్యండి," అన్నాడు. వెంటనే రాక్షసులు అగ్నికుండాలు పూడ్చి, పశువులను నాశనం చేసి, హోతలనూ, ఉద్గాతలనూ, వేదజ్ఞులనూ చావగొట్టి, స్రుక్స్రువాలను అవతల పారేసి, అరణులు కాల్చి, హవిస్సులు తినేసి, అన్నపు రాసులు చిమ్మేసి, సోమరసాన్ని బూడిదపాలు చేసి, ఋషిపత్నులను చెరిచి, వాళ్ళ కన్యలను చెరపట్టి, నానా బీభత్సమూ చేశారు. తరవాత నరకుడు తిరిగి వెళ్ళిపోయాడు.



ఆ తరవాత వసిష్ఠుడూ, వామదేవుడూ, కపిలుడూ, కశ్యపుడూ, కణ్వుడూ, జాబాలీ, ధౌమ్యుడూ, భరద్వాజుడూ, మంకణుడూ మొదలైన మహాఋషులందరూ కూర్చుని, తమ యజ్ఞం ఇలా ఎందుకు విఘ్నమయిందో, పతివ్రతలయిన తమ స్త్రీలు ఇలా ఎందుకు దోషానికి గురి అయారో అని విచారించారు. అటువంటి దుర్మార్గుడి నుంచి తమను కాపాడేవాడు ఎవడో ఒకడు లేకపోతే ఇక బ్రతుకే ఉండదు. అవతారపురుషుడైన కృష్ణుడి వల్లనే తమకు గతి ఏర్పడాలని వారు నిశ్చయించుకుని, అందరూ కలిసి ద్వారకకు బయలుదేరారు.

వారు దక్షిణాభిముఖులై ప్రయాణంచేసి, దారిలో తగిలిన తీర్థాలలో స్నానాలు చేస్తూ, భాగీరథిని చేరి, అందులో కూడా స్నానం చేసి, ప్రాయశ్చిత్తాలు చేసుకుని, నిత్య ప్రయాణాలు చేస్తూ, స్వర్గాన్ని మించిన వైభవంతో తులతూగే ద్వారకానగరాన్ని చేరుకున్నారు.

ఆ నగరంయొక్క ఐశ్వర్యానికి ఆశ్చర్యపడుతూ వాళ్ళు రాజమార్గం వెంట రాచనగరు చేరుకుని, బదరీవనం నుంచి మహర్షులు వచ్చారని కృష్ణుడికి కబురు పంపారు.





కృష్ణుడు వారి రాక గురించి వినగానే ప్రద్యుమ్నుణ్ణి పిలిచి, ఋషులకు స్వాగతం చెప్పి తీసుకురమ్మని పంపాడు. ప్రద్యుమ్నుడు బయటికి వచ్చి, ఆదరంతో ఋషులకు స్వాగతం చెప్పి, వారిని కృష్ణుడు కొలువుదీరి ఉన్న చోటికి, తీసుకువెళ్ళాడు.

సభాభవనంలో యాదవులందరూ తనను కొలిచి ఉండగా, కృష్ణుడు ఉన్నతాసనం మీద కూర్చున్నాడు. మునులు అతన్ని చూసి, "మన కోరికలన్నీ తీర్చి రక్షించటానికి అతను ఉండగా, మనం ఇన్నాళ్ళూ ఆ రాక్షసుడి చేత ఎందుకని అంతగా అవమానాలు పొందినట్టు? ప్రారబ్ధ మంటే ఇలాగే ఉంటుందిగదా! పోనీ ఇప్పటికైనా ఈ మహాత్ముడి దర్శనం చేసుకున్నాం. తపస్సు, తపస్సు అంటూ అడవుల్లో అలమటించే మనకు ఆ రాక్షసుడి మూలంగా ఈ లాభం ఒకటి కలిగింది," అని తమలో అనుకుంటూ కృష్ణుణ్ణి సమీపించారు.

కృష్ణుడు గబగబా తన ఆసనం నుంచి దిగి వచ్చి, మునులకు నమస్కారం చేసి, వారికి ఆసనాలూ, అర్ఘ్యపాద్యాలూ, మధుపర్కాలూ ఇచ్చి సత్కరించి, వారి అనుమతి పొంది, తిరిగి తన ఆసనం మీద కూర్చున్నాడు. అతని తరవాత మిగిలిన యాదవప్రముఖులంతా మునులకు నమస్కారాలు చేసి తమతమ ఆసనాలలో తిరిగి కూర్చున్నారు.

అప్పుడు కృష్ణుడు చేతులు జోడించుకుని మునులతో, "మీ క్రతువులు నిర్విఘ్నంగా సాగుతున్నాయా? మీ వ్రతాలూ, తపస్సులూ యథావిధిగా జరుగుతున్నాయి గదా? మీరంతా ఇలా దయచేయటానికి కారణమేమిటి? నా మీదగల అనుగ్రహం కొద్దీ, నన్ను కృతార్థుణ్ణి చేయటానికే మీరిలా వచ్చి ఉంటారు. నాకు మీ రందరూ ఏదైనా పని చెప్పినట్టయితే, ఆ పని చెయ్యటానికి మేమంతా సంసిద్ధంగా ఉన్నాం," అన్నాడు.





# కృష్ణావతారం

కృష్ణుడు తమతో కుశల ప్రశ్నలు చేశాక మునులు చాలా సంతోషించి, తాము తెచ్చిన బదరీఫలాలను అతనికి కానుకగా ఇచ్చి, "మేము పెద్ద పని మీదే నీ వద్దకు వచ్చాం. భూదేవి కొడుకైన నరకుడు రాక్షస నాయకుడు. వాడిది ఉద్దండ పరాక్రమం. వాడు సముద్రాలు ఇంకించ గలడు, భూమిని చలింపజేయగలడు, కొండలను అణగదొక్కగలడు. వాడు లోకాలన్నిటినీ గగ్గోలు పరుస్తున్నాడు. ఒకసారి బదరీవనానికి వచ్చి, యజ్ఞకార్యంలో నియుక్తులమై ఉన్న మమ్మల్ని చూసి, దేవతలను గురించి యజ్ఞం చెయ్యవద్దనీ, తనను గురించి చెయ్యమనీ అడిగాడు. అందుకు మేము ఒప్పుకోక పోయేసరికి, వాడు అలిగి, తన అనుచరుల చేత మా అగ్నులు ఆర్పించి, మా వస్తువులన్నీ ధ్వంసం చేసి, మా స్త్రీలను చెరపట్టి తీసుకు పోయాడు. మా కర్మకాండకు భగ్నం కలగటమే గాక, మా మర్యాద మంట గలిసింది. మాకు తీరని దుఃఖమూ, భయమూ పట్టుకున్నాయి. మమ్మల్ని నువే కాపాడాలి," అన్నారు.

మునులు అన్న మాటలకు కృష్ణుడికి ఆశ్చర్యమూ, నరకుడి పైన ఆగ్రహమూ కూడా కలిగింది. కాని అతను ఏ మాటా అనకుండా కొంతసేపు నిశ్చలంగా ఉండి పోయి, ఆలోచనలో పడ్డాడు. అది చూసి మునులు భయపడ్డారు, అనుమానపడ్డారు, ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

**20. నరకాసుర వధ**





చెప్పి అతని వద్ద సెలవు పుచ్చుకుని, బదరికాశ్రమానికి తిరుగు ప్రయాణం సాగించారు.

మునులు వెళ్ళిపోయిన అనంతరం ద్వారకకు దేవేంద్రుడు, మిగిలిన దిక్పాలకులతో సహా దిగి వచ్చాడు. కృష్ణుడు వారికి ఎదురు వచ్చి స్వాగతం చెప్పాడు. ఇంద్రుడు యాదవ ముఖ్యుల నందరినీ అలింగనం చేసుకుని, వారిపై తనకు గల అభిమానాన్ని ప్రకటించాడు. తరవాత సుధర్మ సభాభవనంలో అందరూ సభ చేశారు.

ఇంద్రుడు కృష్ణుడి చేతిని తన చేతిలోకి తీసుకుని, "నేను నిన్ను చూడటానికి ఇలా బయలుదేరి వచ్చిన కారణం చెబుతాను విను. నరకు డనే దైత్య నాయకుడు బ్రహ్మ చేత వరాలు పొంది, విజృంభించి దేవతలను యుద్ధంలో చిత్తుగా ఓడించాడు. వాడి ధాటికి తట్టుకోలేక, ఇళ్ళూ వాకిళ్ళూ వదిలేసి, మనుష్య లోకానికి పారిపోయి వచ్చాం. మా ఇళ్ళలో ప్రవేశించి వాడు మా సంపద లన్నిటినీ కొల్లగొట్టాడు. మా పాట్లు ఏమని చెప్పను? ఎవరికీ సాధ్యం గాని అదితిదేవి కుండలాలను కూడా వాడు కాజేశాడు. మునుల ఆశ్రమాల నన్నిటినీ వాడు భీభత్సం చేశాడు. జగద్రక్షణకు

అప్పుడు సాత్యకి మొదలైన యాదవ ప్రముఖులు కూడా కృష్ణుణ్ణి హెచ్చరించారు. కృష్ణుడు మునుల కేసి తిరిగి, "మీరు మరొక విధంగా అనుకోకండి. ఆ రాక్షసుడి చర్యలు విన్న కోపంలో నా మనసు క్షోభపడింది. నేను నిశ్చయంగా ఆ రాక్షసుణ్ణి నిర్మూలిస్తాను. మీ కేమీ భయం లేదు. మీరు వెళ్ళి మీ నిత్య కృత్యాలు కొనసాగించండి," అంటూ వారికి అభయం ఇచ్చాడు.

కృష్ణు డిచ్చిన మాటతో మునుల ముఖాలు వికసించాయి. వాళ్ళు కృష్ణుణ్ణి రకరకాల అభినందించి, వెళ్ళివస్తామని





కంకణం కట్టుకుని నువు అనేకమంది రాక్షసులను చంపినట్టు విని వాడు నిన్ను ఓడించాలని మహా తహతహలాడుతూ ఉన్నాడు. కనక నువు వెళ్ళి వాడి అంతు తేల్చటం మంచిది. అందువల్ల లోకాలకు ఎంతో మేలు కలుగుతుంది. ఇడుగో గరుత్మంతుడు, నీకు వాహనం కావడానికి నాతో కూడా వచ్చాడు," అంటూ గరుత్మంతుణ్ణి చూపాడు.

ఇలా అన్న దేవేంద్రుడితో కృష్ణుడు, "ఈ విషయాలన్నీ మునుల వల్ల ఇంతకు ముందే విన్నాను. నీ రాకతో నా నిశ్చయం మరింత దృఢమయింది. ఇప్పుడే బయలుదేరి ప్రాగ్జ్యోతిష పురానికి పోదాం," అంటూ ఆసనం మీది నుంచి దిగి, యాదవ ప్రముఖులకు వీడ్కోలు చెప్పి, తన చక్రాయుధం మొదలైన ఆయుధాలు తీసుకుని, సత్యభామకు కబురు పంపి, ఆమెతో సహా గరుడవాహనం ఎక్కాడు. పెద్దలు దీవించారు, వందిమాగధులు స్తోత్ర పాఠాలు చదివారు. ఇంద్రుడు ముందు దారి తీస్తూంటే కృష్ణుడు వెనకగా బయలుదేరాడు. కొంత దూరం నేలమార్గాన వెళ్ళాక, ఇంద్రుడూ, కృష్ణుడూ కూడా ఆకాశ మార్గాన ప్రయాణం సాగించారు.



కృష్ణుడికి ఆకాశం నుంచి ప్రాగ్జ్యోతిష పురం కనిపించింది. అది ఎవరికీ ప్రవేశించ సాధ్యం కానిది. దాని సైనికరక్షణలు ఎలా ఉన్నదీ కృష్ణుడు తెలుసుకున్నాడు. నరకుడి మందిరాన్ని రక్షించే రాక్షసవీరులను చూశాడు. కృష్ణుడు ఇంద్రుడికి వీడ్కోలు చెప్పి, ముందుకు వెళ్ళి, ఆ రాక్షసులను తాకి, అనేకమందిని చెండాడాడు.

మురాసురుడు కృష్ణుడితో తలపడి భయంకరమైన యుద్ధం సాగించాడు. కృష్ణుడు ఒక అస్త్రంతో మురాసురుడి తల తెగవేశాడు. తరవాత నిసుందుడనేవాడు యుద్ధం ప్రారంభించి, సత్యభామ చేతిని







గాయపరిచి, రక్తం కారేటట్టు చేశాడు. కృష్ణుడు మండిపడి, బాణాలతో వాడి చేతులూ, తలా నరికేశాడు. హయగ్రీవుడూ, అఘోరపాలుడూ, విరూపాక్షుడూ, ప్రావఋుడూ, పంచజనుడూ మొదలుగా గల రాక్షస వీరులు ఎనభైనాలుగు వేలమంది కృష్ణుడి చేతిలో చచ్చారు.

నగరద్వారాన్ని రక్షించే రాక్షసు లందరినీ చంపి కృష్ణుడు ఆ ద్వారాన్ని సమీపిస్తూండగా రాక్షస సేనలు అతనిపై వచ్చి పడ్డాయి. కృష్ణుడు ఆ రాక్షస మూకను అవలీలగా చించిచెండాడాడు. ఇంతలో నరకుడే యుద్ధసన్నద్ధుడై వచ్చాడు. అతను, ఒంటరిగా యుద్ధానికి వచ్చిన కృష్ణుణ్ణి చూసి, "నన్ను నరకు డంటారు. ఇంద్రుణ్ణీ, ఇతర దేవతలనూ జయించి, మూడులోకాలనూ సంక్షోభింప జేసినవాణ్ణి. నా దగ్గర ఎంతలేసి వీరుల పరాక్రమాలూ ఎందుకూ పనికిరావు. నువ్వు ఎవరివి? ఎందుకు వచ్చా విక్కడికి? ఈ పెద్ద పక్షి ఎక్కడిది? ఈ ఆడమనిషి ఎవరు? కొంచెం స్పష్టంగా చెప్పు. విన్నిప్పుడే చంపి, ఈ స్త్రీని వశపరుచుకుంటాను. పారిపోక పోరాడు," అన్నాడు.

కృష్ణు డీ మాటలకు నవ్వి, "నేను కూడా మూడు లోకాలలోనూ ప్రసిద్ధికన్నవాణ్ణే. నన్ను గురించి నువు విన్నావో, లేదో తెలీదు. నా పేరు వాసుదేవుడు. ఈమె పేరు సత్యభామ, నా భార్య. ఈ పక్షి పక్షిజాతికి రాజైన గరుత్మంతుడు, నా వాహనం. నే నిక్కడి కెందుకు వచ్చానంటే, నిన్ను చంపి లోకకల్యాణం కలిగించటానికి వచ్చాను," అన్నాడు.

నరకుడు చిరునవ్వు నవ్వి, "నీవేనా వాసుదేవుడివి? నీతో యుద్ధం ఎప్పుడు వస్తుందా అని ఉబలాట పడుతున్నాను. నీ శక్తి కొద్దీ యుద్ధం చెయ్యి. నాకు దొరికి ప్రాణాలతో తప్పించుకు పోలేవులే," అంటూ కృష్ణుడితో యుద్ధం ప్రారంభిం





చాడు. వారికి జరిగిన యుద్ధం రామరావణ యుద్ధంలాగా వర్ణించ శక్యంకానిది, మహా దారుణమైనది. ఈ యుద్ధంలో కృష్ణుడు తీవ్రంగా గాయపడి మూర్ఛపోయాడు.

అది చూసి సత్యభామ కంగారుపడక, కృష్ణుడి నుదుట గుచ్చుకున్న బాణాన్ని తీసి, రక్తస్రావం కాకుండా గాయాన్ని నొక్కిపెట్టి, కృష్ణుడికి ఉపచారాలు చేసింది. గరుత్మంతుడు తన రెక్కల గాలితో కృష్ణుడికి సేద తీర్చాడు. కృష్ణుడు స్పృహవచ్చి సత్యభామ కేసి చూస్తూ, "నేను అలిసిపోయినాను. కాస్సేపు నువు యుద్ధం చెయ్యి," అన్నాడు. సత్యభామ అతని విల్లూ, అమ్ములపొదులూ తీసుకున్నది.



ఆమె తన పైన ఒక్కసారిగా బాణవర్షం కురిపించేసరికి నరకుడు, "ఈ కృష్ణుడు తాను యుద్ధం చెయ్యటం మాని, నన్ను జయించటానికి ఆడదాన్ని నియోగిస్తాడా? ఛీ, ఛీ!" అనుకుని, సత్యభామ పైన తీవ్రమైన బాణాలు ప్రయోగించాడు. అవి సత్యభామ రొమ్ములలోనూ, చేతులలోనూ, పక్కలలోనూ గుచ్చుకున్నాయి. ఆమె వాటిని లక్ష్యపెట్టక, అత్యంత రోషావేశంతో నరకుడి ధ్వజం విరగగొట్టి, రథాశ్వాలను చంపి, సారథిని చంపింది. నరకుడు బాణం ఎత్తినప్పుడల్లా దాన్ని విరగగొట్టింది. ఇలా మూడు బాణాలు విరిగిపోయేసరికి నరకుడు గద ఒకటి తీసుకుని, బలంగా ఆమె మీద విసిరాడు. దాన్ని సత్యభామ మధ్యలోనే నలుసులకింద కొట్టేసింది. ఇదేవిధంగా ఆమె నరకుడు విసిరిన ప్రతి ఆయుధాన్నీ నుగ్గు చేసేసింది.

సత్యభామ చేసే అద్భుత యుద్ధానికి కృష్ణుడు తృప్తిపడి, ఆమెను కౌగలించుకుని, నుదుటి మీది చెమట తుడిచి, "అలసిపోయావు. ఇక యుద్ధం చాలించు," అని ఆమెను ప్రశంసించి తన మెడలో ఉన్న రత్నాల హారాన్ని ఆమె మెడలో వేశాడు.







ఆ హారాన్ని సంపాదించాలని రుక్మిణీ, సత్యభామా కూడా కోరుకున్నారు. ఇంతవరకు ఇద్దరికీ అది లభించలేదు. అటువంటి హారం ఇప్పుడు సత్యభామకు లభించింది.

కృష్ణుడు సత్యభామ చేతి నుంచి విల్లు తీసుకుని తిరిగి యుద్ధానికి ఉపక్రమించాడు. ఈ లోపల నరకుడు మరొక రథం ఎక్కి, శరపరంపరలను కృష్ణుడి పైనా, సత్యభామ పైనా, గరుత్మంతుడి పైనా విసిరాడు. కృష్ణుడు అతని కొత్త రథాన్నీ, గుర్రాలనూ, సారథినీ వరసగా ధ్వంసం చేశాడు. అప్పుడు నరకుడు క్రోధావేశంతో గద తీసుకుని, నేల పైకి దిగి, కృష్ణుడి రొమ్ముకు గురిచేసి విసిరాడు. కృష్ణుడు అవలీలగా దాన్ని ఖండించాడు. నరకుడు కృష్ణుడి పైన ఎన్నో ఆయుధాలూ, చివరకు చెట్లూ, రాళ్ళూ కూడా విసిరాడు, కాని ప్రయోజనం లేకపోయింది.

చిట్టచివరకు కృష్ణుడు నరకుడి పైన తన సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. అది నరకుణ్ణి నిలువునా రెండుగా చీల్చి పారేసింది. నరకుడి చావుతో భూమికి గొప్ప బెడద తీరిపోయింది. భూదేవి మానవాకారంతో వచ్చి, నరకుడి శవాన్ని కౌగలించుకుని, అతని చెవులకు గల దివ్య మణికుండలాలు తీసి, కృష్ణుడి వద్దకు వచ్చి, ఏడుస్తూ, చేతులు మోడ్చి, "నువే నా కీ కొడుకును ఇచ్చావు, నువే వాణ్ణి లోక కంటకుడని భావించి చంపేశావు. ఇక దేవతలూ, ఋషులూ సుఖంగా ఉండనీ. ఇవి ఇంద్రుణ్ణి జయించి తెచ్చిన రత్నకుండలాలు. వీటిని తీసుకో. వీడి కొడుకును కాపాడి, వీడి రాజ్యం వాడికియ్యి," అన్నది.

కృష్ణుడు సరేనన్నాడు. భూదేవి అంతర్ధానమయింది. కృష్ణుడు నరకుడి కళేబరానికి అంత్యక్రియలు జరిపించి, అతని కొడుకైన భగదత్తుడికి రాజ్యాభిషేకం చేయించాడు.





నగరంలోపల అంతులేని నిధులున్నాయి. అవి దిక్పాలకులను జయించి, నరకుడు తెచ్చుకున్నవి. నరకుడి కింది అధికారులు వాటి నన్నిటినీ కృష్ణుడి పరం చేశారు.

మణిశైలం వద్ద పదహారువేల నూరు మంది దేవతాస్త్రీలు నరకుడి చేత చెర పట్టబడి తెచ్చి ఉంచబడ్డారు. కృష్ణుడు సపరివారంగా అక్కడికి వెళ్ళాడు. ఆ స్త్రీలు కృష్ణుణ్ణి చూసి, "మేము నరకుడి చేత చెర పట్టబడిన దేవ స్త్రీలం. ఒకసారి నారదుడు మా దుఃఖం చూసి, చింతించ వద్దనీ విష్ణుమూర్తి మానవావతారుడై వచ్చి, నరకుణ్ణి చంపి, మాకు భర్త అవుతాడనీ చెప్పాడు. మేము ఆ ఆశతోనే ఇంతకాలమూ మా కష్టాలను ఓర్చాం. ఇప్పుడు మేము ధన్యత్వం పొందాం," అన్నారు.

కృష్ణుడు వారి కోరికను మన్నించి, వారిని స్నేహంతో చూసి, వారి కోసం పల్లకీలు తెమ్మని రాక్షసకింకరులను నియోగించాడు. తరవాత కృష్ణుడు మణిశైల మంతా తిరిగి, దాని శిఖరం ఒకటి చెట్లతోనూ, పక్షులతోనూ సహా విరిచి, గరుత్మంతుడి పైన పెట్టాడు. గరుత్మంతుడు కూడా దాన్ని తేలికగా మోశాడు. కొండశిఖరంతో బాటు కృష్ణుడు కూడా ఎక్కి, ఇంద్రుడి నగరానికి ప్రయాణమై వెళ్ళాడు. అక్కడ శచీదేవీ, ఇంద్రుడూ ఉన్నారు. శచీదేవీ, సత్యభామా కౌగలించుకున్నారు. కృష్ణుడు ఇంద్రుడికి నమస్కారం చేసి, తాను తెచ్చిన కుండలాలు అతనికి ఇచ్చాడు. కృష్ణుడు నరకుణ్ణి చంపినందుకు శచి సత్యభామను ప్రశంసించింది.

"నీ కిష్టమైన దేదైనా ఇవ్వాలని ఉన్నది. ఏమిటి నీ కోరిక?" అని శచీదేవి సత్యభామను అడిగింది.

"నా కే కొరతా లేదు. నీ స్నేహం తప్ప నా కింకేమీ అక్కర్లేదు," అన్నది సత్యభామ.





# కృష్ణావతారం

ఇంద్రుడూ, కృష్ణుడూ ఇష్టాగోష్ఠి ముగించి, శచీదేవినీ, సత్యభామనూ వెంటబెట్టుకుని అదితిని చూడబోయారు. వారందరూ అదితికి ప్రణామాలాచరించారు. అప్పుడు ఇంద్రుడు ఆమెకు ఆమె కుండలాలు ఇచ్చేస్తూ, కృష్ణుడు నరకుడిపై చూపిన పరాక్రమాన్ని విపరంగా వర్ణించి చెప్పాడు.

అదితి కృష్ణుడికి అనేక వేల దీవన లిచ్చి, "నాయనా, సాటిలేని నీ భుజబలంతో నా కష్టా లన్నిటినీ గట్టెక్కించావు. నీది అపూర్వమైన జన్మ. ఇంద్రుడి లాగే నువు కూడా దేవతలకు అండగా ఉండు. భూమి మీద నిన్నెవ్వరూ జయించలేక పోదురుగాక. స్త్రీలలో ఈ సత్యభామకు ఎవరూ ఈడు రారని ప్రసిద్ధి. నీ కీ మానవావతారం ఎంత కాలమైతే ఉంటుందో అంత కాలమూ సత్యభామకు యవ్వనం నిలిచి ఉండు గాక," అని దీవించింది.

తరవాత కృష్ణుడు అదితి వద్దా, ఇంద్రుడి వద్దా సెలవు పుచ్చుకుని, గరుడవాహన మెక్కి, సత్యభామా సమేతుడై నందనవనం మొదలుగా గల దేవోద్యానాలకు వెళ్ళి, అక్కడ విహారాలు చేశాడు. అక్కడ కల్ప వృక్షా లున్నాయి. వాటి పూల మీద తుమ్మెదలు ముసురుతున్నాయి. వాటి కొమ్మలను ఉయ్యాలలు చేసుకుని దేవకన్యలు ఊగుతున్నారు. లోకాలన్నీ తిరిగి వచ్చిన సిద్ధ మిథునాలు వాటి నీడన విశ్రాంతి తీసుకుంటున్నారు. అలాటి కల్పవృక్షాల మధ్య కృష్ణుడు పారిజాతాన్ని చూశాడు. అది దేవ

21. పారిజాతాపహరణం



తలకు మహాపవిత్రమైనది. శచీదేవికి దాని మీద చాలా ప్రీతి. దాని కీర్తి మూడులోకాలలోనూ ప్రసిద్ధమైనది. దానికి సమీపంగా వెళ్ళిన వారికి జాతిస్మరణ కలుగుతుంది.

సత్యభామకు పారిజాత సౌరభం సోకగానే తాను దేవతాస్త్రీలలో అగ్రగణ్యురాలనన్న భావం కలిగింది. ఆమె అమితమైన ఆనందం పొందుతూ, ఆ చెట్టు తనకు కావాలని కృష్ణుణ్ణి వేడుకున్నది.

కృష్ణుడు వెంటనే పారిజాతాన్ని వేళ్ళతో సహా పెల్లగించి గరుత్మంతుడి వీపు మీద పెట్టి, బయలుదేరాడు. అప్పుడు దేవవనాలను కాపాడేవాళ్ళు అడ్డపడి, అతనితో యుద్ధం ప్రారంభించారు. కృష్ణుడు తన బాణాలతో అవలీలగా వాళ్ళను చెండాడాడు. ఈ సంగతి ఇంద్రుడికి తెలిసింది.

కృష్ణుడు మూడులోకాలకూ రక్షకుడని తెలుసు, అతను పారిజాతం తీసుకుపోవటానికి అభ్యంతరం కూడా లేదు; అయినా ఇంద్రుడు తనను తాను నిగ్రహించుకోలేక, దేవగణాలతో బయలుదేరి కృష్ణుడికి అడ్డం వెళ్ళి, అతని పై వజ్రాయుధం విసిరాడు. కృష్ణుడు దాన్ని దారిలోనే ఆపేశాడు. ఇంద్రుడి ఆటకట్టింది. కృష్ణుడు జీవించి ఉన్నంత కాలమూ పారిజాతం భూలోకంలో ఉండటానికి సమ్మతించి, ఇంద్రుడు తిరిగి వెళ్ళాడు. కృష్ణుడు కూడా ద్వారకకు బయలుదేరాడు.

గరుత్మంతుడు పారిజాతంతో సహా సత్యభామా కృష్ణులను కృష్ణుడి మేడ పైభాగాన దింపాడు. కృష్ణుడు పాంచజన్యం పూరించి, తన రాక తనవారి కందరికీ తెలియబరిచాడు. అందరూ సంభ్రమంతో అతని వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చారు. కృష్ణుడు పెద్దలకు నమస్కరించి, చిన్నవాళ్ళను కౌగలించుకుని, పలకరించాడు.

ప్రద్యుమ్నుడు వచ్చి పారిజాతాన్ని అంతఃపురంలో చేర్చాడు. దాని సమీపానికి వెళ్లిన

వారందరికీ ఆశ్చర్యంగా పూర్వజన్మజ్ఞానం కలిగింది. దాని మహత్తు చూసి అందరూ ఆశ్చర్యపోయారు. తరవాత దాన్ని తీసుకు పోయి తగిన ప్రదేశంలో నాటారు.

నరకుడు చెరలో ఉంచి, పల్లకీలలో ద్వారకకు చేరిన స్త్రీలందరినీ కృష్ణుడు తానే వివాహమాడాడు.

తరవాత కృష్ణుడు గరుత్మంతుణ్ణి తగిన విధంగా సన్మానించి, ఆతను దేవలోకానికి తిరిగి వెళ్ళటానికి అనుమతి ఇచ్చాడు. ఎప్పుడు తలచుకున్నా రాగలనని మాట ఇచ్చి గరుత్మంతుడు వెళ్ళిపోయాడు.



అనంతరం కృష్ణుడు సభచేసి, నరకుణ్ణి చంపి తాను సంపాదించిన వస్తువులను ఉగ్రసేనుడికీ, ఆయన భార్యకూ, తది తరులకూ పంచి, మిగిలినది ఖజానాలో పెట్టించాడు.

సత్యభామ రోజూ పారిజాత పుష్పాలతో తనను తాను అలంకరించుకుని, తన సవతులకు కూడా పంచిపెట్టుతున్నది. తన వనంలో పారిజాతం లేకుండా పోయిందని ఇంద్రుడు మాత్రం దీనంగా శచీదేవి కేసి చూస్తూ ఉండేవాడు.

ఒకసారి దుర్యోధనుడు హస్తినాపురంలో ఒక యజ్ఞం చేసి అనేకమంది రాజులను ఆహ్వానించాడు. యజ్ఞం పరిసమాప్త మయింది. ఆ యజ్ఞానికి వచ్చిన రాజులు కృష్ణుడి విభవాన్ని గురించి ఎంతగానో విని ఉన్నవాళ్ళు కావటంచేత ద్వారకకు వస్తా మని దూతద్వారా కృష్ణుడికి కబురుచేశారు. తప్పక రావలసిందిగా కృష్ణుడు తన దూత ద్వారా వారిని ఆహ్వానించాడు. ధృతరా ష్ట్రుడి నూరుగురు కొడుకులూ, వారి సామం తులూ, పాండవులూ పద్దెనిమిది అక్షౌహి ణుల సేనతో సహా బయలుదేరి వచ్చి, రైవత కాద్రి ప్రాంతంలో విడిశారు.

బలరాముణ్ణీ, సాత్యకినీ, ప్రద్యుమ్నుడు మొదలైన కుమారులనూ, పెద్ద సేననూ



వెంటబెట్టుకుని, కృష్ణుడు తన అతిథులను సన్మానించటానికి వచ్చాడు. అతను అందరినీ గౌరవించి, అందరికీ బట్టలు పెట్టి, "నేనూ, నా వాళ్ళూ మీ వాళ్ళమే. మీకేం కావాలన్నా అడగండి, సమకూర్చుతాం," అని అందరికీ సంతోషం కలిగించాడు. వారంతా కొంతకాలం గడిపి వెళ్ళిపోయారు.

ఒకసారి అర్జునుడు ధర్మరాజు అనుమతితో కృష్ణుణ్ణి చూడవచ్చి ద్వారకలో కొంతకాలం ఉన్నాడు. ఆ సమయంలోనే కృష్ణుడు ఒక యజ్ఞం ప్రారంభించాడు. యజ్ఞం కొనసాగుతూ ఉన్న సమయంలో ఒక పల్లెటూరి బ్రాహ్మణుడక్కడికి వచ్చి, దీక్షలో ఉన్న కృష్ణుడికి ఎదురుగా నిలబడి దీనంగా, "అయ్యా, నా మొర ఆలకించండి. నా భార్య ప్రసవించిన మరుక్షణంలోనే బిడ్డలను ఎవరో కాజేస్తున్నారు. ఈ విధంగా ఇప్పటికి మూడుసార్లు జరిగింది. ఇప్పుడు నాలుగోసారి నా భార్య గర్భవతిగా ఉన్నది. కాన్పు వచ్చే సమయం దగ్గర పడింది. మమ్మల్ని నువే కాపాడాలి," అని మొర పెట్టుకున్నాడు.

ఆ మాటకు కృష్ణుడు, "ఎవరు కాపాడమన్నా వెంటనే ఆ పని చెయ్యటం నా విధి. కాని నే నీ క్షణాన యజ్ఞదీక్షలో ఉండిపోయాను. ఏం చెయ్యాలో తోచకుండా ఉన్నది," అన్నాడు.

ఇదంతా వింటున్న అర్జునుడు, "ఎందుకాలోచన? నన్ను పంపించరాదా? నే నీ బ్రాహ్మణుడి వెంట వెళ్ళి, ఆయనకు కలిగిన ఆపద తొలగించి, నిన్ను సంతోషపెడతాను," అని కృష్ణుడితో అన్నాడు.

కృష్ణుడు చిరునవ్వు నవ్వి, "ఈ పని నీ వల్ల అవుతుందా?" అన్నాడు.

అర్జునుడి కీ మాటతో తల తీసేసినట్టయి, తల వంచుకున్నాడు. అది చూసి కృష్ణుడు, "అయినా ఏంలే, ఒక్కడివీ వెళ్ళకు. బలరాముణ్ణీ, ప్రద్యుమ్నుణ్ణీ, మరి



కొందరు యాదవవీరులనూ, సాత్యకినీ, సేననూ వెంటబెట్టుకు వెళ్ళు," అన్నాడు.

అర్జునుడు మిగిలిన యోధులనూ, పెద్ద సేననూ వెంటబెట్టుకుని, బ్రాహ్మణుడు దారి చూపుతూండగా రథంలో బయలుదేరి ఆ బ్రాహ్మణుడి గ్రామం చేరాడు.

అంతలో నక్కలు కూయటం వినపడింది. ఆకాశాన సూర్యుడి కాంతి క్షీణించి, సాయంకాలం అవుతున్నట్టనిపించింది. భయంకరమైన ధ్వనితో ఉల్క ఒకటి భూమి పైన పడింది. అదే సమయంలో బ్రాహ్మణుడి భార్యకు నొప్పు లారంభమయాయి. ఆ సంగతి బ్రాహ్మణుడు వచ్చి చెప్పగా మహాయోధు లందరూ విల్లులూ, బాణాలూ సిద్ధంగా పట్టుకుని పురిటింటి దగ్గిర చేరారు.

అర్ధరాత్రి అయింది. బ్రాహ్మణి ప్రసవించింది కాబోలు, చంటిబిడ్డ ఏడుపు వినిపించింది. అంతలోనే ఆడవాళ్ళు, "అయ్యో, పోయె! పోయె!" అని ఆర్తనాదాలు చేశారు. చంటిబిడ్డ ఏడుపు ఆకాశం దిక్కునుంచి వినిపించింది.

అర్జునుడూ, మిగిలిన యోధులూ ఆకాశాన్ని బాణాలతో నింపేశారు. ఆకాశాన వారికేమీ కనిపించలేదు. ఒక్క బాణం కూడా



ఎవరికీ తగలలేదు, అందరూ దిగ్భ్రాంతులై, కొయ్యబారిపోయి నిలబడ్డారు.

ముసలివాళ్ళూ, ముత్తవ్వలూ అర్జునుడు మొదలైన వాళ్ళను నానా మాటలూ అన్నారు. బ్రాహ్మణుడు పట్టరాని కోపంతో అర్జునుడి వద్దకు వచ్చి, "గొప్ప శూరుడి లాగా కృష్ణుడి ముందర ప్రగల్భాలాడి, కార్యభారం మీద వేసుకుని వచ్చావు. కృష్ణుడి వల్ల తప్ప కాని పని నీ వల్ల అవుతుందా? నీకూ అతనికీ సాపత్య మేమిటి? ఇంకెన్నడూ దంభాలు పలుకకు. కాపాడతానని వచ్చి, కాపాడలేక పోయావు. జరిగిన ధర్మహాని వల్ల కలిగే పాపంలో నీకు



నాలుగో వంతు చెందుతుంది. నీ గాండీవం వృథా, నీ పరాక్రమం వృథా. ఇక చల్లగా వచ్చిన దారి పట్టు," అన్నాడు.

ఆయన వెంటనే కృష్ణుడి దగ్గిరికి మళ్ళీ బయలుదేరాడు. ఆయన వెనకగా అర్జునుడు మొదలైనవాళ్ళు కూడా బయలుదేరారు. సిగ్గుతో తల వంచుకుని, కంట తడిపెట్టుకుంటూ తన ఎదటికి వచ్చి నిలబడిన అర్జునుణ్ణి చూసి కృష్ణుడు, "ఈ మాత్రానికే ఇంత విచారం దేనికి? దీనికంతా వేరే కారణం ఉన్నది. దాన్ని నీకు తరవాత చెబుతాను," అని, దారుకుణ్ణి పిలిచి రథం ఆయత్తపరచమన్నాడు.



దారుకుడు కృష్ణుడి రథానికి శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకాలనే నాలుగు గుర్రాలను పూన్చి, గరుడధ్వజం ఎత్తి తీసుకు వచ్చాడు. అర్జునుణ్ణి రథం తోలమని, కృష్ణుడా రథంలో ఎక్కి, ఉత్తరంగా బయలుదెరాడు. రథం అరణ్యాలనూ, కొండలనూ, నదులనూ దాటి వెళ్ళి సముద్ర తీరాన్ని చేరింది.

సముద్రుడు ప్రత్యక్షమై, కృష్ణుడికి అర్ఘ్యమిచ్చి, "మహానుభావా, ఏమిటి నీ ఆజ్ఞ?" అని అడిగాడు.

"మరేమీ లేదు. నా రథానికి మార్గం ఇయ్యి," అన్నాడు కృష్ణుడు.

దానికి సముద్రుడు, "దేవా, నేను తమకు దారి ఇచ్చినట్టయితే మిగిలిన వారికి తేలిక అయిపోనా? నేను దాటరాని వాణ్ణిగా సృష్టి చేసింది తమరే గద?" అన్నాడు.

"నాతో ఒకరికి పోటీ ఏమిటి? నేను చేసే పనులు మరొకరు చేయగలరా? నా కోసమూ, ఒక బ్రాహ్మణుడి కోసమూ నువు దారి యివ్వక తప్పదు. నేను వెళ్ళిపోయాక దారి మళ్ళీ మూసేసి, ఎప్పటిలాగే ఉండు," అన్నాడు కృష్ణుడు.

సముద్రుడు సమ్మతించి దారి ఇచ్చాడు. కృష్ణుడి రథం ఉత్తర కురుభూములు దాటి

గంధమాదన పర్వతం కేసి వెళ్ళసాగింది. అప్పు డతనికి ఆరు పర్వతాలు-జయంతం, వైజయంతం, నీలం, శ్వేతం, ఇంద్రకూటం, కైలాసం అనేవి—రంగురంగుల ధాతువులతో అలంకరించి ఉన్న శరీరాలతో ఎదురై, "దేవా, ఏమిటి నీ ఆజ్ఞ?" అని అడిగాయి.

"నా రథానికి దారి ఇయ్యండి," అన్నాడు కృష్ణుడు.

అప్పు డా పర్వతాలు ఒదిగి, కృష్ణుడి రథానికి దారి ఇచ్చాయి.

మేఘాల మధ్యగా నడిచే సూర్యుడిలాగా కృష్ణుడి రథం కొండల మధ్యగా చాలా దూరం పోయేసరికి, అంతటా అంధకారం ఆవరించింది. అర్జునుడు భయపడ్డాడు. గుర్రాలు నిలిచి పోయాయి. చుట్టూ రాయిలాగా పేరుకు పోయిన అంధకారాన్ని కృష్ణుడు తన సుదర్శన చక్రంతో ముక్కలు ముక్కలు చేసి, "రథం పోనీ," అని అర్జునుడితో అన్నాడు.

చాలాదూరం వెళ్ళగా, వెళ్ళగా ఎక్కడట కోటి సూర్యుల కాంతి ఒక్కచోట పోగు చేసినట్టు కనబడింది. కృష్ణుడు రథం దిగి, ఆ కాంతిలోకి వెళ్ళిపోయాడు.

"ఈ వెలుతురేమిటి? ఇందులోకి కృష్ణుడు ఒంటరిగా ఎందుకు పోయాడు? ఏం కానున్నది?" అని అర్జునుడూ, బ్రాహ్మణుడూ భయపడుతూండగానే కృష్ణుడు ఆ కాంతిలో నుంచి తిరిగి వచ్చాడు. అతని వెంట ముగ్గురు బ్రాహ్మణకుమారులూ ఉన్నారు. అతని చేతిలో కొత్తగా పుట్టిన శిశువు కూడా ఉన్నాడు.

కృష్ణు డా పిల్లలు నలుగురినీ బ్రాహ్మణుడి కిచ్చాడు. బ్రాహ్మణుడు పొందిన ఆనందానికీ, అర్జునుడు పొందిన ఆశ్చర్యానికీ మేరలేదు.

రథం వెళ్ళిన దారినే కృష్ణుడి ఇంటికి తిరిగి వచ్చేసింది. కృష్ణు డా బ్రాహ్మణుడికి కానుకలిచ్చి పంపి, యజ్ఞాన్ని పూర్తిచేశాడు.





# కృష్ణావతారం

కృష్ణుడు ప్రారంభించిన యజ్ఞం పూర్తి అయింది. అనేక వేలమంది బ్రాహ్మణులకు సంతర్పణ జరిగింది. అర్జునుడూ, సాత్యకీ మొదలైన వాళ్ళను యాభైమందిని తన పంక్తిన పెట్టుకుని కృష్ణుడు విందు ఆరగించాడు. తరవాత అందరూ సభా భవనంలో చేరి కులాసాగా కబుర్లు చెప్పుకునేటప్పుడు అర్జునుడు కృష్ణుణ్ణి, "ఇంతకూ ఆ బ్రాహ్మణుడి కొడుకులు ఎలా పోయారు? వాళ్ళను ఎవరు ఎత్తుకుపోయారు? ఎక్కడ దాచారు?" అని అడిగాడు.

"సమస్త సృష్టికీ మూలకారణమైన పరమేశ్వరుడు నన్ను చూడగోరి, బ్రాహ్మణ కార్యాన్ని నేను అలక్ష్యం చెయ్యను గనక, బ్రాహ్మణ బాలకులను మాయం చేస్తూ వచ్చాడు. ఆయన కోరిక తీర్చటానికి నేను సముద్రాన్ని పాయలుగా చీల్చి, కొండలను తోసి దారిచేసుకుని వెళ్ళవలసి వచ్చింది," అన్నాడు కృష్ణుడు.

తరవాత అర్జునుడు తిరిగిపోయి ధర్మరాజుకు తాను చూసిన వింతలన్నీ చెప్పి, ఆయనకు అంతులేని సంతోషం కలిగించాడు.

ఒకనాడు రుక్మిణి కృష్ణుడితో, "నేను ప్రద్యుమ్నుడు మొదలైన పిల్లలను కన్నాను గాని, నా కింకా సంతాన కాంక్ష తీరలేదు. నీ వంటి కొడుకును ఇంకొక్కణ్ణి కనాలని ఉన్నది," అన్నది.

"శంకరుణ్ణి ఆరాధించి నీకు మరొక కొడుకును కంటాను. తపస్సు ద్వారా లభిం



చని దంటూ లేదు. హిమాలయానికి వెళ్ళి శంకరుడికి నమస్కారం చెయ్యటంతో బాటు, దారిలో బదరీవనంలో ఉండే మహా తపస్సంపన్నులను కూడా చూడాలని ఉన్నది. ఇందువల్ల అనేక శుభాలు కలుగుతాయి. కనక నేను కైలాశయాత్ర చేసి వస్తాను," అన్నాడు కృష్ణుడు.

మర్నాడు ఉదయం కృష్ణుడు కాలకృత్యాలు తీర్చుకుని, సభాభవనానికి రావలసిందని బలరాముడికీ, సాత్యకికీ, ఉగ్రసేనుడికీ, కృతవర్మకూ, ఉద్ధవుడికీ, మిగిలిన ప్రముఖులకూ కబురు చేశాడు. కొద్దిసేపట్లో అందరూ సభాభవనంలో సమా



వేశమయారు. అప్పుడు కృష్ణుడు వారితో ఇలా అన్నాడు:

"నేను నా విరోధులందరినీ చంపేశాను గాని ఇంకా ఒకడు మిగిలి ఉన్నాడు. వాడు సామాన్యుడు కాడు, చాలా ధైర్య పరాక్రమాలు గలవాడు. వాడి పేరు పౌండ్రుడు. వాడికి నేనంటే పగ. నాకు వాడంటే భయం ఉన్నది. వాణ్ణి చంపితేనే గాని నేను నిజంగా విజయం సాధించాననుకోను. నా కిప్పుడు కైలాసయాత్ర చేయవలసిన పని పడింది. నేను వెళ్ళగానే పౌండ్రుడు వచ్చి మన నగరం మీద దాడి చేస్తాడు. వాడు ప్రపంచంలో యాదవు డన్నవాడు లేకుండా చేయగలిగినవాడు. అందుచేత నేను తిరిగి వచ్చేదాకా మీరు వెయ్యి కళ్ళతో అహర్నిశలు నగరాన్ని కాపాడాలి. నగరద్వారా లన్నిటినీ గట్టిగా రక్షించండి. అనుమతి లేకుండా ఎవరినీ లోపలికి రానివ్వవద్దు, బయటికి పోనివ్వవద్దు. చతురంగ బలాలనూ అయత్తం చేసి ఉంచండి. ఆయుధాలన్నిటినీ సిద్ధపరచండి. అన్ని దిక్కులా చక్కగా రక్షించుకోండి."

తరవాత అతను సాత్యకితో, "ఈ నగరాన్ని రక్షించే భారం ప్రధానంగా నీ పైన ఉంచుతున్నాను. యాదవ సంపద కంతకూ







నిన్నే రక్షకుడుగా ఏర్పాటు చేస్తున్నాను," అని చెప్పాడు.

"నీ ఆజ్ఞా, బలరాముడి అండా ఉంటే నేను చెయ్యలేని దేమి ఉంటుంది? పౌండ్రు డేమిటి, ఇంద్రుడే దిక్పాలకు లందరినీ, దేవతలనూ వెంటబెట్టుకుని ఎత్తివచ్చినా సరే నేను లక్ష్యపెట్టను," అన్నాడు సాత్యకి.

కృష్ణుడు ఉద్ధవుడితో, "గురువర్యా, నువు బుద్ధికి బృహస్పతివి. నీకు నేను చెప్పట మేమిటి? పరాక్రమవంతులైన మన యాదవవీరులను నీ బుద్ధిబలంతో నడిపించు," అన్నాడు. అతను ఇదే విధంగా బలరాముణ్ణీ, ఉగ్రసేనుణ్ణీ, ఇతర యాదవ ముఖ్యులనూ హెచ్చరించి, గరుత్మంతుణ్ణి స్మరించాడు. వెంటనే గరుత్మంతుడు వచ్చి వాలాడు. తాను కైలాసానికి వెళ్ళాలని చెప్పి కృష్ణుడు గరుత్మంతుడి వీపు మీద ఎక్కి కూర్చున్నాడు. కృష్ణుడితో సహా గరుత్మంతుడు ఆకాశంలోకి లేచి, ఈశాన్య దిక్కుగా ప్రయాణమయాడు.

అలా బయలుదేరిన కృష్ణుడు దారిలో బదరీవనంలో దిగాడు. అక్కడ ఉండే మునులు అతనికి గొప్ప స్వాగతం ఇచ్చారు. వారి ఆతిథ్యం స్వీకరించి కృష్ణుడు ఆ రాత్రికి అక్కడే ఉండిపోయాడు. అర్ధరాత్రి వేళ అతనికి ఆ ప్రాంతమంతా సంచరించాలని బుద్ధి పుట్టింది. అతను చాలాసేపు బదరీ వనమంతా సంచరించి, ఒక మనోహర ప్రదేశానికి వచ్చి, అక్కడ స్వస్తికాసనం వేసుకుని, సమాధియోగం అవలంబించాడు.

ఆ సమయంలో అటుగా అనేకవేల సంఖ్యలో పిశాచులు మృగాలను తరుముకుంటూ వచ్చారు. వాళ్ళకు నాయకులుగా ఘంటాకర్ణు డనే పిశాచీ, అతని తమ్ముడూ ఉన్నారు. వాళ్ళు కృష్ణు డున్న చోటికి వచ్చి, "ఎవరవు, బాబూ? చూడటానికి నాజూకుగా ఉన్నావు, ఈ వనంలో ఎందు





కున్నావు? నువు రాకసుడివా, దేవతవా?" అని అడిగారు.

"నేను యదువంశ క్షత్రియుణ్ణి. దుష్టులను సంహరించటమూ, సజ్జనులకు సంతోషం కలిగించటమూ నా పని. శంకరుణ్ణి చూడటానికి కైలాసానికి వెళుతున్నాను. మీ రెవరు? ఇది సాధుజను లుండే చోటు. ఇక్కడ మృగాలను కూడా హింసించరాదు. మీరు మృగాలను వేటాడుతూ ఇక్కడికి వస్తే నేను సహించను," అన్నాడు కృష్ణుడు.

ఆ మాటకు ఘంటాకర్ణుడు, "నా పేరు ఘంటాకర్ణుడు. వీడు నా తమ్ముడు. నేను విష్ణుభక్తుణ్ణి. ఇదంతా నా సేన. నేను కుబేరుడి కింకరుణ్ణి. విష్ణుపూజ కోసమే మృగాలను వేటాడుతున్నాం గనక దీన్ని హింస అనకూడదు. మరొకటి చెబుతాను విను. నా ఇష్ట దైవం వసు దేవుడి కొడుకుగా జన్మించి ద్వారకలో నివశిస్తున్నాడు. నేను ఇప్పు డాయనను దర్శించటానికే సేనా సమేతంగా బయలుదేరి పోతున్నాను," అని చెప్పాడు.

తరవాత అతను కృష్ణుడి దగ్గరలోనే పేగులు పరిచి కూర్చుని, చేతులు మోడ్చి, తన యిష్టదైవాన్ని ధ్యానించుకో సాగాడు. వాణ్ణి చూస్తుంటే కృష్ణుడికి ముచ్చటవేసింది. వాడు తన భక్తుడు, కాని చేసేవన్నీ పిశాచపు పనులు. కళ్ళు మూసుకుని ధ్యానించే ఘంటాకర్ణుడి మనోనేత్రంలో తన స్వరూపం కనబడేటట్టు కృష్ణుడు చేశాడు. వాడు కళ్ళు తెరిచి చూసేటప్పటికి అదే రూపం కళ్ళ ఎదట కనబడింది. వాడు లేచి ఆనంద పారవశ్యంతో నృత్యం చేస్తూ, "కృష్ణుణ్ణి చూశాను! విష్ణువును చూశాను!" అని కేకలు పెట్టాడు; కృష్ణుణ్ణి రకరకాల స్తోత్రం చేశాడు. తరవాత వాడు తన శూలానికి గుచ్చి ఉన్న శవాన్ని తీసి, కత్తితో రెండుగా నరికి, "ఇది పవిత్రమైన బ్రాహ్మ





ఖుడి శవం. భక్తితో నీకు అర్పిస్తున్నాను. తీసుకో," అన్నాడు.

కృష్ణుడికి వాణ్ణి చూస్తే జాలి వేసింది. అతను ఘంటాకర్ణుడితో, "చూడు నాయనా! నాబోటివాళ్ళు పీనుగను తాకరు. ఇటువంటి పూజలు నాకు చాలా అసహ్యం కూడానూ. మామూలు పిశాచాలు చేసే ఇటువంటి పనులు నీ వంటి గొప్పవాడు చేయరాదు. ఎప్పుడూ నన్నే ధ్యానిస్తూ ఉంటావు గనక నేను నీకు ఉత్తమ లోకం ఇస్తాను," అంటూ, ఘంటాకర్ణుడి శరీరం తాకాడు. పరుసవేది తగలగానే ఇనుము బంగారమైనట్టుగా, కృష్ణుడి చెయ్యి తగలగానే



ఆ భయంకర పిశాచి కాస్తా దేవతగా మారిపోయాడు.

త్వరలోనే రాత్రి గడిచిపోయింది. సూర్యోదయమయింది. కృష్ణుడు గంగా స్నానం చేసి, బదరీవనంలోని మునులకు వీడ్కోలు చెప్పి, గరుత్మండుడిపై ఎక్కి కైలాసానికి బయలుదేరాడు. కైలాసం చేరవస్తూ అతను ఆ కొండ మీది వివరాలన్నీ చూసి, శివుడు చేసిన పనులను స్మరించుకుంటూ చాలా ఆనందం పొందాడు.

అతను మానసరోవరం ఉత్తర తీరాన దిగి, అక్కడి మునులందరి పరిచయమూ చేసుకుని, పన్నెండేళ్ళు తపస్సు చెయ్యటానికి పూనుకున్నాడు. అతను ఫాల్గుణ మాసారంభంలో దీక్ష పుచ్చుకుని, కందమూలాలు తింటూ పన్నెండేళ్ళపాటు తపస్సు కొనసాగించాడు. పన్నెండేళ్ళు పూర్తి అయాయి. ఆఖరు రోజున ఇంద్రుడూ, ఇతర దేవతలూ కృష్ణుణ్ణి చూడవచ్చారు. అతను ఏ ఉదేశంతో ఇంత దీర్ఘ తపస్సు చేశాడో వారికి అంతుబట్టలేదు.

ఆ మర్నాడు వృషభవాహనం మీద పార్వతితో సహా శివుడే బయలుదేరి వచ్చాడు. ఆయన వెంట పుష్పకం మీద కుబేరుడూ, తమ తమ వాహనాల మీద



విఘ్నేశ్వరుడూ, కుమారస్వామీ, వాళ్ళకు ముందుగా ఆయుధాలు ధరించి నందీ, మహాకాళుడూ, వెనకగా భూతగణాలూ వచ్చారు. వారంతా పాడుతూ, నృత్యాలు చేస్తున్నారు.

కృష్ణుణ్ణి అంతదూరాన చూడగానే శివుడు పార్వతితో సహా వృషభవాహనం దిగాడు. కృష్ణుడు కూడా శివుణ్ణి దూరాన చూస్తూనే, తన ఆసనం మీది నుంచి లేచి ఎదురు వచ్చి, ఎంతో భక్తితో తలవంచి, నమస్కరించుతూ శివుడి కెదురుగా నిలబడ్డాడు. ఆ సమయంలో అక్కడ చేరిన దేవతలందరూ శివకేశవులను ఒకేసారి చూసి తమ జన్మలు తరించాయని ఆనందపడ్డారు.

కృష్ణుడు శివుడికి సాష్టాంగ ప్రణామం చేసి ఆయనను కీర్తించాడు. శివుడు చాలా సంతోషించి, కృష్ణుడి చేతిని తన చేత్తో పట్టుకుని ఇలా అన్నాడు:

"కృష్ణా, ఇదివరకే నువు తపస్సిద్ధి చేత నా నుంచి వరంగా ఒక కొడుకును పొంది ఉన్నావు. నేను పూర్వం కృతయుగంలో అనేక వందల ఏళ్ళపాటు ఒకానొక సంకల్పంతో అతినిష్ఠగా తపస్సు చేశాను. అప్పుడు నాకు పరిచర్య చెయ్యటానికని హిమవంతుడు ఈడు వచ్చిన



తన కుమార్తెనూ, ఆమె సఖీ జనాన్నీ సమర్పించాడు. నేను కూడా అందుకు అంగీకరించాను. ఆ సందర్భంలో మా ఇద్ద రినీ కలపాలని నిశ్చయించి ఇంద్రుడు మన్మథుణ్ణి ప్రేరేపించాడు. ఆ మన్మథుడు నా మీదికి ఎత్తి వచ్చి, నేను సమాధిలో నుంచి బయటికి వచ్చే సమయం కోసం వేచి వుండి, నా గుండె మీద మోహనాస్త్రం ప్రయోగించాడు. వెంటనే నాలో మన్మథ వికారం కలిగి నేను పార్వతి కేసి చూశాను. ఆమె పులకించిన శరీరంతో చాలా అందంగా కనిపించింది. ఎందు కిలా అయిందా అని ఆశ్చర్యపడుతూ నేను చుట్టూ కలయ జూశాను. తన దగ్గర ఉన్న ఆయుధాలన్నీ నా పైన ప్రయోగించటానికి సిద్ధపడిన మన్మ థుడు కనిపించాడు. ఆటువంటి దుర్మార్గుణ్ణి చంపితే మాత్రమేమిటని నేను అనుకుం టూండగానే నా ఫాలనేత్రం నుంచి అగ్ని పుట్టు కొచ్చింది. మన్మథుణ్ణి శిక్షించ వద్దనీ, అగ్రహించ వద్దనీ ఆకాశాన దేవతలు కేకలు పెడుతూండగానే, అగ్నిజ్వాలలు మన్మథుణ్ణి ఆవరించి, బూడిద చేసేశాయి. ఆ తరవాత బ్రహ్మ మొదలు గాగల దేవతలు వచ్చి, మన్మథుడు ముల్లోకాలకూ మేలు చేకూర్చే వాడని చెప్పగా, బ్రహ్మ ఉద్దేశానుసారం అతన్ని నీకు కొడుకుగా నిర్ణయించాను. అతనే ప్రద్యుమ్నుడు; నీకూ, రుక్మిణికీ కలిగిన తొలి సంతానం. నువ్విప్పుడు చేసిన తపస్సుకు ఫలితం ముందుగానే పొందావు."

తరవాత శివుడు అక్కడ చేరిన మునులు మొదలైన వారిని పలకరించి, కృష్ణుణ్ణి శ్రీమన్నారాయణుడుగా భావించి పూజించ మని చెప్పి, అంతర్ధానమైనాడు. అతనితో బాటే పార్వతీ, విఘ్నేశ్వరుడూ, కుమార స్వామీ, నందీ, ప్రమథగణాలవారూ అంతర్ధానమయారు. కృష్ణుడు కూడా బదరీ వనానికి తిరిగి వచ్చాడు.






ద్వారక పైకి దండెత్తి వెళ్ళే సన్నాహంలో ఉండగా పౌండ్రవాసుదేవుడి ఇంటికి నారదుడు వచ్చాడు. పౌండ్రుడు నారదుడికి ఎదురు వెళ్ళి, అర్ఘ్యపాద్యాలిచ్చి, బంగారు ఆసనం మీద కూర్చోబెట్టి, "మహానుభావా, నువు తిరగని లోకం లేదు. ఎక్కడికి పోయినా నిన్నెవరూ అడ్డగించరు. అందుచేత నా కొక సహాయం చెయ్యి. నేను కృష్ణుణ్ణీ, అతని బలగాన్నీ సర్వనాశనం చెయ్యబోతున్నానని అన్ని లోకాలలోనూ చెప్పు. ఆ గొల్లవాడు నా పేరు పెట్టుకుని తిరుగుతున్నాడు," అన్నాడు.

ఈ మాటకు నారదుడు చిరునవ్వు నవ్వి, "నేను సమస్త లోకాలూ తిరిగే మాటా నిజమే, నా మాట అందరూ నమ్మేదీ నిజమే. కాని నువు చెప్పేమాటే అనుమానాస్పదంగా ఉన్నది. కృష్ణుడికీ, నీకూ పోలికేమిటి? కొండ ముందు నలుసులాటివాడివి, నువు కృష్ణుడికి ప్రతి యోధుడివెలా అవుతావు? నిన్ను కృష్ణుడు తప్పక శిక్షిస్తాడు. అందుచేత ఈ ప్రయత్నం మానుకో. నీ పేరూ వాసుదేవుడే గదా అనీ, నీకు కూడా శంఖ చక్ర గదా శార్‌ఙ్గాలున్నాయనీ కృష్ణుడితో సమానుడివి కాబోవు. నవ్వుల పాలైపోగలవు. నీ మదం అణచటానికి అతను కూడా ఎదురు చూస్తూనే ఉంటాడు," అన్నాడు.

పౌండ్రుడు బిగ్గిరిగా నవ్వి, "నువ్వన్నది కాదంటే కోప్పడతావు, శపిస్తావు. అందుచేత ఏమన్నా అనాలంటే మా బోటి వాళ్లం

23. పౌండ్రవాసుదేవుడి వధ





భయపడతాం. ఈ మాటలే మరొకడంటే బతకనిచ్చేవాణ్ణా? నీతో వాగ్వాదానికి నాకు తీరిక లేదు. నీ నోటితోనే నన్ను మెచ్చుకునే రోజు వస్తుందిలే. ఇంక దయచెయ్యి," అని చెప్పాడు.

నారదుడు పౌండ్రుడితో ఏమీ అనక తిన్నగా బదరికాశ్రమానికి వెళ్ళి, అక్కడ ఉన్న కృష్ణుడితో పౌండ్రుడి యుద్ధ సన్నాహం గురించి చెప్పి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఆ రాత్రే పౌండ్రుడు ప్రచండమైన సేనతో బయలుదేరి ద్వారకను ముట్టడించబోయాడు. కొన్నివేల దివిటీలతో అతని సేన ద్వారకయొక్క తూర్పు ద్వారం వద్ద చేరింది. వాళ్ళు ఆ అపరాత్రివేళ దిక్కులు బద్దలయేలాగా భేరీలూ, కాహళులూ మోగించారు.

యాదవులు తగు జాగ్రత్తలోనే ఉన్నారు. రాత్రివేళల కూడా ద్వారకానగరం దివిటీలతో పగటి వేళ ఉన్నంత ప్రకాశవంతంగానూ ఉంటున్నది. పౌండ్రుడి రాకకు ఏ మాత్రమూ కంగారు పడక యాదవులు అతి శీఘ్రంగా తమ సేనలను యుద్ధానికి ఆయత్తపరిచారు. తరవాత ఉగ్రసేనుడూ, బలరాముడూ, సాత్యకీ, కృతవర్మ ముందుండి, సైన్యాల్ని వెంట బెట్టుకుని వచ్చి పౌండ్రుడి సేనలతో మహాదారుణమైన యుద్ధం ప్రారంభించారు. ఉభయ పక్షాలా ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ నాశనం కాసాగాయి.

ఒక వంక సంకుల సమరం సాగుతూంటే, పౌండ్రుడి పక్షానికి చెందిన ఏకలవ్యుడనే వాడు తన పేరు చెప్పుకుని సాత్యకినీ, కృతవర్మనూ, బలరాముణ్ణీ, కృష్ణుణ్ణీ పేర్లు పెట్టి పిలిచి యుద్ధానికి సవాలు చేశాడు. యాదవవీరులు అతనికి ఎదురు రాగా అందరినీ బాణాలతో కొట్టాడు. దివిటీలవాళ్ళు దివిటీలు పారేసి పారి



పోయారు. యుద్ధరంగం అంతా చీకటి అయింది. పాండ్రుడు తాను గెలిచాననే అను కున్నాడు. "కోట గోడలు ఎక్కండి, ధ్వజాలు విరగ గొట్టండి, నగరం ఆక్రమించండి!" అని పాండ్రుడు కేకలు పెడుతూంటే అతని సేనలో ఉత్సాహమూ, కోలాహలమూ జాస్తిఅయాయి.

ఈ పరిస్థితి చూసి సాత్యకికి మండి పోయింది. కృష్ణుడు నగర రక్షణ భారం తన మీద పెట్టి వెళ్ళాడు. కృష్ణుడు లేని కారణం చేతనే శత్రువు లింతగా విజృంభించారనే మాట వస్తుంది. అందుచేత అతను తన పక్షానికి చెందిన యోధులను ఉత్తేజపరుస్తూ, "నేను శత్రువులను ఎలా నిర్మూలించబోతున్నానో చూడండి. నగరం రక్షించే భారం మన అందరి పైనా ఉన్న దన్న సంగతి మరిచారా?" అన్నాడు.

ఇలా అంటూనే సాత్యకి ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. దానితో కోట నాలుగు పక్కలా మంటలు పుట్టుకొచ్చాయి. కోట గోడలు ఎగబాకే ప్రయత్నంలో ఉన్న సైనికులు పారిపోయారు. సాత్యకి వారిని తరుము కుంటూ వెళ్ళి, "రాజైపుట్టి, రాచమర్యాద కూడా తెలియకుండా, అర్ధ రాత్రి వేళ అందరూ నిద్రపోయే సమయంలో దొంగ లాగా యుద్ధానికి వచ్చిన ఆ నీచు డెక్కడ?





యుద్ధం చెయ్యటం నాకు పరువు చేటు. అందుచేత నువు తప్పుకో. కాదంటావా? ఒక్క క్షణంలో నా బాణాలతో నిన్ను పర లోకానికి పంపగలను, చూసుకో! దాంతో మీ గోపాలుడి మదం అణిగి పోతుంది. అతను ఈ గొల్లపల్లె భారమంతా నీ నెత్తిన పెట్టి కైలాస యాత్ర వెళ్ళాడని తెలుస్తున్నది. వచ్చాక అతని సంగతి చూస్తాం. ప్రస్తుతానికి అతనికి సంతోషం కలిగేటట్టుగా చావటమే నీ ధర్మం," అన్నాడు.

ఇద్దరూ ఇదే ధోరణిలో బీరాలు పలికి యుద్ధానికి దిగారు. ఇద్దరూ బాణాలతో పరస్పరం క్రూరంగా హింసించుకున్నారు; ఒకరినొకరు మూర్ఛ పోగొట్టారు; ఒకరి రథాలొకరు ధ్వంసం చేశారు; ఒకరి బాణాలొకరు విరగగొట్టారు: ఇద్దరూ గదాయుద్ధం చేశారు; చివరకు ముష్టియుద్ధం కూడా చేశారు. ఇద్దరూ సమ బలులుగా కనిపించారు. చస్తే ఇద్దరూ చస్తారు గాని, ఒకరిని మరొకరు చంపి, గెలవటం సాధ్యం కాదని చూసే వారికి అనిపించింది. చివరకు ఉభయపక్షాల యోధులూ వారి యుద్ధానికి అడ్డం తగిలి, వారిని విడదీశారు.

తరవాత ఏకలవ్యుడూ, బలరాముడూ ద్వంద్వ యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో

నేను అతనితో యుద్ధానికి వచ్చాను," అని కేక పెట్టాడు.

ఈ కేక విని యుద్ధసన్నద్ధుడై ఉన్న పౌండ్రుడు ముందరికి వచ్చి, "ఓయీ, సాత్యకీ, నువు యుద్ధానికి వచ్చావు, బాగానే ఉన్నది. కాని ఆ కృష్ణు డెక్కడ? అతగాడు ఆవులను తోలుకోక పెద్ద యోధుడనని తిరుగుతున్నా డేమిటి? నా సంగతి ఎరగడా? స్త్రీలనూ, గొడ్లనూ సంహరించే వాడు నా పేరు తగిలించుకుంటే ఏమైనా నప్పుతుందా? ఆ కృష్ణుడు నా మిత్రుణ్ణి నరకుణ్ణి చంపాడు. అందుచేత అతన్ని యుద్ధంలో కడతేర్చ వచ్చాను. నీతో



బలరాముడు ఏకలవ్యుణ్ణి మూర్ఛపోగొట్టి, తన హలాయుధంతో శత్రుసైన్యాన్ని చించి చెండాడాడు.

ఇంతలో స్పృహ తెలిసి ఏకలవ్యుడు తిరిగి బలరాముడి పైన కలియ బడ్డాడు. వారు భయంకరంగా యుద్ధం చేస్తూండ గానే తూర్పు తెల్లవారింది.

అప్పుడు పౌండ్రుడు తన సేనలను యుద్ధం నిలపమని హెచ్చరిస్తూ, "మనం ఎంత మందిని చంపి ఏమి లాభం? అసలు శత్రువు లేడు. అందుచేత ఈ యుద్ధం నిరర్థకం. కృష్ణుడు వచ్చాక మన పరాక్రమం చూపుదాం. ఈ క్షుద్రుల మీద మన ప్రతాపం చూపే దేమిటి?" అన్నాడు.

వెంటనే పౌండ్రుడి సేనలు యుద్ధం మాని వెనక్కు తగ్గాయి. పౌండ్రుడు తన సేనలను వెంటబెట్టుకుని, తన మిత్రుడైన కాశీరాజు వద్దకు వెళ్ళిపోయాడు. కృష్ణుడి రాకకు ఎదురుచూస్తూ అతను అక్కడే ఉండిపోయాడు.

ద్వారకలో యాదవులు తమకు విజయం లభించినట్టు తూర్యనాదాలు చేసి, నగరం లోపలికి వెళ్ళిపోయారు. కృష్ణుడి మాట నిలబెట్ట గలిగినందుకు వారు చాలా సంతోషించారు.



ఇంతలో కృష్ణుడు ఆకాశమార్గాన వారికి కనిపించాడు. అతను నగరం బయట గరుడవాహనం దిగి, దారుకుడు తెచ్చిన రథ మెక్కి, ద్వారకలోకి వచ్చాడు. పన్నెండేళ్ళ అనంతరం కనిపించిన కృష్ణుణ్ణి చూసి యాదవు లెంతో సంతోషించారు. కృష్ణుడు తన కైలాసయాత్ర వివరాలన్నీ చెప్పి, పౌండ్రుడు చేసి వెళ్ళిన యుద్ధం గురించి విన్నాడు.

కృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చాడని తెలిసి, కాశీలో ఉన్న పౌండ్రుడు ఒక దూత ద్వారా ద్వారకలో ఉన్న కృష్ణుడికి ఇలా సందేశం పంపాడు:





"గోవుల మధ్య పుట్టి పెరిగిన నీకు ధర్మం తెలీదు. స్త్రీలనూ, మృగాలనూ, బంధువులనూ వధించటంతో ఊరుకోక, నా పేరూ, నా చిహ్నలూ కూడా ధరించావు. ఏ విధంగానూ నువు నన్ను పోలవు. నీకు బతికి ఉండాలన్న కోరిక ఉంటే, నా ఆజ్ఞ ప్రకారం చక్రం మొదలైన ఆయుధాలు విసర్జించు; నా పేరు పెట్టుకోవటం మాని, వచ్చి నన్ను శరణువేడు."

పౌండ్రుడి మాటలుగా దూత ఇలా చెప్పగా కృష్ణుడు నవ్వి, "మీ రాజు చెప్పి నట్టే చేస్తాను. నన్ను రమ్మన్నాడు గనక వస్తాను; చక్రం మొదలైనవి విడవమన్నాడు



గనక అతని మీదనే విడుస్తాను. తన శరణం వేడమన్నాడు గనక, అతని శరణం (వధ) చూస్తాను. గొప్పవాడి మాట తీసి వెయ్యటం బాగుండదు," అని దూతను గొప్పగా సత్కరించి పంపేశాడు.

తన దూత తెచ్చిన సందేశం వినగానే పౌండ్రుడు కాశీనగరం వెలపల తన తోటి రాజులతోనూ, సైన్యాలతోనూ సన్నద్ధుడై కృష్ణుడి రాక కోసం ఎదురు చూడసాగాడు.

కృష్ణుడు బయలుదేరుతూంటే సాత్యకి మొదలైన వాళ్ళు కూడా సైన్యాలతో బయలుదేరబోయారు. కాని కృష్ణుడు వారిని వారించి, "యుద్ధంలో మీ వంతు గెలుపు మీరు పొందారు. ఈ సారి నా వంతు," అని చెప్పాడు.

అతను గరుడవాహనం మీద బయలు దేరి పౌండ్రుడున్న చోటికి చేరాడు. ఇద్దరు వాసుదేవులూ ఒకరి కొకరు ఎదురు నిల్చారు. కృష్ణుడు పౌండ్రుడితో, "పౌండ్రరాజా, నీకు నా లాంఛనాలన్నిటినీ ధరించాలని కోరిక ఉన్నట్టయితే నన్ను వేడుకుంటే నేను సమ్మతించక పోయానా? ఎందు కింత మతిమాలిన పని చేశావు? ఇప్పుడైనా మించి పోలేదు, నన్ను వేడుకుంటే నేను నిన్ను కాస్తాను. నేను శరణాగత త్రాణపరా



యణుణ్ణి. నా చక్రంతో నరకుడి లాగా ఎందరో చచ్చారు. ఇక్కడ ఉన్న వారిలో ఒక్కడూ నిన్ను రక్షించ లేడు. నీ మేలు కోరి హితం చెప్పాను," అన్నాడు.

"నా లాంఛనాలనే నువు పెట్టుకున్నావు. అందుకు నిన్ను శిక్షించటానికే నేను వచ్చాను. నా రాక తెలిసి కొంతకాలం కైలాసంలో దాక్కున్నావు. నువు లేవని తెలిసి నీ నగరాన్ని నేల మట్టం చెయ్యక వదిలాను. నువు రావటం మంచిదయింది. నీ కోసం యముడు కాచుకుని ఉన్నాడు," అన్నాడు పౌండ్రుడు.

ఇద్దరూ యుద్ధానికి ఉపక్రమించారు. కృష్ణుడు వరసగా పౌండ్రుడి ఆయుధాలన్నీ నిర్మూలించి, తన చక్రాయుధంతో పౌండ్రుణ్ణి కడతేర్చాడు.

తన ఆప్తమిత్రుడైన పౌండ్రుడు చచ్చాడన్న రోషంతో కాశీరాజు కృష్ణుడితో యుద్ధానికి తలపడ్డాడు. కృష్ణుడు ఒక అస్త్రంతో కాశీరాజు తల తెగనరికాడు. ఆ తల వెళ్ళి కాశీనగరం మధ్యన పడింది.

ఈ విధంగా కృష్ణుడు తాను వచ్చిన పని ముగించి ద్వారకకు తిరిగి వెళ్ళాడు.

కాశీరాజు కొడుకు తన తండ్రి చావుకు దుఃఖించి, తమ పురోహితుడి చేత అగ్నిహోత్రం చేయించగా దక్షిణాగ్నియందు కృత్య అనే భయంకర పిశాచి ఆవిర్భవించి, "ఏమి ఆజ్ఞ?" అని అడిగింది. కృష్ణుణ్ణీ, అతని వాళ్ళనూ చంపి రమ్మని కాశీరాజు కొడుకు దాన్ని కోరాడు. కృత్య ద్వారకకు వచ్చింది. ద్వారకావాసులు దాన్ని చూసి భయపడి కృష్ణుడితో చెప్పారు. కృష్ణుడు తన సుదర్శనచక్రాన్ని దాని మీదికి వదిలాడు. కృత్య తిరిగి కాశీకి పారిపోతుంటే చక్రం దాన్ని వెన్నంటి వెళ్ళింది. కృత్య కాశీనగరంలో ప్రవేశించగానే సుదర్శనచక్రం కృత్యతోబాటు కాశీనగరాన్ని కూడా పూర్తిగా నిర్మూలించేసింది.





# కృష్ణావతారం

బలి కుమారుడు బాణాసురుడు. అతని రాజధాని శోణపురం. వెయ్యిచేతులు గల బాణుడు చిన్నతనంలో తెగ తిరిగాడు. ఒకనాడు అతను, మణులతోనూ, బంగారం తోనూ ప్రకాశించే కుబేరపర్వతపు గుహలో కుమారస్వామి ఆటలలో మునిగి ఉండటమూ, శివపార్వతులు వినోదించుతూ ఉండటమూ చూశాడు.

కుమారస్వామి ఆరు ముఖాలూ, చేతులూ, శరీరచ్ఛాయా, తేజస్సూ చూసి బాణుడు, "ఈ కుర్రవాడు ఏ తపస్సు చేసి శివుడికి కొడుకై జన్మించాడో గదా! నేను కూడా అలాగే తపస్సు చేసి ఈ మహా దృష్టాన్ని సాధించాలి," అనుకున్నాడు. అలా అనుకున్న బాణుడు ఏకాగ్రభక్తితో అనేక సంవత్సరాల పాటు నిష్ఠగా శివుణ్ణి ఆరాధించాడు. శివుడు అతని ఆరాధనకు సంతోషించి, పార్వతీసమేతుడై బాణుడి ఎదట ప్రత్యక్షమై, చిరునవ్వు నవ్వుతూ, "నాయనా, నీ ఇష్టంవచ్చిన వరం కోరుకో, ఇస్తాను," అన్నాడు.

బాణుడు చేతులు మోడ్చి, "దేవా, నే నీ దేవికి కొడుకునై, నీ అనుగ్రహానికి పాత్రుణ్ణి అయేటట్టు వరం ఇయ్యి," అని అడిగాడు.

శివుడు సరేనని, పార్వతిని చూసి, "దేవీ, వీడు బాణుడు. నీ చిన్నకొడుకు. కుమారస్వామికి రెండోవాడు. వీణ్ణి గ్రహించు," అన్నాడు. తరవాత శివుడు బాణుడికి, సమస్త సంపదలతోనూ తులతూగే శోణ



పురాన్ని రాజధానిగా ఇచ్చి, "నీ నగరాన్ని నేను స్వయంగా కాపాడుతూ ఉంటాను. నిన్ను ఎంతటివాడూ జయించలేడు. అందుచేత నువు నిశ్చింతగా ఉండు," అన్నాడు.

కుమారస్వామి బాణుడికి ఒక దివ్యమైన నెమలిని ఇచ్చి, "ఈ నెమలే నీకు వాహనమూ, పతాక కూడా అయి ఉంటుంది," అని చెప్పాడు.

ఇక బాణుడికి ఎవరి భయమూ లేదు. ఎందుకంటే, శివుడే తనకు రక్ష. అతను విజృంభించి దేవతలనూ, గంధర్వులనూ, నాగులనూ, ఖేచరులనూ, రాక్షసులనూ, సమస్తమైన వారినీ ఒకటి తరవాత ఒకరినిగా జయించి, యుద్ధం చెయ్యాలనే ఆసక్తి తీరక, తనతో యుద్ధం చెయ్యగల వాళ్లు కానక తపించిపోయాడు.

అనేక సంవత్సరాలు ఇలా గడిచిన మీదట అతని చేతుల తీట దుర్భరమయింది. అతను శివుడి వద్దకు వెళ్ళి, సాష్టాంగపడి, భక్తిగా పూజ చేసి, "దేవా, నాకు యుద్ధం కరువైపోయింది. నా చేత అనేకసార్లు ఓడిపోయిన దేవతలు నా ఎదట పడకుండా ఉన్నారు. నాతో యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా ఉన్న శూరుడు మూడు లోకాలలోనూ ఒక్కడైనా కానరాడు. నా చేతులన్నీ వ్యర్థంగా ఉండిపోయాయి. ప్రదర్శించటానికి లేని పరాక్రమం వృథా కదా! నాకు యుద్ధం చేసే అవకాశం ఎలా కలిగేదీ తెలిపి అనుగ్రహించు," అని వేడుకున్నాడు.

శివుడు బాణుణ్ణి చూసి నవ్వి, "నువ్వడిగినది నేను కాదనటం భావ్యంకాదు గద. విను. నీ మయూరధ్వజం ఏ కారణమూ లేకుండా ఒరిగి, పడిపోయినప్పుడు నువ్వు కోరుకుంటున్న యుద్ధం నీకు సన్నిహితమవుతుందనుకో. అప్పుడు నీ బాహుబలానికి తగినటువంటి యుద్ధం సంభవిస్తుంది. విచారించకు," అన్నాడు.

"అమ్మయ్య, బతికిపోయాను," అని బాణుడు శివుడికి మొక్కి, సెలవు తీసుకుని, తన యింట నెమలిధ్వజం ఉన్న చోటికి వెళ్ళి కూర్చుని, సభ జేసి, తన మంత్రి అయిన కుంభాండుడితో, "ఒక మంచి వార్త తెచ్చాను," అన్నాడు.

దానికి కుంభాండుడు, "మంచి వార్తలు చాలా ఉంటాయి. అందులో ఇది ఏది? నీకు శివుడు కొత్తవరం ఏదన్నా ఇచ్చాడా? లేకపోతే, ఇంద్రుణ్ణి పాతాళానికి పంపేసి, దేవలోకాన్ని నిన్నే ఏలుకోమన్నాడా? అదీ కాకపోతే, కృష్ణుణ్ణి గెలిచే ఉపాయం గాని చెప్పలేదు గద? అదే జరిగితే ఇంక లేనిదేమిటి? విష్ణుడి చేత మోసపోయి పాతాళం చేరిన పరమ ధర్మాత్ముడు నీ తండ్రికి విముక్తి కలుగుతుంది. ఆయనను మళ్ళీ చూచి ధన్యులమవుతాం," అన్నాడు.

బాణుడు చిన్నగా నవ్వుతూ, "కాదు, కుంభాండా! యుద్ధాలు లేని కారణం చేత నా చేతులు దురదగా ఉండి, నాకు యుద్ధం చేసే అవకాశం ఎలా కలుగుతుందని శివుణ్ణి వేడుకున్నాను. నా యీ మయూరధ్వజం అకారణంగా ఎప్పుడు పడిపోతే అప్పుడు నాకు తగిన యుద్ధం రాబోతుం దనుకోమని ఆ మహాదేవుడు



చెప్పాడు. అదే నీకు నేను చెబుదామనుకున్నాను," అన్నాడు.

కుంభాండుడు చిన్నబోయి, "అయ్యో, ఇదేం ప్రారబ్దం! ఇదా నువు మహాశివుణ్ణి అడిగిన వరం? ప్రహ్లాదుడి కులాని కెంత దుస్థితి వచ్చింది!" అన్నాడు.

అతనా మాట అంటూండగానే పెళపెళా రావాలతో మయూరధ్వజం, వజ్రాయుధం దెబ్బతిన్న కొండ లాగా, ఒరిగి పడిపోయి, బాణుడూ, కుంభాండుడూ చూస్తుండగా విరిగిపోయింది. తన కోరిక ఈడేరుతున్నదని బాణుడు పరమానందభరితుడయాడు. అదే క్షణంలో భూమి కంపించటమూ, ఆకా



శాన తోకచుక్క కనబడటమూ, ప్రచండంగా గాలి వీచటమూ, శోణపురం మీద రక్తవర్షం కురవటమూ, మొదలైన ఉత్పాతాలు కలిగాయి.

వాటిని చూసి కుంభాండుడు బెదిరిపోయి, తనలో, "ముడులోకాలనూ గెలిచి, తన ఎదట నిలిచేవాడు లేకుండా చేసుకున్న బాణుడు, గర్వాతిశయం కొద్దీ యుద్ధం వరంగా తెచ్చుకున్నాడు. ఎంత పొరపాటు! ఇది ఇతని నాశనానికే వచ్చింది. ఎంత మంచివాడిలోనైనా రాక్షసబుద్ధి రాక్షసబుద్ధే! ఈ ఉత్పాతాలన్నీ ఊరికే పోతాయా? శివుడూ, కుమారస్వామీ నగరాన్ని రక్షిస్తున్నప్పటికీ వరం మూలాన లభించిన యుద్ధం తప్పదు. అయితే బాణుణ్ణి ఎదిరించి నిలబడగల వాళ్ళు లేరు—దేవతల పరాజయం సహించలేని విష్ణువు తప్ప," అనుకున్నాడు.

బాణుడు మాత్రం నిశ్చింతగానూ, ఉత్సాహంగానూ, సమస్త భోగాలలోనూ మునిగితేలుతూ, విష్ణువుతోనైనా సరే యుద్ధం చెయ్యటానికి సంసిద్ధుడై ఉన్నాడు.

బాణుడికి ఉష అనే కుమార్తె ఉన్నది. చంద్రుడి కళలే స్త్రీ రూపం ధరించాయా అనిపించేటంతటి సౌందర్యవతి. ఆమెకు చెలికత్తె అయిన చిత్రరేఖ కుంభాండుడి కూతురు. తండ్రి ఆదేశించిన మీదట ఉష తనకు తగిన భర్త లభించాలని పార్వతీ దేవిని ప్రార్థిస్తూ ఉండేది.

ఇంతలో చైత్రమాసం వచ్చింది. శోణ నగరంలోనే ఉంటున్న శివుడు పార్వతితో కూడా వసంతవిహారాలు చేయ నిశ్చయించి, అనేకమంది అప్సరసలనూ, గంధర్వ స్త్రీలనూ రప్పించాడు. స్త్రీలను పార్వతి రూపాలు ధరించమన్నాడు. ప్రమథగణాలను శివశక్తి రూపాలు ధరించమన్నాడు. అందరూ కలిసి శోణపురం వెలపల, మందాకినీ నది ఒడ్డున గల తోటలలో ఆటలూ,





ఈ విధంగా ఉష తన మనస్సులో అనుకోవటం పార్వతి గ్రహించి, చెయ్యి ఊపి ఆమెను తన దగ్గిరికి పిలిచి, "బాలా, నీ మనసులో ఉన్న ఆలోచన సరిఅయినదే. కన్యలు భర్తల కోసం తపించటం తప్పు కాదు. త్వరలోనే నీకు భర్త దొరుకుతాడు. శివుడితో నేను పొందే సౌఖ్యాన్ని నువు కూడా పొందుతావు. అది ఎలా జరిగేదీ చెబుతాను, విను. వచ్చే వైశాఖ శుద్ధద్వాదశి రాత్రి నువు నిద్రపోతూండగా ఒక పురుషుడు కలలో వచ్చి నిన్ను కలుస్తాడు. అతనే నీకు కాబోయే భర్త," అన్నది.

వినోదాలూ, వేడుకలూ సాగించారు. నృత్య గానాలు సాగాయి.

మహా ఉల్లాసంగా సాగే ఈ వినోదాల మధ్య శివపార్వతులు ఆలింగనం చేసుకోవటం ఉష చూసింది. వెంటనే ఆమెకు తన భర్తను తాను కౌగలించుకునే అదృష్టం ఎప్పుడు కలుగుతుందా అనిపించింది. తన కేమి లోటు? తన తండ్రి మూడు లోకాలూ ఏలేవాడు. సాక్షాత్తూ పార్వతీదేవే తన ఇలవేల్పు. తనకు తగిన భర్తను ప్రసాదించమని తాను పార్వతిని నిత్యమూ ప్రార్థిస్తున్నది. అయినా తన కోరిక ఎందుకు తీరటం లేదు?

ఉష సంతోషంతోబాటు సిగ్గుపడుతూ, పార్వతికి మొక్కి వెళ్ళిపోయింది.

పార్వతి చెప్పినట్లే జరిగింది. ఒకనాటి రాత్రి ఉష తన చెలికత్తెలతో సహా మేడ మీద సుఖనిద్రలో ఉండగా ఆమెకు కల వచ్చింది. అందులో ఒక మన్మథాకారుడు ఆమెను సమీపించి, నవ్వుతూ ఆమెను పలకరించి, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని, ఆమెను కౌగలించుకుని, సుఖాలలో ముంచి ఎత్తాడు.

ఉష అదిరిపాటుతో నిద్ర లేచింది. కళ్ళు తెరిచి చూస్తే ఎవరూ లేరు. కాని జరిగినది కలలాగా లేదు, చాలా వాస్తవంగా ఉన్నది.



ఆమెకు భయమూ, సిగ్గూ కలిగాయి. ఆమె పార్వతీదేవి చెప్పిన మాట పూర్తిగా మరిచి పోయి, ఎవరో తన కన్యాత్వం భంగం చేశారనీ, తనకూ, తన తండ్రి వంశానికి అపకీర్తి వచ్చిందనీ దిగులుపడి, పెద్దగా ఏడవసాగింది.

చెలికత్తెలందరూ నిద్రలేచి ఆమె చుట్టూ మూగారు. చిత్రరేఖ ఆమె పక్కనే కూర్చుని, ఆమె తలను తన రొమ్ముకు అదుముకుని, "చెలీ, భయపడకు. ఎందు కేడుస్తున్నావు? నీ మనసును కష్టపెట్ట సాహసించే వాళ్ళెవరు? నీ తండ్రి బాణుడు కాడా!" అంటూ కన్నీరు తుడిచి ఓదార్చింది.



ఉష తనకు వచ్చిన కల చెప్పి, అది కల అనటానికి వీల్లేదనీ, తనకు తీరని కళంకం చుట్టుకున్నదనీ, తాను కులటనై పోయాననీ అన్నది. అప్పుడు చిత్రరేఖ ఉషకు పార్వతి చెప్పిన మాటలు జ్ఞాపకం చేసి, "ఇవాళ వైశాఖ శుద్ధ ద్వాదశి. ఈ రాత్రి నీకు కలలో కనిపించినవాడే నీకు భర్త అవుతాడని దేవి చెప్పలేదా? సంతోషించక దిగులు పడతావేమిటి?" అన్నది.

వెంటనే ఉష ముఖం మబ్బు తొలగిన చంద్రుడిలాగయింది. "చిత్రరేఖా, నా దిగులంతా ఒక్క క్షణంలో పోగొట్టేశావు. నా అదృష్టంపండే ఉపాయంకూడా నువే చెయ్యి. వర్ణించలేను గాని, అతని ఆకారం కళ్ళకు కట్టినట్టే ఉంది. అతన్ని నువే వెతకాలి. నా భాగ్యమంతా నీ చేతిలోనే ఉన్నది," అన్నది.

"దానికేం? నే నున్నదే నిన్ను సుఖ పెట్టటానికి కద. అతన్ని తీసుకు రావటం ఒక సమస్య కాదు. ముందు అత నెవరైనదీ తెలియాలి. అది తెలుసుకోవటానికి సాధన మేమిటా అని ఆలోచిస్తున్నాను. నువేమో అతన్ని వర్ణించలేనంటున్నావు. నేనేమో అతన్ని చూడకపోతిని," అన్నది చిత్రరేఖ.

ఉష కళ్ళ నీళ్ళు నింపుకుంటూ, "ఎవరి పనులు వారు చేసుకోవటం సరిఅయినది. ఇంకొకరి పని చెయ్యటం కష్టం. నువు నా ప్రాణం లాంటి దానివి. నిజం చెబుతున్నాను, నువు దయదలచని పక్షంలో నిశ్చయంగా నేను చచ్చిపోతాను," అన్నది.

చిత్రరేఖ ఆమెతో, "ఎందుకు నీకు విచారం? నాకు కాస్త వ్యవధి ఇయ్యి. నీ ప్రియుణ్ణి ఏదో విధంగా తెస్తాను. లోకేశ్వరి అయిన పార్వతీదేవే నిన్ను కటాక్షించి ఉండగా నీ కోరికలు తీరటానికి సందేహమేమిటి?" అన్నది.

చిత్రరేఖ మిగిలిన చెలికత్తెలతో, "మీరు ఉషను కనిపెట్టి ఉండండి," అని చెప్పి, ఏకాంతంగా కూర్చుని, రంగులూ, కుంచెలూ తీసుకుని, ఒక వారంరోజుల లోపల ప్రపంచంలోగల ప్రముఖ పురుషులందరి చిత్రపటాలూ గీసింది. ఎవరెవరు ఎలాటి దుస్తులు ధరించేదీ, ఎలాటి ఆభరణాలు పెట్టుకునేదీ ఆ చిత్తరువులలో సరిగా చిత్రించింది. తరవాత ఆమె ఆ చిత్రపటాలన్నిటినీ ఉష వద్దకు తీసుకుపోయి, "చెలీ, సృష్టిలో ఉండే ప్రముఖుల నందరినీ కష్టపడి చిత్రించి తీసుకువచ్చాను. వీరిలో నీకు కలలో కనిపించిన వాడెవడో చూసి చెప్పు. ఈ పటాలలో దేవదానవమానవ ముఖ్యులందరూ ఉన్నారు," అన్నది.

ఉష ఒక్కొక్క చిత్తరువే చూసి పక్కన పెడుతూ యాదవ ప్రముఖుల దగ్గిరికి వచ్చేసరికి కృష్ణుడి పటం చూసి ఆశ్చర్యపడింది. తరవాత ప్రద్యుమ్నుడి పటం చూసి మరింత ఆశ్చర్యపడింది. ఎందుకంటే ఇద్దరిలోనూ అనిరుద్ధుడి పోలికలున్నాయి. అటుతరవాత ఆమె అనిరుద్ధుడి పటం తీసుకుని తనను తానే మరచిపోయింది. ఆమె దానిని పక్కన పెట్టలేదు. ఉష కలలో కనిపించిన వాడు అతనేనని చిత్రరేఖ గ్రహించింది.





# కృష్ణావతారం

ఉష చూపులు అనిరుద్ధుడి పటం మీద లగ్నమైపోవటమూ, ఆమెకు కలిగిన గగుర్పాటూ గమనించి చిత్రరేఖ చిరునవ్వు నవ్వుతూ, "నీకు కలలో కనిపించినవాడెవడో తెలిసిపోయిందిలే. అతను ఎక్కడ, ఏస్థితిలో ఉన్నాసరే, నేను వెళ్ళి అతన్ని తీసుకువచ్చి నీకు అప్పగిస్తాను. ఆ తరవాత నీయిష్టం," అన్నది.

ఉష చిత్రరేఖను చూసి, "నీ నేర్పు ఎలాటిదోగాని, నువు రచించిన ఈ చిత్తరువు చూస్తూంటే, కలలో ఇతన్ని చూసినప్పుడు కలిగిన భావాలన్నీ మళ్ళీ కలిగాయి. ఇతనిది ఏ వంశం? పేరేమిటి? ఎలాటివాడు? ఏం చేస్తూఉంటాడు? దయవుంచి కాస్త చెబుదూ!" అన్నది.

దానికి చిత్రరేఖ, "ద్వారకా నగరాన్ని ఏలే కృష్ణుణ్ణి గురించి నువు వినే ఉంటావు. శివుడి కంటిమంటకు ఆహుతి అయిన మన్మధుడే కృష్ణుడికి ప్రద్యుమ్ను డనే కొడుకుగా పుట్టాడని చెబుతారు. ఇతను ఆ ప్రద్యుమ్నుడి కొడుకు. పేరు అనిరుద్ధుడు. అతని శౌర్యం జగత్ప్రసిద్ధమయినది. అటువంటి వాణ్ణి భర్తగా పొందగలిగితే నీ అదృష్టాన్ని పొగడటం ఆదిశేషుడికి కూడా సాధ్యంకాదు. మన ఈ శోణపురం లాగే ద్వారకానగరం కూడా పరులకు చొరరానిది. అయినప్పటికీ, నీకు సంతోషం కలగగలందులకు, నేను ఏదో ఒక ఉపాయం చేసి అక్కడికి పోతాను. నీ ప్రియుణ్ణి తప్పక తీసుకువస్తాను," అన్నది.

25. ఉషా అనిరుద్ధుల వివాహం



"నీకు ఉపాయాలకు లోటా? యోగ విద్య ఎరిగినదానివి; కామరూపమూ, కామ గమనమూ కలదానివి; ఎలాటి పని అయినా సాధించగలవు. ఈ అనిరుద్ధుడి ముఖం నా కళ్ళపడితేనే గాని బతకను. నా ప్రాణాలు కాపాడు. ఇప్పటికే ఏడు రోజులు ఓర్చుకున్నాను. ఇక ఒక్క ఘడియకూడా ప్రాణాలు నిలపలేను," అని ఉష అన్నది.

చిత్రరేఖ ఉషను కౌగలించుకుని, "నువు వెళ్ళి మిగిలిన చెలికత్తెలతో కాలక్షేపం చేస్తూ ఉండు," అని ఆమెను పంపేసి, తాను ఆకాశంలోకి ఎగిరి అంతర్ధానమయింది. అలా అంతర్ధానమైన చిత్రరేఖ మనోవేగంతో ఒక్క క్షణంలో ద్వారక చేరి, తరవాత ఏం చెయ్యాలా అని చూస్తూండగా, ఒక కొలను దగ్గిర నారదుడు కనిపించాడు. చిత్రరేఖ ఆయనను సమీపించి, నమస్కరించింది.

నారదుడు చిత్రరేఖను దీవించి నవ్వుతూ, "ఏమిటి ఇలా వచ్చావు?" అని అడిగాడు.

చిత్రరేఖ ఆయనకు, పార్వతీదేవి ఉషకు చెప్పిన మాటలూ, ఆ ప్రకారమే ఉషకు కలలో అనిరుద్ధుడు కనిపించటమూ, తాను అనిరుద్ధుణ్ణి తీసుకుపోయి ఉష వద్ద చేర్చటానికి రావటమూ చెప్పి, "అనిరుద్ధుణ్ణి నేను తీసుకుపోతే బాణుడు ఎలాగూ ఆగ్రహించి, అతనిపై తన ప్రతాపమంతా చూపుతాడు. అందుచేత మీరు కృష్ణుడికి ఈ విషయం కాస్త చెప్పటం అవసరం. బాణుడికీ, కృష్ణుడికీ యుద్ధం జరిగితే ఎలాగూ కృష్ణుడు గెలుస్తాడు. ఆ విషయం నాకు భయంలేదు. నాకు ప్రస్తుతం భయమల్లా, నేను తన మనమణ్ణి తీసుకుపోయానని తెలిసి, కృష్ణుడు నన్ను శపిస్తాడేమో నని. మీరు దయచేసి నాకు కృష్ణుడి భయం లేకుండా చేస్తే మా ఉషాకన్య కోరిక ఈడేరుతుంది," అన్నది.

నారదుడు చిత్రరేఖకు తామసి అనే విద్య ఉపదేశించి, "ఈ విద్యద్వారా నీపని సానుకూలం అవుతుంది. నువు అనిరుద్ధుణ్ణి తీసుకుపోయిన కారణంగా బాణుడితో యుద్ధం జరిగినప్పుడు నే నక్కడికి వచ్చి యుద్ధం నిలుపుచేస్తాను," అని తనదారిన తాను వెళ్ళిపోయాడు.

చిత్రరేఖ అదృశ్యరూపంలో కృష్ణుడి భవనాన్నీ, ప్రద్యుమ్నుడి భవనాన్నీ దాటి, అనిరుద్ధుడి మందిరం చేరి, బంగారు లోటాలతో మధువు తాగుతూ అనేకమంది స్త్రీల మధ్య కూర్చుని ఉన్న అనిరుద్ధుణ్ణి చూసింది. అతన్ని రంజింపజెయ్యటానికి సౌందర్యవతులైన స్త్రీలు ఆడుతున్నారు, పాడుతున్నారు. కాని చిత్రరేఖ అతని కేసి పరీక్షగా చూసి, అతని మనసు అన్యాయత్తంగా ఉండటం గమనించింది. అతను నవ్వితే అది తెచ్చిపెట్టుకున్న నవ్వులాగున్నది, మాట్లాడితే గొంతు గద్గదంగా విని పిస్తున్నది. అతని ఏ చేష్టలోనూ పూనిక అన్నది లేదు.

"కొంపతీసి ఇతను కూడా ఉష లాగే కలగనలేదు కద! ఇతని మనసును చెదరగొట్టగల అందం ఉషకు కాక మరెవతెలో ఉంటుంది? పార్వతీదేవి అనుగ్రహం వల్ల ఏదైనా సాధ్యమే," అనుకున్నది చిత్రరేఖ.





ఆమెకు అతనితో మాట్లాడాలనిపించింది. నారదుడు తనకు ప్రసాదించిన విద్యద్వారా ఆమె అక్కడ ఉన్న మిగతావాళ్ళందరినీ మూర్ఛపుచ్చి, అనిరుద్ధుణ్ణి సమీపించి, అతని ఎదట ప్రత్యక్షమై, చేతులు జోడించి, ఇలా అన్నది:

"బలిమహారాజు కొడుకు బాణుడు. ఆయనకు పార్వతీదేవి అనుగ్రహంవల్ల ఒక కుమార్తె కలిగింది. ఆమె పేరు ఉష. ఆమె త్రిలోకైక సుందరి. ఆమె చక్కదనాన్ని బ్రహ్మ కూడా వర్ణించలేదు, నావల్ల ఏమవుతుంది? ఉషాకన్య ఒక రాత్రి నిద్రలో నిన్ను చూసి, అప్పటినుంచీ విరహబాధతో సతమత మవుతున్నది. నే నామె చెలికత్తెను, చిత్రరేఖ అనేదాన్ని. నీకు సమ్మతమయిన పక్షంలో నా వెంట నిన్ను తీసుకుపోవచ్చాను. మీ రిద్దరూ ఒకరి కోసం ఒకరు పుట్టారు, సందేహంలేదు. ఇదంతా దైవ ఘటన. ఇలా జరుగుతుందని పార్వతీదేవి ముందే చెప్పింది. నేను నీ పటం తయారు చేసి చూపి, ఆశరేకెత్తించకపోతే మా ఉష ఏమైఉండేదో! అనేక మంది భార్యలు గల నీ దారి వేరు. నీ కోసమే అలమటిస్తున్న మా ఉషను కాపాడు. నేను నీకు నమస్కారం చేసి వేడుకుంటున్నాను."

ఈ మాటలు విని అనిరుద్ధుడు, "ఏం చెప్పేది? మీ చెలి కన్న కలే నాకూ వచ్చింది. అది మొదలు నాకు ఏది రాత్రో, ఏది పగలో తెలియటంలేదు. నిద్ర అనేది ఎరగను. నాపాలిటి దేవతలాగా నువు రాకపోతే నాకు ఏం చెయ్యాలో కూడా తెలియదు. నన్ను నువు వేడుకోనవసరంలేదు. ఉష దగ్గిరికి నన్ను నువు తీసుకుపో, నేను వస్తాను," అన్నాడు.

ఈ మాటకు చిత్రరేఖ చాలా సంతోషించింది. ఆమె అతని చెయ్యి పట్టుకుని ఆకాశంలోకి లేచి, తనతోపాటు అనిరుద్ధుణ్ణి కూడా అదృశ్యమయేటట్టు చేసింది. మరు



క్షణంలో వాళ్ళిద్దరూ శోణపురంలోని ఉష మందిరంలో ఉన్నారు.

ఉషా అనిరుద్ధులు ఒకరి నొకరు ప్రత్యక్షంగా చూసుకున్నారు. ఇద్దరూ ఆనంద పారవశ్యం చెందారు.

"ఇదుగోనమ్మా, నీ ప్రియుడు. నామాట చెల్లించుకున్నాను. ఇతనికి నీ చెయ్యి ఇచ్చి పాణిగ్రహణం చెయ్యి. గాంధర్వ వివాహం రాజులకు తగినది. దీనికి పార్వతీదేవి కటాక్షం కూడా తోడయింది. ఇక మీరు భార్యాభర్తలు," అంటూ చిత్రరేఖ ఉషను కౌగలించుకుని, ఇద్దరికీ కొత్తబట్టలూ, పూల దండలూ, ఆభరణాలూ ఇచ్చింది. అనిరుద్ధుడు ఉష చేతిని తన చేతిలోకి తీసుకుని పాణిగ్రహణం చేశాడు.

కొన్నాళ్ళు ఉషా అనిరుద్ధులు దాంపత్య సుఖం అనుభవిస్తూ గడిపిన మీదట, వారి రహస్యం అంతఃపురపు కావలివారికి తెలిసింది. వాళ్ళు వెళ్ళి బాణుడితో చెప్పారు. ఎవరో ఒక మానవమాత్రుడు, తన ఖ్యాతినీ, పరాక్రమాన్నీ లక్ష్యపెట్టకుండా, తన యింట ప్రవేశించి, తన వంశానికి మణిపూసలాటి తన కుమార్తెను కళంకపరిచాడనేసరికి బాణుడికి ఆగ్రహం వచ్చింది.

"మీరు వెంటనే వెళ్ళి ఆ దుర్మార్గుణ్ణి పోనీక, చుట్టుముట్టి పట్టుకోండి. నాకు పరాభవంచేసి దేవతలు కూడా ప్రాణాలతో తప్పించుకోలేరు," అని బాణుడు తన భటులను హెచ్చరించాడు. వెంటనే కొన్ని వేలమంది రాక్షస కింకరులు కత్తులూ, బాణాలూ పట్టుకుని ఉష అంతఃపురం మీద పడ్డారు.

ఆ కలకలం విని అనిరుద్ధుడు మేడ పైభాగం నుంచి, భవనాన్ని చుట్టుముట్టి కేకలుపెట్టుతున్న రాక్షసభటులను చూసి, ఒక్క క్షణంలో పోరాటానికి సిద్ధమయే సింహంలాగా అయిపోయాడు.





ఈ లోపల ఉష కన్నీరు కార్చుతూ, చేతులు నలుపుకుంటూ, "కన్యలు చేయ కూడనిపని చేశాను. కులనాశకురాలినీ, కులటనూ అయాను. మూడు లోకాలనూ ఏలే తండ్రికి శత్రువునయాను. వెలలేని మాణిక్యంలాటి రాజకుమారుడికి చిక్కు తెచ్చిపెట్టాను. జగదంబ ఇచ్చిన వరం కూడా వృథా పోయేటట్టున్నది. నేనేం చేసేది? అదృష్టదేవతలారా, ఈ అపద తప్పించలేరా?" అంటూ ఆక్రోశించింది.

ఆమెను చూసి అనిరుద్ధుడు చిరునవ్వు నవ్వుతూ, "పిచ్చిదానా, నా పరాక్రమం నీకు తెలీదు. మీ తండ్రి బలగం మాట చెప్పకు, ఫాలాక్షుడు ప్రమథగణాలతో వచ్చినా గెలవగలను. నా శత్రువులను నా పిడికిళ్ళతో పొడిచి, నవరంధ్రాలా నెత్తురు కక్కించి, ఈ నగరానికి శోణపురం అనే పేరు సార్థకమయేటట్టు చేస్తాను, కిటికీ దగ్గిర నిలబడి చూస్తూ ఉండు. భయపడ వలసిన పనిలేదు," అన్నాడు.

ఇలా అంటూనే అతను అంతఃపుర ద్వారం వద్ద ఉన్న పరిఘ ఒకటి తీసుకుని, రాక్షసుల పైకి వెళ్ళాడు. ఈ సమయంలో నారదుడు వచ్చి, ఆకాశాన నిలబడి వినోదం చూడసాగాడు.

రాక్షసులు అనిరుద్ధుడి మీద బాణాలూ, గదలూ, తమ వద్ద ఉండే సమస్త ఆయుధాలూ ప్రయోగించారు. కాని అతను వాళ్ళను లక్ష్యపెట్టక, తన చేతనున్న పరిఘతో రాక్షసులను ఎడాపెడా చదమ సాగాడు; చేతికి అందిన వాళ్ళను పిడికిలితో పొడిచాడు. రాక్షసులలో కొందరు చచ్చారు. కొందరు గాయపడ్డారు. మిగిలినవాళ్ళు పారిపోయి బాణుడి ఎదట నిలబడ్డారు. బాణుడు వాళ్ళను చూసి కోపంతో నానా మాటలూ అన్నాడు:

"శత్రువుకు విజయం ధారపోసి, ప్రాణాలమీది తీపితో పారిపోయి వచ్చారా?



శౌర్యపరాక్రమాలు పారిపోయి రావటానికా? ఒకప్పుడు మీ మీద ఆధారపడి లోకాలు జయిస్తినే! నా కెంత అవమానం తెచ్చి పెట్టారు! పదండి, మీ వెనకనే రథగజ తురగపదాతులనూ, యోధులనూ పంపు తున్నాను. శత్రువు హతమారితీరాలి,'' అంటూ బాణుడు కాలకేయులనే రాక్షసు లను అనిరుద్ధుడి పైకి పంపాడు. వాళ్ళు భూమ్యాకాశాలు ఆక్రమించి అతడి పైకి యుద్ధానికి వచ్చారు.

రాక్షసులు తన మీదికి యుద్ధానికి వస్తూ ఉండటం గమనించి అనిరుద్ధుడు ఒక కత్తీ, డాలూ తీసుకుని రాక్షసుల పైకి వెళ్ళి, తన కత్తితో శత్రుబలాలను ఊచకోత కొయ్య నారంభించాడు. తాను ఒంటరి అయి ఉండి కూడా, అనేక వేల సంఖ్యగల రాక్ష సులతో తలపడి అనిరుద్ధుడు మెరుపులాగా యుద్ధం చేస్తుంటే నారదుడికి ఆ యుద్ధం అద్భుతంగా కనిపించింది. ఆయన ఎందరో మేటి వీరులు పోరాడుతూండగా చూశాడు. అనిరుద్ధుడిలాగా శత్రువులకు దిగ్భ్రమ కలిగించేలాగా యుద్ధం చేసినవాడు ఒక్కడూ లేడు.

బాణుడు పంపిన రాక్షసులు కొందరు చచ్చారు, కంగారులో ఒకరి నొకరు తొక్కు తున్నారు, కొందరు పారిపోసాగారు. అని రుద్ధుడు పెడబొబ్బలుపెడుతూ వాళ్ళను తరిమికొట్టాడు.

అనిరుద్ధుడి చేత చావుదెబ్బలు తిని పారి పోయి వచ్చిన తన యోధులను చూసేసరికి బాణుడికి ఏదో సంకోచంలాటిది బయలు దేరింది. తన చేతి దెబ్బతిని, ప్రాణాలతో విడిచిపెట్టబడిన ఇంద్రాదులు ఇప్పటికీ తన పేరు చెబితే వణికిపోతారు. అటు వంటిది ఒక అనామకుడు తన బలాలను ఎదిరించి జయించాడు! అది చూసి బాణుడు తానే అనిరుద్ధుడితో యుద్ధం చెయ్యటానికి బయలుదేరాడు.





# కృష్ణావతారం

బాణుడి రథం వెయ్యి మూరల నిడివిగలది. దానికి వెయ్యి గుర్రాలు పూన్చివున్నాయి. రథం ఎలుగుబంటి తోలు కప్పి ఉన్నది. దానికి ఒక ఎర్రజెండా, నెమలి పతాకా ఉన్నాయి. ఆ రథం నిండా గదలూ, విల్లులూ, ఖడ్గాలూ, శక్తులూ పెట్టుకుని కుంభాండుణ్ణి సారథిగా చేసుకుని, బాణుడు అనిరుద్ధుడి పై యుద్ధానికి బయలుదేరాడు. అది చూసి అతని సేనాపతు లందరూ ఉత్సాహం తెచ్చుకుని, తమ సేనలను బాణుడి రథానికి ముందూ, పక్కలా నడిపించుకుంటూ వచ్చారు.

అనిరుద్ధుడు తన పైకి వచ్చే బాణుణ్ణీ, అతని ఆయుధాలనూ, అతని చుట్టూ గల బలాలనూ చూసి ఏమాత్రం లక్ష్యపెట్టక, సూటిగా బాణుడి రథం కేసి ఎదురు రానారంభించాడు.

ఒక సామాన్య మానవుడు, అందులోనూ ఆయుధాలు విశేషంగా లేనివాడు, తన పైకి ధైర్యంగా వస్తూ ఉంటే బాణుడికి ఆశ్చర్యం కలిగింది. అతను తన రాక్షస సైనికులతో, "చూస్తారేం? వాణ్ణి పట్టుకోండి! చంపి పారెయ్యండి!" అంటూ అనిరుద్ధుడి పై బాణవర్షం కురిపించాడు.

చేత ఒక్క కత్తి మాత్రమే గల అనిరుద్ధుడు ఆ బాణాలను లక్ష్యపెట్టక, తనకు అడ్డంగా వచ్చే రాక్షసులను తోసుకుంటూ బాణుడు ఎక్కివున్న రథాన్ని చేరుకున్నాడు. అది చూసి బాణుడి పరివారం నిర్ఘాంతపోయింది.





భూమిలో దిగబడి పోయింది. బాణుడు ధ్వజస్తంభాన్ని పట్టుకుని కూలిపోయాడు.

కుంభాండుడు బాణుడికి స్పృహ వచ్చేటట్టు చేసి, "శత్రువు అసామాన్య ప్రతిభావంతుడు. ప్రపంచ మంతా ఎత్తి వచ్చినా లక్ష్య పెట్టేటట్టు కనపడడు. అతడి సాహసమూ, ధైర్యమూ చూశావా? ఇతన్ని గెలవటం తేలిక కాదు. ముందు నీ ప్రాణాలూ, నా ప్రాణాలూ దక్కే ఉపాయం చూడకపోతే ఇతను రాక్షసకులానికే ఎసరు పెట్టేటట్టున్నాడు," అన్నాడు.

బాణుడు తన మంత్రితో, "గరుత్మంతుడు పామును పట్టినట్టుగా ఈ క్షణంలోనే ఈ మూఢుణ్ణి పట్టేస్తాను చూడు," అంటూ అదృశ్యుడై పోయి, తన కోసం దిక్కులు చూస్తున్న అనిరుద్ధుడి పైన కృష్ణ సర్ప ముఖాలు గల బాణాలు వేసి, అతని అవయవాలన్నీ బంధించి, కదలకుండా చేశాడు. తరవాత అతను కుంభాడుడితో, "యౌవన గర్వితుడైన ఈ దుర్మార్గుడు ఇప్పుడు మనకు చిక్కాడు. వీణ్ణి వెంటనే కత్తికి బలి చేద్దాం. లేకపోతే వీడు తెచ్చి పెట్టిన కళంకం మాయదు," అన్నాడు.

ఆ మాటకు కుంభాడుడు, "అదినిజమే గాని, ఒక్క విషయం గమనించాలి.

రథాన్ని సమీపిస్తూనే అనిరుద్ధుడు రథపు గుర్రాలను చంపసాగాడు. రక్తం ఏరులై పారింది. ఈ లోపల బాణుడు అనిరుద్ధుడి పై అనేక ఆయుధాలు విసిరాడు. అనిరుద్ధుడు చచ్చాడనుకుని రాక్షసులు పెడబొబ్బ పెట్టారు. అయితే అనిరుద్ధుడు ముందుకు రాలేకపోవటం మాత్రమే జరిగింది.

ఇంతలో బాణుడు అనిరుద్ధుడి పైకి మహాశక్తిని విసిరాడు. అనిరుద్ధుడు దాన్ని చేత్తో పట్టుకుని, బలంకొద్దీ బాణుడి పైకే విసిరేసరికి, అది బాణుడి గుండెలను చీల్చుకుని, వీపులోనుంచి బయటికి వచ్చి,







ఇతను మన ఉషకు గాంధర్వ వివాహం ద్వారా ఇదివరకే భర్త అయి ఉన్నాడు. ఇతనికి ఏదన్నా జరిగితే అమ్మాయికి తీరని దుఃఖం కలిగి తీరుతుంది. అసలు ఇతను ఎక్కడి నుంచి వచ్చాడో, ఎవడో తెలుసు కోవలసిన అవసరం ఉన్నది. ఇతను మామూలు మనిషి మటుకు కాడు. ఇతని అందమూ, పరాక్రమమూ చూస్తే దేవత లను మించి ఉన్నాడు. ఇతను తప్పక చాలా గొప్పవాడే అయి ఉంటాడు. నీ వంటి మహా వీరుడితో ఎలా యుద్ధం చేస్తానా అన్న జంకు అతనిలో ఏ మాత్రమైనా కన బడిందా? అసహాయుడైపోయి కూడా అతని ముఖాన క్రోధం ఎట్లా తాండవిస్తు న్నదో చూడు! నీ కింతకన్న మంచి అల్లుడూ, అమ్మాయికి ఇంతకన్న మంచి భర్తా, నీ కింతకన్న మంచి ప్రత్యర్థీ దొరుకు తాడా? కాస్త ఆలోచించు," అన్నాడు.

కుంభాడుడి మాటలలో నిజం ఉన్నట్టే బాణుడికీ తోచింది. బాణుడు, "అదీ నిజమే," నన్నట్టు తల ఆడించి, అనిరుద్ధు డికి భటులను కావలి ఉంచి, తన ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు.

అప్పుడు నారదుడు అనిరుద్ధుణ్ణి సమీ పించి, ఊరడించి, "నేను వెళ్ళి కృష్ణుణ్ణి తీసుకు వస్తాను. అతని రాకతో నీ కష్టా లన్నీ విచ్చిపోతాయి. అంతదాకా ఈ వచ్చిన కష్టాన్ని ధైర్యంగా ఓర్చుకో," అని చెప్పి, వెళ్ళిపోయాడు.

అనిరుద్ధుడు తల ఎత్తి చూసే సరికి, కన్నీరు కార్చుతూ ఉష కిటికీ వద్ద కని పించింది. అతను ఆమెతో, "నీ తండ్రి నాతో ముఖాముఖి యుద్ధం చెయ్యలేక, మాయోపాయంతో నన్ను బంధించాడు. అయినా విచారంలేదు. నా కష్టం తొలగించ కలవాడు కృష్ణుడున్నాడు. తన సుదర్శన చక్రంతో ఎందరో రాక్షసులను నిర్మూ లించినవాడు నాకు జరిగిన ఈ పరాభవాన్ని







సహిస్తాడా ? ఎందుకు దిగులు పడతావు ? నీ తండ్రికి మంచిరోజులు చెల్లిపోయాయి," అని చెప్పాడు.

తరవాత అతను దుర్గను స్తోత్రం చేసి ధ్యానించసాగాడు. కొంతసేపటికి లోకేశ్వరి అయిన దుర్గ అతని ఎదట ప్రత్యక్షమై, అతన్ని బంధించిన బాణాల పంజరాన్ని చేత్తో తాకి భగ్నం చేసి, అతన్ని బంధ విముక్తుణ్ణి చేసి, "త్వరలోనే కృష్ణుడు వచ్చి, బాణుడితో యుద్ధం చేసి ఓడించి, నిన్ను తీసుకు పోతాడు. నీకు శుభం చేకూరుతుంది," అని చెప్పి అంతర్ధాన మయిపోయింది.

ఈ లోపల ద్వారకలో చాలా గందర గోళం జరిగింది.

చిత్రరేఖ అనిరుద్ధుణ్ణి తీసుకు పోయాక అనిరుద్ధుడి భార్యలు స్పృహ తెలిసి, తమ భర్త జాడ తెలియక, పెద్ద పెట్టున శోకాలు పెట్టసాగారు.

అనిరుద్ధుడి మందిరం నుంచి స్త్రీల ఆర్తనాదాలు వెలువడటం విని నగరంలోని యాదవ ప్రముఖులు తమ తమ ఇళ్ళలో నుంచి బయటికి వచ్చేసరికి, సభాభవనంలో భేరీ మోగింది. త్వరలోనే కృష్ణ బల రాములు మొదలుగా అందరూ సభలో చేరారు. అనిరుద్ధుడు కనిపించటం లేదని తెలిసి అందరూ విచారగ్రస్తులయారు. కృష్ణుడు సైతం కంట తడిపెట్టాడు.

అది చూసి వికద్రుడు కృష్ణుడితో, "నీ చాటున యాదపవంశం క్షేమంగా ఉన్నది. దేవేంద్రుడే తన క్షేమానికి నీ మీద ఆధార పడి ఉన్నాడు. అలాటప్పుడు నువు కంట తడిపెడితే, అనిరుద్ధుడు కనపడక పోవటం కంటె కూడా ఇది పెద్ద విచారం అవుతుంది. అందుచేత నువు అందరికీ ఏదన్నా ధైర్యం చెప్పు," అన్నాడు.

దానికి కృష్ణుడు, "నా విచారం అనిరుద్ధుడి జాడ తెలుసుకోలేకపోతే జనం







నన్ను ఏమంటారో సనే. చంటి పిల్లవాడుగా ఉండగానే ప్రద్యుమ్నుణ్ణి ఒక రాక్షసుడు ఎత్తుకు పోయాడు. ఆ రాక్షసుణ్ణి ప్రద్యుమ్నుడే చంపి తిరిగి రావటంతో నా పరువు కొంతవరకు దక్కింది. ఈ సారి కూడా అలాగే అయినట్టు కనబడుతుంది. నా శత్రువు లెవరో నా మీది కసితో ఈ పని చేశారు. ఇది సాధారణ ఘటన మాత్రం కాదు. ఏదైనా మార్గం ఉంటే చెప్పండి. దాన్ని అనుసరించి నా శక్తి కొద్దీ చెయ్య వలసినది చేస్తాను," అన్నాడు.

అప్పుడు సాత్యకి, వివిధ ప్రాంతాలకు మనుషులను పంపమని సూచించాడు. ఉగ్రసేనుడు ఆ సూచనను బలపరిచి, రథాలమీదా, గుర్రాలమీదా, కాలినడకనా, అనేక మందిని అనేక ప్రాంతాలకు పోయి, అనిరుద్ధుణ్ణి వెతకమని ఉత్తరు విచ్చాడు.

అనాధృష్టి అనే సేనాపతి కృష్ణుడితో జంకుతూ జంకుతూ, "అయ్యా, నా కొక అనుమానం ఉన్నది. దేవతలు చాలా సార్లు నీ వల్ల ఉపకారం పొందివున్న మాట నిజమే గాని, పారిజాతం తెచ్చినప్పుడు ఇంద్రుడు నీతో యుద్ధంచేసి ఓడిపోయాడు. ఆ అవమానం లోపల బాధిస్తూ ఉండ వచ్చు. ఇంద్రుడే అనిరుద్ధుణ్ణి మాయం చేశాడా అని నా అనుమానం," అన్నాడు.

కృష్ణుడు ఈ మాటకు నవ్వి, "దేవతలు ఇలాంటి పని ఒక్కనాటికీ చెయ్యరు. ఇది రాక్షసులు చేసే పని. నావల్ల తమకు ఉపకారం ఉన్నదని తెలిసిన దేవతలు ఇలాటి పని చెయ్యరు," అన్నాడు.

అక్రూరుడు కూడా కృష్ణుడి మాటను బలపరిచాడు.

"అనిరుద్ధుణ్ణి ఇలా దొంగిలించుకు పోవలసిన పని పురుషుల కుండదు. ఎవతో పాపాత్మురాలైన స్త్రీయే ఈ పని చేసి ఉండాలి. దైత్య, దానవ, దేవతా స్త్రీలకు ఎన్నో మాయలు తెలుసు. వాళ్లు ఎక్కడి





కైనా పోగలరు, ఎవరినైనా భ్రమ పెట్ట గలరు. కనక మనం ఆ జాడలను బట్టి వెతకాలి," అన్నాడు కృష్ణుడు.

కొన్ని రోజులయాక, అనిరుద్ధుణ్ణి వెతక బోయిన చారులు తిరిగి వచ్చి, తమ ప్రయత్నం విఫలమయిందని చెప్పారు.

ఆ మర్నాడు ఉదయం కృష్ణుడు సభకు వచ్చాడు. ఉగ్రసేనుడు మొదలైన యాదవు లందరూ సభ తీరి ఉండగా అక్కడికి నారదుడు వచ్చాడు. అతిథి మర్యాదలన్నీ పూర్తి అయాక నారదుడు అందరి కేసీ చూసి, "ఏమిటి మీరంతా పుట్టెడు విచారంలో మునిగి ఉన్నట్టున్నారు?" అన్నాడు.

"ఏం చెయ్యం? అనిరుద్ధుడు కని పించటం లేదు. అతని కోసం అంతటా వెతికించాం. కాని ఫలితం లేకపోయింది," అన్నాడు కృష్ణుడు.

"అన్నట్టు, ఇన్ని యుద్ధాలు చూశాను గాని, మీ అనిరుద్ధుడు బాణుడితో చేసిన యుద్ధం ఉందే అలాంటిది ఎక్కడా, ఎన్నడూ చూసి ఎరగను. అసలు ఏం జరిగిందంటే, ఆ బాణుడి కూతురు ఉష అనేది అనిరుద్ధుణ్ణి ప్రేమించి, చిత్రరేఖ అనేదాన్ని పంపింది. అది కాస్తా వచ్చి అనిరుద్ధుణ్ణి తీసుకుపోయి ఉషతో చేర్చింది.



ఈ సంగతి బాణుడికి తెలిసి అనిరుద్ధుడితో యుద్ధానికి వచ్చి, చావుదెబ్బ తిని, మాయా యుద్ధానికి దిగి, సర్పబాణాలతో అనిరుద్ధుణ్ణి కాస్తా బంధించాడు. అందుచేత నువు వెళ్ళి ఆ బాణుడి అంతు తేల్చుకో. బాణు డుండే శోణపురం ఇక్కడికి చాలా దూరం. అందుచేత ఏ గరుత్మంతుడి సహాయంతోనో వెళ్ళు. ఈ మాట చెప్పటానికే వచ్చాను. శలవు," అంటూ నారదుడు నిష్క్రమించాడు.

కృష్ణుడు గరుత్మంతుణ్ణి స్మరించాడు. గరుత్మంతుడు వచ్చాడు. వెంటనే కృష్ణుడూ, బలరాముడూ, ప్రద్యుమ్నుడూ గరుత్మంతుడి మీద ఎక్కారు. వాళ్ళు

శోణనగరం చేర వచ్చేసరికి వారి ముందు ఒక అద్భుతమైన వెలుగు కానవచ్చింది.

"కృష్ణా, ఈ వెలు గేమిటి?" అని బలరాముడు అడిగాడు.

"మనం ఇప్పుడు బాణుడి నగరాన్ని చేర వస్తున్నాం. శివుడు ఈ నగర రక్షణకు అగ్ను లన్నిటినీ నియోగించాడు. మనకు ఇప్పుడు ఎదురైనది ఆహవనీయాగ్ని. దీని సంగతి గరుత్మంతుడు చూసుకుంటాడులే," అన్నాడు కృష్ణుడు.

కృష్ణు డలా అంటుండగానే గరుత్మంతుడు ఆకాశగంగ నుంచి జలం పుక్కిట పట్టి అగ్నిపై చల్లి, దాన్ని ఆర్పేశాడు. కృష్ణుడు గరుత్మంతుణ్ణి పొగడాడు.

గరుత్మంతుడు మరికొంత ముందుకు పోయేసరికి, శివుడు నియోగించిన మిగిలిన అగ్నులు పెద్దపెట్టున సింహనాదాలు చేశారు. వాటిని విని బాణుడు యుద్ధ సన్నాహాలు ప్రారంభించాడు.

ఈలోపల అంగిరసు డనే అగ్ని, జ్యోతిష్టోముడూ, విభాంగుడూ అనే అగ్నులను ఇరు పార్శ్వాలా పెట్టుకుని, మిగిలిన అగ్ను లన్నిటితో సహా కృష్ణుడితో యుద్ధం చేయ వచ్చాడు.

కృష్ణుడు అతనితో, "ఓ అంగిరసుడా, మునులు వేల్చిన ఆహుతులు మెక్కి, కొవ్వి నా పైకి యుద్ధానికి వస్తున్నావా? పో అవతలికి!" అన్నాడు.

అంగిరసుడు కోపించి, "దీనితో నీ ప్రాణం తీస్తాను," అంటూ ఒక శూలం కృష్ణుడి పైన విసిరాడు. కృష్ణుడు దాన్ని తన బాణంతో దారిలోనే విరిచి, మరొక బాణంతో అంగిరసుడి రొమ్ము ఛేదించేసరికి, అంగిరసుడు నెత్తురు ఓడుతూ రథం మీద మూర్ఛపోయాడు. ఆ దెబ్బతో అగ్నులందరూ చెల్లాచెదరుగా పారిపోయారు.

వాళ్ళు అడ్డం తొలగగానే కృష్ణుడి కళ్ళ ఎదట శోణపురం కనడింది.





# కృష్ణావతారం

బాణుడి నగరాన్ని చూస్తున్న కృష్ణుడి దగ్గిరికి నారదుడు వచ్చి, "చూశావా, కృష్ణా? ఈ పట్టణాన్ని పార్వతీ సమేతుడైన శివుడు స్వయంగా కాపాడుతున్నాడు. అందుచేత నీకు కార్యసిద్ధి అయే మార్గం జాగ్రత్తగా చూసుకో," అన్నాడు.

దానికి కృష్ణుడు చిరునవ్వు నవ్వి, "మా పనికి ఈశ్వరుడే అడ్డపడినా సంతోషమే. మా శక్తి కొద్దీ మా ప్రయత్నం చేస్తామే గాని, వెనక్కు తిరిగి పోయి, కార్యహాని కానియ్యం," అన్నాడు.

ఇలా అంటూనే కృష్ణుడు నగరద్వారం వద్దకు వెళ్ళి, పాంచజన్యం పూరించాడు. ఆ నాదం చెవుల పడుతూనే బాణుడి సేనలు మహాసముద్రంలాగా వచ్చి పడ్డాయి. కృష్ణుడూ, బలరాముడూ, ప్రద్యుమ్నుడూ, గరుత్మంతుడూ కూడా విజృంభించి ఆ రాక్షససేనలను దారుణంగా చెండాడారు. చచ్చిన వాళ్ళు చావగా మిగిలిన వాళ్ళు నగరంలోకి పారిపోసాగారు.

అప్పుడు వాళ్ళను చూసి బాణుడు, "రాక్షసవీరులై పుట్టి, యుద్ధాలలో ఆరితేరి కూడా మీరిలా పారిపోయి వస్తున్నారా? నేను లేనా? నా మంత్రి కుంభాండుడు లేడా? ప్రమథగణాలు లేవా? మన ముందు ఈ శత్రువు ఎంత? ఆగండి! నిలవండి!" అన్నాడు. కుంభాండుడు కూడా వారిని హెచ్చరించాడు. కాని అందువల్ల ప్రయోజనం లేకపోయింది. రాక్షససేనలు ఆగకుండా పారిపోయాయి.

27. బాణుడి పరాభవం



ఈ విధంగా తన భక్తుడైన బాణుడికి కలిగిన అవమానం చూసి శివుడికి ఆగ్రహం వచ్చింది. ఆయన యుద్ధానికి సిద్ధమై, సింహాలు పూన్చిన రథం మీద వృషభ ధ్వజం ప్రకాశిస్తూండగా, నందిని సారథిగా పెట్టుకుని, కుమారస్వామిని కూడా వెంట బెట్టుకుని, ప్రమథవీరులు వెంట రాగా అట్టహాసంగా బయలుదేరాడు.

శివుడూ కృష్ణుడూ యుద్ధం ఆరంభించారు. ఆరంభంలోనే శివుడు కృష్ణుడిపైన నూరు బాణాలు వేశాడు. దానికి సమాధానంగా కృష్ణుడు ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. దాని నుంచి వేలకొద్దీ బాణాలు వెలువడి శివుడి రథాన్ని కప్పేశాయి. అప్పుడు శివుడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించేసరికి, చుట్టూ మంటలు పుట్టు కొచ్చి బాణాలన్నిటినీ తగల బెట్టేశాయి. ఆ తరవాత అవి తననూ, బలరాముణ్ణీ, ప్రద్యుమ్నుణ్ణీ, గరుత్మంతుణ్ణీ చుట్టు ముట్టుతూంటే కృష్ణుడు వారుణాస్త్రం వేసి ఆ జ్వాలలను చల్లార్చాడు.

అటు పైన శివుడు దారుణమైన అస్త్రాలను అయిదారింటిని ప్రయోగిస్తే వాటన్నిటినీ నిర్వీర్యం చేయగల అస్త్రాలను కృష్ణుడు ప్రయోగించి, చివరకు వైష్ణవాస్త్రాన్ని మంత్రయుక్తంగా ప్రయోగించాడు. ఆ మహాస్త్రాన్ని ఎలా ప్రతిఘటించాలో పాలుబోక శివుడు అమిత కోపంతో యుగాంతకమై, ప్రళయభయంకరమైన పాశుపతాస్త్రాన్ని పైకి తీశాడు.

శివుడి ఉద్దేశాన్ని గ్రహించి కృష్ణుడు అతి వేగంగా జృంభకాస్త్రాన్ని ప్రయోగించాడు. మరుక్షణమే శివుడికి చెప్పరాని నీరసమూ, ఆవలింతలూ వచ్చేశాయి. చేతి నుంచి ధనుర్బాణాలు పడిపోయాయి.

ఆ సమయానికే బాణుడు కూడా యుద్ధరంగానికి వచ్చి ఉన్నాడు. అతను శివుడికి చైతన్యం కలిగించాలని ప్రయత్నించాడు గాని, ప్రయోజనం లేకపోయింది. కృష్ణుడు

దిక్కులు మారుమోగేలాగా పాంచజన్యం పూరించాడు.

ఇదంతా చూసి ప్రమథులకు చాలా కోపం వచ్చింది. వారు ప్రద్యుమ్నుణ్ణి చుట్టుముట్టి ఆయుధాలతో ముంచివేశారు. రాక్షసులు కూడా అతని పైన మాయాయుద్ధం సాగించారు. ప్రద్యుమ్నుడు అలిగి సమ్మోహన విద్యతో వారందరికీ నిద్ర తెప్పించి, అనేకమంది రాక్షసులను చంపాడు.

ఈ లోపల కుమారస్వామి, తన తండ్రి యుద్ధ విముఖుడు కావటం చూసి, తానే ఆ స్థానంలో యుద్ధం చేయ బూనాడు. అతను కృష్ణబలరామ ప్రద్యుమ్నులతో పోరాడుతూ, వారిని తీవ్రంగా గాయపరచి, తానూ గాయపడ్డాడు. కుమారస్వామి అలిగి కృష్ణుడి పైన బ్రహ్మశిరోనామాస్త్రం ప్రయోగిస్తే కృష్ణుడు తన సుదర్శనచక్రంతో దాన్ని నిర్మూలించాడు. ఆ వెంటనే అతను కుమారస్వామి పైన తన చక్రాన్ని ప్రయోగించేసరికి, అది వచ్చి కుమారస్వామికి తగిలే లోపల లంబాదేవి అనే ఒక దేవతాస్త్రీ వచ్చి కుమారస్వామిని యుద్ధరంగం నుంచి తీసుకుపోయింది.

తనకు అంగరక్షగా ఉన్న వారంతా ఈ విధంగా తొలగిపోగా, యుద్ధం ద్వారా



తన చేతుల తీట తీరే అవకాశం దొరికిందని సంతోషించి బాణుడు తానే స్వయంగా కృష్ణుడితో యుద్ధానికి వచ్చాడు. ఇద్దరికీ జరిగిన యుద్ధంలో బాణుడి రథమూ, ఆయుధాలూ నుగ్గయాయి, టెక్కెం విరిగి పడింది. రొమ్ములో నుంచి కృష్ణుడి బాణం దూసుకుపోయి బాణుడు మూర్ఛిల్లాడు.

ఆ స్థితిలో కృష్ణుడి చక్రాయుధానికి బలిగానున్న బాణుణ్ణి కాపాడటానికి శివపార్వతులు మళ్ళీ లంబాదేవినే పంపారు. ఆమె వచ్చి బాణుడికి అడ్డంగా నిలబడింది. అదృశ్యంగా పార్వతి కూడా అక్కడే నిలబడింది.



అప్పుడు కృష్ణు డామెను చూసి, "దేవీ, ఎందుకీ కుయుక్తులు? నువు అడ్డంగా నిలిచి నంత మాత్రాన నేను శత్రువును ప్రాణా లతో వదులుతా ననుకున్నావా?" అన్నాడు.

ఆ మాటకు పార్వతి, "నువు సమర్థు డివి. ఏం చేసినా నేను నిన్ను అడ్డలేను. కాని ఈ బాణుణ్ణి నేను నా కొడుకుగా పెంచుకున్నాను. నాకు పుత్రశోకం కలి గిస్తావా? వీణ్ణి కాయి," అన్నది.

దానికి కృష్ణుడు, "తల్లీ, వీడు తన వెయ్యి చేతులు చూసుకుని మదించి, విర్ర వీగుతున్నాడు. రెండు చేతులే ఉంచి, మిగిలినవన్నీ నరికేస్తేనే గాని వీడి దర్పం అణగదు. అప్పుడు వీడి రాక్షసత్వం పోయి, నీ అండన బతికే కొడుకులాగే మిగులు తాడు. అడ్డం రాకు," అన్నాడు.

పార్వతి లంబాదేవిని అడ్డం తొలగ మన్నది. పార్వతీదేవితో బాటు లంబాదేవి కూడా అంతర్ధానం కాగానే, కృష్ణుడు తన చక్రాయుధాన్ని ప్రయోగించాడు. అది వెళ్ళి, బాణుడికి రెండు చేతులను మాత్రం మిగిల్చి, మిగిలిన చేతులన్నిటినీ ఖండించి, కృష్ణుడి చేతికి తిరిగి వచ్చింది.

అప్పటికీ బాణుడి పౌరుషం చావలేదు. అతను తనకు మిగిలిన రెండు చేతులతోనే ధనుర్బాణాలు తీసుకుని, కృష్ణుడిపై బాణ వర్షం కురిపించాడు. కృష్ణుడు ఆగ్రహించి తిరిగి చక్రాన్ని ప్రయోగించబోయేటంతలో శివుడు తన పరివారంతోసహా వచ్చి, "కృష్ణా, వీడు నా సంరక్షణలో ఉన్నవాడు. వీణ్ణి చంపి, నా అభయ దానాన్ని వ్యర్థం చెయ్యకు. నీ చక్రాన్ని ఉపసంహరించు," అని కోరాడు.

కృష్ణుడు బాణుణ్ణి చంపే ప్రయత్నం మానుకుని, శివుణ్ణి కీర్తించి, గరుత్మంతుణ్ణి ఎక్కి, అనిరుద్ధుడున్న చోటికి వెళ్ళాడు. నందికేశ్వరుడు బాణుణ్ణి శివుడి దగ్గిరికి చేర్చాడు. శివుడు బాణుడికి చేతులు పోయిన

బాధ మాన్పి, అతనికి ప్రమథులలో చాలా ఉన్నతమైన స్థానం ఇచ్చి, నందికి సమమైన హోదా ఇచ్చాడు. బాణుడి పేరు మహాకాళుడుగా మారిపోయింది. శివుడు అంతర్థానమయాడు.

అక్కడ గరుత్మంతుణ్ణి చూడగానే అనిరుద్ధుణ్ణి పాముల రూపంలో బంధించిన బాణాలన్నీ, తిరిగి బాణాల రూపం పొంది పడిపోయాయి. అక్కడికి నారదుడు వచ్చాడు, చిత్రరేఖ కూడా వచ్చింది. కృష్ణ బలరామ ప్రద్యుమ్నులు అనిరుద్ధుణ్ణి కౌగలించుకున్నారు. అతను వాళ్ళకు భక్తితో నమస్కారాలు చేశాడు.

నారదుడు కృష్ణుణ్ణి చూసి, "ఇంకా ఆలస్యం దేనికి? అబ్బాయికి వివాహం చేసెయ్యి," అన్నాడు.

ముహూర్తం కూడా సమీపంలోనే ఉన్నది. కుంభాండుడు పెళ్ళి ప్రయత్నాలన్నీ పూర్తి చేసి వచ్చి, కృష్ణుడికి నమస్కారం చేసి, "నన్ను తమరు అనుగ్రహించి కాపాడాలి," అన్నాడు.

కృష్ణుడు అతనితో, "నువు చాలా యోగ్యుడవని విన్నాను. బాణుడి సర్వస్వమూ నువే తీసుకుని నిశ్చింతగా అనుభవించు," అన్నాడు.



తరవాత ఉషానిరుద్ధులకు వైభవంగా వివాహం జరిగింది. కృష్ణుడు నూతన వధూవరులను శివపార్వతులున్న చోటికి తీసుకుపోయి, వారికి నమస్కారాలు చేయించాడు. ఆ ఆదిదంపతులు వారిని ఆశీర్వదించారు. పార్వతి అనిరుద్ధుడికి వాహనంగా బాణుడి నెమలినే ఇచ్చింది.

ఆ సమయంలో కుంభాండుడు, కృష్ణుడు బయలుదేరి పోబోతూండగా, "బాణుడి ఆవులమందలు వరుణుడి దగ్గిర ఉన్నాయి. వాటి పాలు తాగితే ఎంతో బలవీర్యాలు కలుగుతాయి. వాటిని తమరు స్వాధీనపరుచుకోవటం మంచిది," అన్నాడు.



ఇకనేం? కృష్ణుడు గరుత్మంతుడి మీద తనతోబాటు అన్ననూ, కొడుకునూ తీసుకుని పడమటి సముద్ర తీరానికి అతి వేగంగా వెళ్ళి, అక్కడి వనాలలో తిరుగుతున్న గోవులను అనేక లక్షల సంఖ్యలో చూశాడు. గోవులను మాలిమి చేసుకోవటం తనకు చిన్నతనం నుంచీ అలవాటైన విద్యే గనక, కృష్ణుడు నేల మీద దిగి ఆ గోవుల దగ్గిరికి వెళ్ళాడు. అవి గబగబా సముద్రంలో ప్రవేశించి, అదృశ్యమయాయి.

కృష్ణుడు నిరాశ చెంది గరుత్మంతుడితో, "నా ప్రయత్నం ఇలా గయిందేమిటి? ఇప్పుడు ఏం చెయ్యాలి?" అన్నాడు.

"చేసేటందు కేమున్నది? వరుణుడితో యుద్ధం చేయక తప్పదు!" అన్నాడు గరుత్మంతుడు.

అతను రెక్కలతో బలంగా విసిరేసరికి సముద్రపు నీరు తొలగి, అడుగున నాగలోకం దాకా దృగ్గోచరమయింది. కృష్ణుడు పాంచజన్యం పూరిస్తూ వరుణుడి ఇంటి మీదికి ఎత్తి వెళ్ళాడు.

మరుక్షణమే శంఖాలు ఊదుతూ, అరవై ఆరు రథాల మీద వరుణుడి భటులు కృష్ణుడి పైకి వచ్చారు. కృష్ణుడు వారితో దారుణమైన యుద్ధం చేశాడు. అతనికి సహాయంగా బలరాముడూ, ప్రద్యుమ్నుడూ కూడా పోరాడారు. గరుత్మంతుడు కూడా వారికి సహాయం వెళ్ళాడు. ఈ నలుగురూ చేసిన యుద్ధానికి తట్టుకోలేక వరుణుడి భటులు పారిపోయారు.

"కృష్ణుడు ఇంత పని చేస్తాడా?" అని ఆగ్రహించి వరుణుడు స్వయంగా యుద్ధానికి వచ్చాడు. కృష్ణుడికీ వరుణుడికీ జరిగిన యుద్ధంలో కృష్ణుడు వైష్ణవాస్త్రం ప్రయోగించేసరికి వరుణుడు, ప్రాణం మీదికి వచ్చి, కాళ్ళ బేరానికి దిగాడు.

"నన్ను శరణు వేడినంత మాత్రాన లాభం లేదు. నీ దగ్గిర ఉండే బాణుడి

పశువులను ముందు నా పరం చెయ్యి," అన్నాడు కృష్ణుడు.

"అది మాత్రం అడగవద్దు. బాణుడు తన పశువులను నాకు అప్పగించేటప్పుడు, ప్రాణం ఉన్నంత దాకా యుద్ధమైనా చేస్తాను గాని వాటిని ఎవరికీ ఇవ్వనని ప్రమాణం చేశాను. ఉన్నమాట చెప్పాను. తరవాత నీ కెలా తోస్తే అలాగే చెయ్యి," అన్నాడు వరుణుడు.

కృష్ణుడు పశువుల మీది ఆశ వదులుకుని తన దివ్యాస్త్రాన్ని ఉపసంహరించాడు. వరుణుడు కృష్ణుడికి అతిథి మర్యాదలు చేసి తన లోకం నుంచి సాగనంపాడు.

వరుణుడికి వీడ్కోలు చెప్పి, కృష్ణుడు బలరామ ప్రద్యుమ్న అనిరుద్ధులతో సహా గరుడవాహనం మీద తన నగరాన్ని చేరుకుని, విజయసూచకంగా పాంచజన్యం పూరించాడు. అది విని యాదవ ప్రముఖులు పెద్ద బలగాన్ని వెంటబెట్టుకుని ఎదురు వచ్చారు. వారు వచ్చేసరికి కృష్ణుడు నగరం వెలపల ఉండే ఉద్యానాలలో దిగి, విహరిస్తున్నాడు. అతని వెంట ఇంద్రాది దేవతలు కూడా ఉన్నారు. యాదవులు వారినందరినీ వైభవోపేతంగా రథాలలో నగరంలోకి తీసుకుపోయారు. కృష్ణుడు విజయుడై తిరిగి వచ్చాడన్న వార్త తెలిసి పురజనులు వీధుల వెంబడి కిక్కిరిసి నిలబడ్డారు. కృష్ణుడు శోణపురంలో అగ్నులను జయించటమూ, శివుణ్ణి నిగ్రహించటమూ, పార్వతికి పుత్రభిక్ష పెట్టటమూ, బాణుణ్ణి చేతులు నరికి ప్రాణాలతో వదలటమూ మొదలైన వృత్తాంతాలు వారు చెప్పుకుంటున్నారు. వాళ్ళ మాటలు చెవిని పడుతుంటే కృష్ణుడికి ఆనందం కలిగింది.

నగరు చక్కగా అలంకరించి ఉన్నది. అక్కడికి చేరగానే కృష్ణుడు తన మందిరానికి వెళ్ళిపోయాడు; ఉషానిరుద్ధులు తమ మందిరానికి వెళ్ళారు.





# కృష్ణావతారం

ఒకనాడు తెల్లవారుఝామున కృష్ణుడు సాత్యకినీ, ఉద్ధవుణ్ణీ వెంటబెట్టుకుని సభకు బయలుదేర బోతూండగా, ఎవరో ఒక మనిషి అతని దర్శనార్థమై వచ్చాడు. ద్వారపాలకుల వెంట వచ్చిన ఆ మనిషి, "దేవా, మగధదేశాన్ని పాలించే జరాసంధుడు ఇరవైవేలమంది రాజులను జయించి, చెరలో పెట్టి, నానా హింసలూ పెడుతున్నాడు. వారందరూ నిన్ను శరణు వేడుతూ, నన్ను తమ ప్రతినిధిగా పంపారు. మేమందరమూ నీ ప్రజలమే గనక, మమ్మల్ని రక్షించేభారం నీదే," అన్నాడు.

అదే సమయంలో ఆకస్మికంగా నారదుడు వచ్చాడు. కృష్ణుడు నారదుడికి అతిథి మర్యాదలన్నీ చేసి, విశేషాలేమిటని అడిగాడు. అప్పుడు నారదుడు, "పాండవాగ్రజుడైన ధర్మరాజు రాజ్యం సంపాదించగోరి రాజసూయం తలపెట్టాడు. దానికి నీవే అధ్వర్యం వహించాలని కోరుతున్నాడు. నీ రాక కోసం రాజులందరూ ఎదురు చూస్తున్నారు," అన్నాడు.

ఒక వంక జరాసంధుడి చేత చెర పెట్టబడిన రాజులు కృష్ణుడి సహాయం అర్థిస్తూ దూతను పంపారు. అదే సమయంలో ధర్మరాజు చేసే రాజసూయానికి అధ్వర్యుడుగా ఉండమని నారదుడి ద్వారా పిలుపు వచ్చింది.

"మనం ఈ రెంటిలో ఏది ప్రథమ కర్తవ్యంగా భావించాలి?" అని కృష్ణుడు ఉద్ధవుణ్ణి సలహా అడిగాడు.

28. రాజసూయం





యుద్ధంలో జయించవలిసిందే. మరో మార్గం లేదు.

ఉద్ధవుడి సలహా కృష్ణుడికి నచ్చింది. అతను బలరాముడి అనుమతి పొంది, స్త్రీలతో సహా ఇంద్రప్రస్థానికి ప్రయాణ సన్నాహాలు సాగించమని దారుకుడు మొదలైన వారికి ఉత్తరువిచ్చాడు. కృష్ణుడు చతురంగ బలాలనూ, పల్లకీలలో రుక్మిణీ, సత్యభామా మొదలైన స్త్రీ జనాన్నీ వెంట పెట్టుకుని అట్టహాసంగా తరలి వెళ్ళాడు. బయలుదేరే ముందు నారదుణ్ణి పంపేసి, తన వద్దకు వచ్చిన దూతతో, "మీ రాజులను భయపడవద్దని చెప్పు. నేను తప్పక జరాసంధుణ్ణి చంపించి, మీ రాజులకు స్వేచ్ఛ ఇస్తాను," అని అతన్ని కూడా సాగనంపాడు.

కృష్ణుడు వస్తున్న వార్త విని ధర్మరాజు ఎదురు వెళ్ళి, ఆనందబాష్పాలు కారుస్తూ కృష్ణుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు.

కృష్ణుడు పాండవులను తగిన విధంగా పరామర్శించి, జెండాలతోనూ, తోరణాలతోనూ, అరటిచెట్లతోనూ అలంకరించిన వీధుల వెంబడి ఇంద్రప్రస్థం ప్రవేశించాడు. కృష్ణుణ్ణి చూడటానికి పౌరులు వీధుల వెంబడీ, మిద్దెల మీదా గుమికూడారు.

"జరాసంధుణ్ణి చంపటానికి వేరే పని పెట్టుకుని వెళ్ళవలిసిన పని ఉండదు. ఎందుచేతనంటే, ధర్మరాజు రాజసూయం చేసేటప్పుడు ఎలాగూ అనేకమంది రాజులను జయించవలసి ఉంటుంది. పనిలో పనిగా జరాసంధుడి సంగతి కూడా చూడవచ్చు. రాజసూయానికి వెళ్ళటమే మంచిది. ఆ విధంగా రెండు కార్యాలూ నెరవేరుతవి," అన్నాడు ఉద్ధవుడు.

ఉద్ధవుడు మరొక సంగతి కూడా గుర్తు చేశాడు: జరాసంధుడి పైకి సేనలతో వెళ్ళి గెలవటం సాధ్యం కాదు. బలంలో ఆ జరాసంధుడికి తుల్యుడైన ఏ భీముడో ద్వంద్వ





ధర్మరాజు ఇంట కృష్ణుడు కుంతినీ ఆమె కోడళ్ళనూ చూశాడు.

పాండవులకు కృష్ణుడు ఎంతో అప్తుడు. కృష్ణార్జునుల స్నేహం లోకోత్తరమైనది. అర్జునుడు ఖాండవదహనం చేయించినప్పుడు కృష్ణుడు స్వయంగా అతనికి సారథ్యం చేశాడు; అతనికి దివ్యమైన రథమూ, గుర్రాలూ, అక్షయతూణీరాలూ ఇప్పించాడు; మయుడి చేత మయసభ నిర్మింపజేసి పెట్టాడు. అందుచేత ధర్మరాజు చాలాకాలం పాటు కృష్ణుణ్ణి సపరివారంగా తన వద్ద ఉంచుకుని, చివరకు ఒకనాడు, తాను తలపెట్టిన రాజసూయం గురించి నిండుసభలో కృష్ణుడితో ప్రస్తావించాడు.

కృష్ణుడు ధర్మరాజును అభినందిస్తూ, "నువు రాజసూయం చెయ్యటానికి ఆక్షేపణ ఏమున్నది? దిగ్విజయం చెయ్యటానికి దిక్పాలకుల వంటి నీ తమ్ములున్నారు. వాళ్ళు నీకు నాలుగుదిక్కులూ గెలిచిపెట్టగలరు," అన్నాడు.

ఆ మాట విని ధర్మరాజు చాలా సంతోషించి, నలుగురు తమ్ములనూ నాలుగు దిక్కులూ జయించి రావటానికి పంపాడు. సహదేవుడు దక్షిణానికీ, నకులుడు పడమరకూ, అర్జునుడు ఉత్తరానికీ, భీముడు తూర్పుకూ వెళ్ళి ఆయా దిక్కుల గల రాజులను గెలిచి, రాజసూయం కొనసాగించటానికి అంతులేని ధనాలను తెచ్చి ధర్మరాజు కిచ్చారు.



రాజులందరూ ఓడారు గాని, జరాసంధుడు ఓడలేదు. ఇది ధర్మరాజుకు విచారకారణ మయింది. అది చూసి కృష్ణుడు, "జరాసంధుడి విషయం దిగులుపెట్టుకోవద్దు. అతన్ని జయించే ఉపాయం నే నిక్కడికి బయలుదేరే ముందే ఉద్ధవుడు చెప్పాడు. ఆ పని నేను నెరవేరుస్తాను," అన్నాడు.





అతను భీముణ్ణీ, అర్జునుణ్ణీ వెంటబెట్టు కుని, జరాసంధుడి రాజధాని అయిన గిరివ్రజపురం వెళ్ళాడు. అక్కడ ముగ్గురూ బ్రాహ్మణ వేషాలు ధరించారు. జరాసంధుడు రోజూ బ్రాహ్మణ పూజ చేస్తాడు. అతను ఆ పనిలో నిమగ్నుడయి ఉండే సమయంలో వీళ్ళు అతని వద్దకు వెళ్ళి, "మేం దూరదేశం నుంచి వచ్చిన అతిథులం. మేము కోరినది ఇయ్యి," అన్నారు.

జరాసంధుడు వాళ్ళను శ్రద్ధగా చూశాడు. ఆ ముగ్గురి ఆకారాలూ, కంఠ స్వరాలూ పరిచితమైనవిగానే వున్నాయి. వాళ్ళ ముంజేతులు కాయలుగాచి ధనుర్బాణాలు ఉపయోగించే రాజుల కున్నట్టుగా ఉన్నాయి. వాళ్ళు నిస్సందేహంగా బ్రాహ్మణవేషాలు ధరించిన క్షత్రియులే!

అయినా జరాసంధుడు వాళ్ళ కోరిక తీర్చటానికే నిశ్చయించుకుని, "మీకేం కావాలి ?" అని అడిగాడు.

"మాకు కావలసింది నీతో ద్వంద్వ యుద్ధం. ఇతను భీముడు. ఇతను అతని తమ్ముడు అర్జునుడు. నేను నీ పగవాణ్ణి, కృష్ణుణ్ణి," అన్నాడు కృష్ణుడు.

ఈ మాటలు విని జరాసంధుడు నిర్లక్ష్యంగా నవ్వి, "అలా అయితే ద్వంద్వ యుద్ధం చేస్తాను. కాని నీతో చెయ్యను— నన్ను చూసి మధుర నుంచి పారిపోయి, సముద్రంలో దాక్కున్న పిరికిపందవు! ఈ అర్జునుడితోనూ యుద్ధం చెయ్యను. ఇతను నా కన్న చిన్నవాడు. అదీగాక బలంలో అతను నాకు చాలడు. నాతో భీముడు సమానుడు. అతనితో ద్వంద్వ యుద్ధం చేస్తాను," అన్నాడు.

జరాసంధుడు ఒక ఉద్దండమైన గదను భీముడి కిచ్చి, అలాటిదే తాను కూడా తీసుకున్నాడు. కృష్ణార్జునులతో సహా వారిద్దరూ నగరం దాటి యుద్ధభూమికి వెళ్ళారు. అక్కడ భీమ జరాసంధులు గదా యుద్ధం



ప్రారంభించారు. ఒకరిదెబ్బలు ఒకరు తప్పుకుంటూ, అవకాశం దొరికినప్పుడు ఒకరి నొకరు గదలతో మోదుకుంటూ ఆ ఇద్దరూ రెండు మదించిన ఏనుగుల్లాగా పోరాడారు. చివరకు ఇద్దరి గదలూ విరిగి పోయాయి. అప్పుడు వారు ముష్టియుద్ధం సాగించారు.

జరాసంధుడు పుట్టినప్పుడు రెండు చీలికలై పుట్టాడు. జర అనే పిశాచి ఆ రెండు చీలికలనూ కలిపింది. అందుచేత అతనికి జరాసంధు డనే పేరువచ్చింది. ఈ సంగతి కృష్ణుడు ఎరుగును. అతన్ని చంపటానికి కూడా రెండుగా చీల్చటమే మార్గమని



భీముడికి తెలియ జెప్పటానికై, కృష్ణుడు ఒక పుల్ల తీసుకుని రెండుగా చీల్చాడు. ఈ సంకేతం భీముడికి అర్థమయింది. భీముడు జరాసంధుణ్ణి కింద పడదోసి, ఒక కాలిని తన కాలితో తొక్కిపెట్టి, రెండో కాలు పట్టుకుని జరాసంధుణ్ణి నిలువుగా చీల్చాడు.

యుద్ధాన్ని చూడవచ్చిన జనులు రెండు చీలికలైపోయిన జరాసంధుణ్ణి చూసి హాహాకారాలు చేశారు.

కృష్ణార్జునులు భీముణ్ణి కౌగలించుకుని, అభినందించారు.

జరాసంధుడు చచ్చిన మీదట కృష్ణుడు జరాసంధుడి కొడుకైన సహదేవుణ్ణి మగధ రాజ్యానికి రాజుగా అభిషేకించి, జరాసంధుడు చెరపెట్టిన రాజులందరినీ విడిపించాడు. కృష్ణుడు చెప్పిన మీదట సహదేవుడు ఆ రాజులందరికీ స్నానపానాలు ఏర్పాటు చేసి, మంచి కానుకలిచ్చి సత్కరించి, వాళ్ళ వాళ్ళ దేశాలకు పంపేశాడు.

కృష్ణుడు భీమార్జునులను వెంట బెట్టుకుని ఇంద్రప్రస్థానికి తిరిగి వచ్చి, జరాసంధుడి మరణవార్త ధర్మరాజుకు చెప్పాడు. తన కోరిక సిద్ధించినందుకు ధర్మరాజు సంతోషించి, కృష్ణుణ్ణి రకరకాల స్తోత్రం చేశాడు.





తరవాత ధర్మరాజు రాజసూయ యాగం ఆరంభించాడు. దానికి ఋత్విక్కులు కృష్ణద్వైపాయనుడూ, భరద్వాజుడూ, వసిష్ఠుడూ, విశ్వామిత్రుడూ, గౌతముడూ మొదలు గాగలవారు అనేకమంది.

యాగానికి ధర్మరాజు భీష్ముణ్ణీ, ధృతరాష్ట్రుణ్ణీ, ఆయన కొడుకులనూ, ద్రోణుడూ, కృపుడూ, విదురుడూ మొదలైన వారినీ పిలిపించాడు. అనేకమంది రాజులూ, నాలుగు కులాలవారూ కూడా వచ్చారు.

బంగారు నాగళ్ళతో యజ్ఞభూమి దున్ని, వేదిక మొదలైనవి ఏర్పాటు చేసి, ఋత్విక్కులు ధర్మరాజు చేత యజ్ఞదీక్ష ధరింపజేశారు. రాజసూయం చాలా వైభవంగా జరిగింది. యజ్ఞకర్త సదస్యులనూ, యాజకులనూ సత్కరించవలసిన రోజు వచ్చింది. ఆ రోజు ధర్మరాజు సదస్యులను, "తమ అందరిలోనూ ప్రథమ పూజార్హు డెవరో నిర్ణయించండి," అని అడిగాడు.

కాని ఆ ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు. ఎందుచేతనంటే సభలో ఎందరో మహాత్ములున్నారు. అందరూ నోళ్ళు కట్టుపడి ఉన్న సమయంలో సహదేవుడు, సభను ఉద్దేశించి, "దీని కింత ఆలోచన దేనికి? భగవంతుడైన కృష్ణుడే ప్రథమ పూజార్హుడు. అతన్ని పూజిస్తే సర్వభూతాలనూ పూజించినట్టే," అన్నాడు.

సహదేవు డన్న ఈ మాటకు సభాసదు లందరూ తమ ఆమోదం తెలిపారు. ధర్మరాజు వెంటనే కృష్ణుడి కాళ్ళు కడిగి, అతనికి పచ్చని పట్టుబట్టలూ, ఆభరణాలూ పెట్టాడు. మిగిలిన రాజు లందరూ కృష్ణుడికి నమస్కారాలు చేశారు.

కాని ఇదంతా దమఘోషుడి కొడుకైన శిశుపాలుడికి కొంచెం కూడా నచ్చలేదు. అతను చివాలున లేచి నిలబడి, చెయ్యెత్తి, "కాల ప్రభావం కాకపోతే ఆ కుర్రకుంక చెప్పటమేమిటి, మీరంతా అవునన

మేమిటి? ఇంతమంది మేటి తపస్వులున్న ఈ సభలో, కులపాంసనుడైన ఈ గొల్ల వాడికి ప్రథమ పూజ చేయవచ్చునా? యయాతి శాపం పొందిన యాదవులు పరమ హీనులు గద?" అంటూ పేలాడు.

కృష్ణుడు చలించ లేదు. కాని మిగిలిన వారిలో కొందరు చెవులు మూసుకుని సభ నుంచి లేచిపోయారు. మరి కొందరు శిశు పాలుడితో యుద్ధానికి తలపడ్డారు. కృష్ణుడు వారి నందరినీ వారించి, తన సుదర్శన చక్రం ప్రయోగించి, శిశుపాలుడి తల నరి కేశాడు. గగ్గోలు పుట్టింది. శిశుపాలుడి పక్షం వారంతా పారిపోయారు.

ధర్మరాజు అందరికీ సక్రమంగా దానాలు చేసి, అవభృతస్నానం చేసి యజ్ఞం పరిసమాప్తి చేశాడు.

రాజసూయం చూడటానికి వచ్చిన రాజు లందరూ వెళ్ళిపోయాక కూడా, ధర్మరాజు కోరికపై కృష్ణుడు ఉండిపోయాడు.

ఈలోపల దుర్యోధనుడు అసూయతో కుమిలి పోసాగాడు. ఎందుకంటే, ధర్మ రాజు విభవాన్ని తాను కళ్ళారా చూశాడు. రాజసూయం మహా గొప్పగా జరిగింది. మయుడు ధర్మరాజుకు అద్భుతమైన సభ నిర్మించాడు. ఆ సభలో పాండవులకు ఎక్క డెక్కడి రాజులూ కైంకర్యం చేశారు. అందులో కృష్ణుడి భార్యలు విహారాలు చేశారు. ఆ సభలోనే దుర్యోధనుడు పరా భవం కూడా పొందాడు. అందులో ఎక్కడ నీరున్నదీ, ఎక్కడ నేల ఉన్నదీ సరిగా తెలియరాలేదు. దుర్యోధనుడు నీరులేని చోట బట్టలు పైకి తీసుకున్నాడు; నీరున్న చోట బట్టలు తడిసేలాగ దిగబడ్డాడు. కృష్ణుడు నవ్వాడు. అది చూసి అందరూ, స్త్రీలతో సహా నవ్వారు. ధర్మరాజు నవ్వ వద్దని వారించాడుగాని, ఎవరూ లక్ష్య పెట్ట లేదు. పుట్టెడు అపమానం పొంది దుర్యో ధనుడు హస్తినాపురానికి తిరిగి వెళ్ళాడు.





# కృష్ణావతారం

శిశుపాలుడికి సాల్వుడనే స్నేహితుడున్నాడు. రుక్మిణిని కృష్ణుడు ఎత్తుకుపోయే సందర్భంలో మిగిలినవాళ్ళతోబాటు ఈ సాల్వుడు కూడా ఓడిపోయాడు. అందుకని అతడికి పౌరుషం వచ్చి, లోకంలో యాదవులు లేకుండా చేస్తానని ప్రతిజ్ఞపట్టి, కేవలమూ మట్టి మాత్రమే తింటూ శివుణ్ణి గురించి దారుణమైన తపస్సు చేసి ప్రత్యక్షం చేసుకుని, తనకు ఎదురులేని విమానం ఒకటి కావాలని కోరాడు. శివుడు చెప్పగా, విశ్వకర్మ నల్లని ఇనుప విమానం ఒకటి తయారు చేసి సాల్వుడి కిచ్చాడు. సౌభమనే ఆ విమానం ఎక్కి సాల్వుడు ద్వారక పైకి దాడి వెళ్ళాడు. అతని సేనలు కూడా వచ్చి నగరాన్ని ముట్టడించాయి.

సాల్వుడు విమానం నుంచి రాళ్ళూ, చెట్లూ, ఆయుధాలూ నగరం మీద వేసి భీభత్సం చేశాడు. అతని సేనలు నగరపు ప్రాకారాలనూ, ద్వారాలనూ, తోటలనూ ధ్వంసం చెయ్యసాగాయి. అది చూసి ప్రద్యుమ్నుడు నాయకత్వం వహించి, సాత్యకీ, చారుదేష్ణుడూ, సాంబుడూ, అక్రూరుడూ, కృతవర్మ మొదలైన యోధులనూ, సైన్యాన్నీ వెంటబెట్టుకుని సాల్వుడి పైకి యుద్ధానికి వెళ్ళాడు. అప్పటికి కృష్ణుడింకా పాండవుల వద్దనే ఉన్నాడు.

సాల్వుడి పక్షానికీ, యాదవుల పక్షానికీ మధ్య ఇరవై ఏడు రోజులపాటు తీవ్రంగా యుద్ధం జరిగింది. అప్పటికి కృష్ణుడు ద్వారకకు తిరిగివస్తూ యుద్ధ పరిస్థితి

29. కుచేలుడి కథ



గ్రహించి, తన రథాన్ని తిన్నగా సాల్వుడి పైకి తోలించాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. కృష్ణుడు సౌభవిమానాన్ని భగ్నం చేసి, సముద్రంలో పడేటట్టు చేసి, సాల్వుణ్ణి చక్రాయుధంతో చంపేశాడు.

సాల్వుడు చావగానే అతని స్నేహితుడైన దంతవక్త్రుడు గద ఒకటి తీసుకుని, ఒంటరిగా కృష్ణుడితో యుద్ధానికి వచ్చాడు. కృష్ణుడు దంతవక్త్రుడికి మేనమామ కొడుకే. అతను కూడా ఒక గద తీసుకుని దంతవక్త్రుడితో యుద్ధం చేస్తూ, రొమ్ము పగలగొట్టి అతన్ని చంపేశాడు. సాల్వుడు ప్రారంభించిన యుద్ధం తుదముట్టింది...



కృష్ణుడికి కుచేలు డనే బాల్య స్నేహితుడొకడుండేవాడు. ఇద్దరూ ఒక గురువు దగ్గిరే చదువుకున్నారు. కుచేలుడు పెళ్ళాడి, గృహస్థాశ్రమం గడుపుతున్నాడు, కాని కటిక దారిద్ర్యంతో బాధపడుతున్నాడు. దారిద్ర్య బాధ కుచేలుడికి కన్న అతని భార్యకు దుస్సహంగా ఉన్నది. అందుచేత ఆమె ఒకసారి తన భర్తతో, "కృష్ణుడు నీకు స్నేహితుడే గదా? అతను బ్రాహ్మణులకు ఎడతెగని దానా లిస్తాడట. శరణువేడిన వారిని తప్పక ఆదుకుంటాడట. అలాటప్పుడు, స్నేహితుడివీ, సంసారభారం మోస్తున్నవాడివీ అయిన నీకు సహాయం చెయ్యడా?" అన్నది.

కుచేలుడికి కూడా, సహాయం కోరే వంకన కృష్ణుణ్ణి చూడాలనిపించింది. చూడటంవల్ల లాభం ఉంటుందని కూడా అతనికి తెలుసు. కనక అతను భార్యతో, "కృష్ణుణ్ణి చూడబోతాను. కాని వట్టి చేతులతో కాకుండా అతనికి కానుక ఏదైనా తీసుకుపోతే బాగుంటుంది. అందుకు తగినదేమన్నా ఇంట్లో ఉన్నదా?" అని అన్నాడు.

కుచేలుడి భార్య ఇరుగు పొరుగు ఇళ్ళవారి నుంచి నాలుగు గుప్పెళ్ళు అటుకులు ముష్టిఎత్తి తెచ్చి, వాటిని చిన్న గుడ్డలో



మూట కట్టి, భర్త కిచ్చింది. కుచేలుడు ఆ అటుకుల మూట చేత బట్టుకుని ప్రయాణమై, ద్వారకకు చేరుకుని, కృష్ణుడి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళాడు.

మంచం మీద పడుకుని ఉన్న కృష్ణుడు కుచేలుణ్ణి చూడగానే లేచి ఎదురు వచ్చి, గట్టిగా కౌగలించుకుని, తీసుకు వచ్చి తన మంచం మీద కూర్చోబెట్టి, తానే స్వయంగా కుచేలుడి కాళ్ళు కడిగి, ఆ నీరు నెత్తిన చల్లుకుని, కుచేలుడి శరీరానికి గంధం రాచి, పూలమాలవేసి, దేవుణ్ణి చూసినట్టు చూశాడు. ఒళ్ళంతా మట్టి కొట్టుకుని, చింకి బట్టలు ధరించి, శవాకారంలో ఉన్న ఆ బ్రాహ్మడికి తన భర్త అంత ఆదరం చూపటం గమనించి, రుక్మిణి వింజామర తీసుకుని కుచేలుడికి విసర నారంభించింది. కృష్ణుడు కుచేలుడి పట్ల చూపిన అభిమానానికి అక్కడ ఉన్న వారంతా ఆశ్చర్యపోయారు.

కృష్ణుడు కుచేలుడికి చెయ్యదగిన మర్యాదలన్నీ చేసి, గురుకులంలో చదిలిన రోజులనాటి తమ అనుభవాలు నెమరువేయ నారంభించాడు.

ఒకసారి గురుపత్ని వాళ్ళను సమిధలు తెమ్మని పంపింది. వాళ్ళు ఒక మహా



రణ్యంలో ప్రవేశించారు. ఇంతలో ఒక పెద్ద గాలివాన అరంభమయింది. ఆకాశాన మెరుపులు మెరిశాయి. పిడుగులు పడ్డాయి. ఇలా మెరుపులూ, ఉరుములూ సాగుతూండ గానే సూర్యాస్తమానమై పోయింది. సమిధల కోసం వచ్చినవాళ్ళు తడిసి ముద్ద అయి పోయారు. దారి తెలీదు. మిట్టపల్లా లేకమై పోయాయి. ఒకళ్ళ చేతులొకళ్ళు పట్టుకుని అరణ్యంలో తెల్లవార్లూ తిరగాడారు. మర్నాడు తెల్లవారింది. శిష్యులు అడవిలో చిక్కుపడి పోయారని తెలిసి సాందీపని గురువు వాళ్ళను వెతుక్కుంటూ వచ్చి, దైన్యస్థితిలో ఉన్న కుర్రవాళ్ళను చూసి,



"మా కోసం ఎంత ప్రయాసపడ్డారు! ఇంత కన్న ఉత్తమ శిష్యులు గురువుకు ఏం చెయ్యగలరు? మీ భక్తికి సంతోషించాను. మీ కోరికలు ఈడేరుతాయి," అని ఆశీర్వదించాడు. ఈ సంఘటనను కృష్ణుడు కుచేలుడికి జ్ఞాపకం చేసి, "గుర్తు ఉన్నదా?" అని అడిగాడు.

"నీతో గురుకులవాసస్నేహం చేసిన నా బోటి వాడికి ఏ కోరిక తీరదు?" అన్నాడు కుచేలుడు.

కృష్ణుడా మాటకు నవ్వి, "ఇంతకూ మీ ఇంటి నుంచి నాకేం తెచ్చావు?" అని అడిగాడు.



కుచేలుడు కంగారు పడ్డాడు. కృష్ణుడికి తాను తెచ్చిన అటుకు లివ్వాలంటే అతనికి చాలా సిగ్గు వేసింది. కృష్ణుడే బలవంతంగా కుచేలుడి చేతిలో ఉన్న గుడ్డపేలిక మూట తీసుకుని, "ఇందులోది ఏమిటి?" అని అడుగుతూ విప్పి, "అటుకులే? నా కెంత ఇష్టమనుకున్నావు!" అంటూ పిడికెడు నోట వేసుకుని, మరో పిడికెడు చేతిలోకి తీసుకున్నాడు.

"ఆ తిన్నవి చాలు!" అంటూ రుక్మిణి కృష్ణుడి చెయ్యిపట్టుకున్నది.

ఆ రాత్రి కుచేలుడు కృష్ణుడి ఇంటనే స్నానమూ, భోజనమూ, నిద్రా సుఖంగా చేసి, తాను నిజంగా స్వర్గంలోనే ఉన్నా ననుకున్నాడు.

మర్నాడు కుచేలుడు తన ఇంటికి ప్రయాణమయేటప్పుడు కృష్ణుడు అతన్ని కొంతదూరం సాగనంపాడు. తనకు కృష్ణుడు ధనమేమీ ఇవ్వలేదు. అతను తన మనసులో, "కృషుడు మహారాజు. నేనో హీనుడైన నిరుపేద బ్రాహ్మణ్ణి. బ్రాహ్మణ్ణి కదా అన్న ఆదరంతో నన్ను అతను కౌగలించుకున్నాడు. తన తమ్ముణ్ణి చూసినట్టు చూశాడు. తన భార్య పడుకునే మంచం మీద కూర్చోబెట్టాడు. తన భార్యచేత వింజా





మర వీయించాడు.' దేవుడికి చెయ్యదగి నంత మర్యాద చేశాడు. నాకు డబ్బిచ్చి నట్టయితే నాకు కళ్ళు నెత్తికొచ్చి తనను మరిచిపోతాననుకుని కాబోలు ఆ పని చెయ్యలేదు," అనుకున్నాడు.

కాని కుచేలుడు తన ఇంటి కేసి వెళ్ళే సరికి, ఎట్టెదుట కళ్ళు జిగేలుమనే రాజ భవనాలు కనిపించాయి. ఉద్యానవనాలూ, సరోవరాలూ కనిపించాయి. వాటిలో రక రకాల పక్షులూ, తామరలూ, కలువలూ కనిపించాయి. భవనంలో దాస దాసీలు తిరుగాడుతున్నారు.



"ఇది ఎవరి ఇల్లయి ఉంటుందీ? నా యిల్లు కాదే! ఇదంతా ఇక్కడ ఎలా వచ్చిందీ?" అని కుచేలుడు దిగ్భ్రమ చెంది ఉండగా, దేవతలా అన్నట్టున్న స్త్రీ పురుషులు మేళతాళాలతో అతనికి ఎదురు వచ్చి, భవనంలోకి అతన్ని తీసుకుపోయారు.

మారువేషంలో ఉన్న లక్ష్మిదేవి లాగా కుచేలుడి భార్య వచ్చి తన భర్తను చూసి, కన్నీరు తోసుకు వచ్చే కళ్ళను గట్టిగా మూసుకుని భర్తకు నమస్కరించి, మనసు లోనే అతన్ని ఆలింగనం చేసుకున్నది.

ఇదంతా చూసి కుచేలుడు తనలో, "నాకీ ఐశ్వర్యమంతా కృష్ణుణ్ణి చూసి రావటం చేతనే కలిగి ఉంటుంది. మరో కారణమేదీ కనబడదు. స్నేహితుడంటే అలాగే ఉంటాడు; తాను పుచ్చుకున్నది కొంచెమే అయినా దాన్ని చాలా ఘనంగా భావిస్తాడు; తాను ఇచ్చేది ఎంతో గొప్పదే అయినా దాన్ని అల్పంగానే భావిస్తాడు," అనుకున్నాడు.

అటు తరవాత సకలైశ్వర్యాలతో కుచేలుడు తన భార్యతోనూ, బిడ్డలతోనూ సుఖంగా జీవించాడు.

ఒకప్పుడు సంపూర్ణ సూర్యగ్రహణం వచ్చింది. అప్పుడు యాదవులందరూ, అని రుద్ధుణ్ణి ద్వారకకు రక్షకుడుగా ఉంచి,





కురుక్షేత్రానికి బయలుదేరి వెళ్ళారు. అక్కడ కృష్ణుడికి పాత చుట్టాలంతా కలిశారు. నందుడూ, యశోదా వచ్చారు. కుంతి వచ్చింది. భీష్మద్రోణులూ, ధృతరాష్ట్రుడూ, సంజయుడూ, విదురుడూ, కృపుడూ, దుర్యోధనుడు మొదలైనవారూ, గాంధారీ, పాండవులూ, వారి భార్యలూ, అందరూ చాలా కాలానికి ఒక చోట సమావేశమయారు. అందరూ కబుర్లు చెప్పుకున్నారు.

ఆ సమయంలో పాండవుల భార్య అయిన ద్రౌపది కృష్ణుడి అష్టభార్యలను, "మీకూ కృష్ణుడికీ ఎలా వివాహాలు జరిగాయి?" అని అడిగింది.

"నన్ను శిశుపాలుడి కివ్వాలని జరాసంధుడు మొదలైన వారంతా నిర్ణయిస్తే, కృష్ణుడు వచ్చి, అందరినీ మట్టి కరిపించి, నన్ను ఎత్తుకుపోయి పెళ్ళి చేసుకున్నాడు," అని రుక్మిణి తన వివాహ వృత్తాంతం చెప్పింది.

"నన్ను మా తండ్రి సత్రాజిత్తు మరెవరికో ఇద్దామనుకున్నాడు. అంతలో నా పిన తండ్రి చనిపోయాడు. అది కృష్ణుడి పనే నని మా తండ్రి ఒక అపవాదు వేశాడు. అప్పుడు కృష్ణుడు బయలుదేరి వెళ్ళి, మా పిన తండ్రిని చంపిన సింహాన్ని చంపి శ్యమంతకమణిని తీసుకుపోయిన జాంబవంతుణ్ణి జయించి, మణిని తెచ్చి మా తండ్రికిచ్చి, నన్ను పెళ్ళాడాడు," అన్నది సత్యభామ.

"మా తండ్రి జాంబవంతుడు ఇరవై అయిదు రోజులు కృష్ణుడితో పోరిన మీదట, ఆ నాటి రాముడే ఈ కృష్ణుడుగా అవతరించాడని గ్రహించి, ఆయన కాళ్ళు పట్టుకుని, సింహాన్ని చంపి తెచ్చిన శ్యమంతకమణితోపాటు నన్ను కూడా కృష్ణుడికి అర్పించాడు," అన్నది జాంబవతి.

"నేను తన కోసం తపస్సు చేశానని తెలిసి, అర్జునుణ్ణి వెంట పెట్టుకుని నా దగ్గి

రికి వచ్చిన కృష్ణుడు నన్ను పెళ్ళాడాడు," అని కాళింది చెప్పింది.

"నాకు స్వయంవరం ఏర్పాటయి నప్పుడు అనేకమంది రాజులు వచ్చారు. కృష్ణుడు ఆ రాజులందరినీ, జయించి నన్ను పెళ్ళాడాడు," అని భద్ర చెప్పింది.

"మా తండ్రి ఏడు ఆబోతులను ఎవరు గెలిస్తే వారికి నన్నిచ్చి పెళ్ళి చేస్తానన్నాడు. కృష్ణుడు వాటిని మేకపిల్లలనులాగా అవ లీలగా నిగ్రహించి, నన్ను పెళ్ళాడాడు," అని నీళ చెప్పింది.

"నాకు కృష్ణుడు మేనమామ కొడుకే. నాకు అతన్నే పెళ్ళాడాలని ఉన్నదని తెలిసి మా తండ్రి నన్నతనికిచ్చి పెళ్ళి చేశాడు," అన్నది మిత్రవింద.

చివరకు లక్షణ తన వివాహ వృత్తాంతాన్ని ఇలా చెప్పింది:

"మీ తండ్రిలాగే మా తండ్రి బృహత్సేనుడు కూడా ఒక మత్స్యయంత్రం ఏర్పాటు చేసి దాన్ని కొట్టినవారికి నన్నిచ్చి పెళ్ళి చేస్తానని ప్రకటించాడు. నీ తండ్రి ఏర్పాటు చేసిన మత్స్యయంత్రం బయటికి కనిపించక పోయినా, లోపలికి కనిపించింది. కాని మా తండ్రి ఏర్పాటు చేసినది బయటా, లోపలా కూడా కనిపించక, నీటిలో దాని ప్రతిబింబం మాత్రమే, అది కూడా అస్పష్టంగా, కనిపించింది. దాన్ని కొట్టటానికి మా తండ్రి ఏర్పాటు చేసిన బాణాన్ని చాలామంది ఎక్కుపెట్టలేకనే పోయారు. జరాసంధుడూ, శిశుపాలుడూ, భీముడూ, దుర్యోధనుడూ, కర్ణుడూ విల్లు ఎక్కుపెట్టి కూడా నీటిలో ప్రతిబింబాన్ని కనిపెట్టలేక పోయారు. అర్జునుడు ప్రతిబింబాన్ని కని పెట్టి కూడా కొట్టలేకపోయాడు. అప్పుడు కృష్ణుడు వచ్చి, విల్లు ఎక్కుపెట్టి, మత్స్యయంత్రాన్ని కొట్టి, నన్ను పెళ్ళాడాడు."

ద్రౌపదితో బాటు ఈ కథలన్నీ విన్న స్త్రీలందరూ ఎంతో ఆనందించారు.





# కృష్ణావతారం

ద్రౌపదీ, కృష్ణుడి భార్యలూ, ఇతర స్త్రీ జనమూ తమలోతాము కబుర్లు చెప్పుకున్నట్టుగానే పురుషులంతా ఒక చోట చేరి వారి ముచ్చట్లు వారు చెప్పుకున్నారు. ఆ సమయంలో అనేకమంది మునులు బలరామ కృష్ణులను చూడ వచ్చారు. పాండవులూ, మిగిలిన రాజులూ గౌరవపూర్వకంగా లేచి, మునులకు నమస్కారాలు చేశారు. అందరితోబాటు కృష్ణుడూ, బలరాముడూ కూడా వారిని శ్రద్ధాభక్తులతో పూజించారు.

మునులు కృష్ణుణ్ణి కీర్తించి, "నువ్వు మానవరూపం ధరించిన ఆదిదేవుడివి. మేము ఎంత తత్వవేత్తలమైనా నీ మాయకు కట్టుబడిన వాళ్ళమే," అన్నారు.

వసుదేవుడు ఆ మునుల సలహా పైన యజ్ఞాలు చేసి దేవఋణం తీర్చుకుందామని సంకల్పించాడు. యాదవులు యజ్ఞానికి అవసరమైన సంబారాలన్నీ సమకూర్చారు. వసుదేవుడూ, ఆయనకు గల పద్దెనిమిది మంది భార్యలూ స్నానాలు చేసి, కొత్త బట్టలూ, ఆభరణాలూ ధరించి యజ్ఞదీక్ష వహించారు. మునుల సహాయంతో ప్రకృతి యజ్ఞాలూ, వికృతి యజ్ఞాలూ చేసి, అన్ని యజ్ఞాలలోనూ యజ్ఞపురుషుణ్ణి ఆరాధించి, ఋత్విక్కులకు ఆవులనూ, భూమినీ, కన్యలనూ దక్షిణగా ఇచ్చి తృప్తి పరచాడు. యజ్ఞాలు పూర్తి అయిన అనంతరం అవభృత స్నానం చేసి వసుదేవుడు తన బంధుజనాని కంతటికీ విందులు చేశాడు.





ఒకనాడు దేవకీదేవికి ఒక ఆలోచన వచ్చింది. తన కొడుకులు బలరామ కృష్ణులు సామాన్యులు కారు, శక్తి సంపన్నులు. వారు తమ గురువుకు గురుదక్షిణ కింద, చచ్చిపోయిన గురుపుత్రుణ్ణి తెచ్చి ఇచ్చారు. కంసుడు తన కొడుకులను వరసగా చంపేశాడు. అలాపోయిన తన కొడుకులందరినీ వాళ్ళు తిరిగి తీసుకువచ్చి తనకు చూపించ లేరా?

ఆమె ఈ మాటే బలరామ కృష్ణులను అడిగింది. వాళ్ళు అలాగేనని దేవకీదేవికి చెప్పి, యోగమాయ ధరించి, సుతలానికి వెళ్ళారు. అక్కడ బలిచక్రవర్తి వారికి ఘనమైన స్వాగతం తెలిపి, వారు వచ్చిన పని అడిగాడు.

"మహారాజా, పూర్వం స్వాయంభువ మన్వంతర కాలంలో మరీచి కొడుకులు ఆరుగురు, బ్రహ్మ సరస్వతిని మోహించగా చూసి నవ్వారు. అప్పుడు బ్రహ్మ వారిని రాక్షసులుగా పుట్టమని శపించాడు. స్మరుడూ, ఉద్గీథుడూ, పరిష్వంగుడూ, పతంగుడూ, క్షుద్రభువూ, ఘృణీ అనే ఆ ఆరుగురూ మొదట హిరణ్యకశిపుడి కొడుకులై పుట్టి, అనంతరం మా తల్లి అయిన దేవకీదేవి గర్భాన జన్మించి, కంసుడి చేత చంపబడి, ఇప్పుడు నీ రాజ్యంలో ఉన్నారు. వారిని నా వెంట పంపినట్టయితే, మా తల్లికి చూపి, ఆమె విచారాన్ని పోగొడతాను. ఆ తరవాత వారిని ఉత్తమ లోకాలకు పంపుతాను," అని కృష్ణుడు బలితో అన్నాడు.

అందుకు బలి అంగీకరించి ఆ ఆరుగురినీ కృష్ణుడి వెంట పంపాడు. తాను పోగొట్టుకున్న ఆ కొడుకులను చూసి దేవకీదేవి ఎంతో సంతోషించింది. ఆమె వారిని కౌగలించుకుని, తన పాలు కూడా ఇచ్చింది. తరవాత ఆ ఆరుగురూ కృష్ణుడి అనుగ్రహం వల్ల ఊర్ధ్వలోకాలకు పోయారు.





కాలం గడిచిపోయింది. భారత యుద్ధంలో కౌరవ పాండవులు అపారమైన జనక్షయం కలిగించారు. యుద్ధంలో గెలిచిన ధర్మ రాజును సింహాసనం పైన కూర్చోబెట్టి కృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చాడు.

ఒకనాడు కృష్ణుణ్ణి చూడటానికి విశ్వామిత్రుడూ, అసితుడూ, కణ్వుడూ, దూర్వాసుడూ, భృగువూ, అంగిరసుడూ, కశ్యపుడూ, వామదేవుడూ, అత్రి, వసిష్ఠుడూ, నారదుడూ మొదలైన మునులు వచ్చినప్పుడు కొందరు యాదవకుమారులు సాంబుడికి గర్భిణీ స్త్రీ వేషం వేసి వారి దగ్గిరికి తెచ్చి, ఎంతో వినయం నటిస్తూ, "ఈమె తన కే బిడ్డ కలిగేదీ మిమ్మల్ని అడగటానికి సిగ్గు పడుతున్నది. అందుచేత మేమే అడుగుతున్నాం. తమకు తెలియనిదంటూ లేదు గనక దయచేసి చెబుతారా?" అని మునులను అడిగారు.

మునులకు చాలా కోపం వచ్చింది. "మూఢులారా, దీని కడుపున కులనాశన కరమైన ముసలం పుడుతుంది!" అని వారు శపించారు.

యాదవకుమారులు భయపడి పారిపోయి, సాంబుడి బట్టలు విప్పి చూస్తే, అతని పొట్ట నుంచి ఒక ఇనపరోకలి బయ





టికి వస్తూ కనపడింది. వాళ్ళు దాన్ని బయటికి తీసి, "ఎంత పాపిష్ఠి పని చేశాం! ఈ సంగతి తెలిస్తే యాదవులందరూ ఏమంటారో?" అని భయపడుతూ ఉగ్రసేనుడి వద్దకు పోయి, జరిగినదంతా ఆయనకు చెప్పారు.

ముసలం గురించీ, మునుల శాపం గురించీ యాదవుల కందరికీ తెలిసింది. వాళ్ళు ఆశ్చర్యపోయారు, భయపడ్డారు కూడా. ఉగ్రసేనుడు యాదవులతో, ఆ ముసలాన్ని అరగదీసి, దాని పొడిని సముద్రంలో కలపమన్నాడు. యాదవులు అలాగే చేశారు. ఆ పొడి సముద్రపు అలల తాకిడికి ఒడ్డుకు



కొట్టుకు వచ్చి, అక్కడ తుంగ రూపంలో మొలిచింది. ముసలాన్ని అరగదీయగా చివరకు మిగిలిన సన్నని ముక్కను ఒక చేప మింగింది. ఆ చేప ఒక జాలరి వాడికి మరికొన్ని చేపలతో సహా దొరికింది. ఆ జాలరి ఆ చేప కడుపులో కనిపించిన ఇనప ముక్కను తీసుకుని, ఒక బాణానికి ములికిగా ఉపయోగించుకోవటానికి ఒక వేటగాడికి ఇచ్చాడు.

ఈ విధంగా యాదవ వినాశనానికి తగిన ఏర్పాట్లు పూర్తి అయాయి.

తరవాత కొంత కాలానికి ద్వారకలో ఉత్పాతాలు కనిపించాయి. అప్పుడు కృష్ణుడు సుధర్మ సభాభవనంలో యాదవులందరినీ సమావేశపరచి, వారితో ఇలా అన్నాడు:

"అయ్యో, ద్వారకలో మహా దారుణమైన ఉత్పాతాలు కానవస్తున్నాయి. ఇవి కీడును సూచిస్తున్నాయి. మునులు యాదవ వంశాన్ని శపించిన సంగతి మీకు తెలిసినదే. అందుచేత మనం ఒక్క క్షణం కూడా ఈ ద్వారకలో ఉండటం మంచిది కాదు. స్త్రీలనూ, పిల్లలనూ, వృద్ధులనూ శంఖద్వారానికి పంపేద్దాం. మిగిలిన వాళ్ళమందరమూ సరస్వతీ నదీ తీరాన గల





ప్రభాసతీర్థానికి వెళ్ళి, అక్కడ స్నానాలూ, ఉపవాసాలూ చేసి, దేవపూజ చేసి, బ్రాహ్మ ణులకు గోవులనూ, బంగారాన్నీ, వస్త్రాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ, గృహాలనూ దానం చేద్దాం. వారి చేత శాంతికర్మలు చేయింతాం. దేవతలనూ, బ్రాహ్మణులనూ, గోవులనూ పూజిస్తే అన్ని అరిష్టాలూ తొలగి పోగలవు. మనకు శుభం కలుగుతుంది."

యాదవ ముఖ్యులందరూ కృష్ణుడు చెప్పిన దాన్ని ఆమోదించారు. స్త్రీలనూ, పిల్లలనూ, వృద్ధులనూ పంపేసి, యాదవు లందరూ ఓడల మీద సముద్రాన్ని దాటి ప్రభాసతీర్థాన్ని చేరుకున్నారు. కాని అక్కడ వారిని దైవమాయ ఆవరించింది. అందరూ కల్లుతాగి, ఆ మైకంలో కొట్లాటలకు దిగారు. అది తీవ్రమైన యుద్ధంగా పరిణమించింది. ఆ యుద్ధంలో ఏనుగులూ, గుర్రాలూ చచ్చాయి. రథాలు విరిగాయి. ప్రముఖ యాదవుల మధ్య ద్వంద్వ యుద్ధాలు సాగాయి. ప్రద్యుమ్నుడూ, సాంబుడూ పోరాడారు. అలాగే అక్రూరుడు భోజుడి తోనూ, అనిరుద్ధుడు సాత్యకితోనూ, సుభద్రుడు సంగ్రామజితుతోనూ, సుచారుడు గదుడితోనూ, సుమిత్రుడు సురథుడితోనూ యుద్ధాలు సాగించారు. ఇదే విధంగా



మిగతావారంతా కొట్లాటలకు తలపడ్డారు. బంధుభావమూ, మిత్రభావమూ లేకుండా పోయాయి. వెర్రెత్తిన వారిలాగా ఒకరినొకరు చంపుకోసాగారు.

కొంతసేపటికి బాణాలన్నీ అయి పోయాయి. విల్లులన్నీ విరిగిపోయాయి. మరి ఆయుధాలు లేవు. సముద్ర తీరాన ఏపుగా పెరిగిన తుంగ ఉన్నది. దాన్ని పీకి, దానితో ఒకరినొకరు చంపుకోసాగారు. కృష్ణుడు వారిని ఆపాలని చూశాడు. వాళ్ళు అలిగి, బలరాముడి మీదా, కృష్ణుడి మీదా కలియబడ్డారు. కృష్ణుడికి మండిపోయింది. అతనే ఆ తుంగ పీకి, దానితో యాదవులను





ఎడాపెడా చంపేశాడు. మునుల శాపం, కార్చిచ్చు వెదుళ్ళను కాల్చినట్టుగా, యాదవవంశాన్ని నిర్మూలించింది.

అందరూ చచ్చారు. కృష్ణుడు అంతటా కలయ జూసి, "భూభారం తగ్గిపోయింది," అనుకున్నాడు.

బలరాముడు సముద్ర తీరాన యోగ సమాధిలో కూర్చుని ప్రాణాలు వదిలాడు. అది కళ్ళారా చూసి కృష్ణుడు ఒక రావి చెట్టు మొదట్లో, కుడి తొడమీద ఎడమ పాదం పెట్టి కూర్చున్నాడు. ఎర్రని ఆ ఎడమ పాదాన్ని చూసి, అదేదో జంతువు ముఖమనుకుని, జరు డనే వేటగాడు దాన్ని బాణంతో కొట్టాడు. ఆ బాణం ముసలికి ముసలాన్ని యాదవులు అరగదీయగా మిగిలినదే!

బాణం వేసి పరిగెత్తుకుంటూ వచ్చిన ఆ వేటగాడు, తాను మృగమనుకున్నది మనిషి పాదమని తెలుసుకుని, కృష్ణుడితో, "అయ్యో, పొరపాటు జరిగిపోయింది, నన్ను క్షమించు," అన్నాడు.

కృష్ణుడు జరుడితో, "విచారించకు. నేను కోరుకున్నదే జరిగింది," అని వాణ్ణి పంపేశాడు.

ఈలోపల దారుకుడు రథంలో, కృషుణ్ణి వెతుక్కుంటూ అటు వచ్చి, కృష్ణుణ్ణి చూసి, రథం దిగి దగ్గిరికి వచ్చాడు. కృష్ణుడు దారుకుడితో, "నువు ద్వారకకు వెళ్ళి, మనవాళ్ళతో అందరూ చచ్చారనీ, బలరాముడు పోయాడనీ, నేను ఈ స్థితిలో ఉన్నాననీ చెప్పు. మీరెవరూ ఇంక ద్వారకలో ఉండకండి. నేను పోయాక సముద్రుడు దాన్ని ముంచేస్తాడు. నా తల్లి దండ్రులూ, మిగిలినవాళ్ళూ ఇంద్రప్రస్థానికి వెళ్ళి, అర్జునుడి అండన ఉంటారు. నువు జరిగిన దాన్ని గురించి నిర్లిప్తంగా, జ్ఞాననిష్ఠలో బతుకు," అని చెప్పాడు.

దారుకుడు కృష్ణుడికి ప్రదక్షిణం చేసి, చిన్నబోయిన మనసుతో ద్వారకకు వెళ్ళి



పోయాడు. అక్కడికి చేరి అతను ఏడుస్తూ ఉగ్రసేనుడి కాళ్ళమీదా, వసుదేవుడి కాళ్ళ మీదా పడి, యాదవులంతా చచ్చిపోయిన సంగతి తెలియజేశాడు. అందరూ గుండెలు బాదుకుంటూ యాదవులు చచ్చిన చోటికి వెళ్ళారు. వసుదేవుడూ, దేవకీ, రోహిణీ తమ కొడుకులైన బలరామ కృష్ణుల కోసం ఎంతో వెతికారు. కాని వాళ్ళ శరీరాలు కనిపించ లేదు. ఆ ముగ్గురూ గుండెలు పగిలి అక్కడే ప్రాణాలు విడిచారు.

యాదవుల భార్యలందరూ తమతమ భర్తలతో సహగమనం చేశారు. బలరాముడి భార్యలు కూడా బలరాముడి చితి మీదనే కాలిపోయారు. వసుదేవుడి భార్యలూ, కృష్ణుడి భార్యలూ కూడా అలాగే చేశారు.

అర్జునుడు వచ్చి, చచ్చిపోయిన బంధు గణానికి ఉత్తరక్రియలు చేయించాడు. అదే సమయంలో ద్వారకానగరం సముద్రంలో మునిగిపోయింది. నగరంలో ఉన్న దేవాలయం ఒక్కటి మాత్రం నీట మీద కనబడుతూ నిలిచింది.

అర్జునుడు, చాపగా మిగిలిన స్త్రీలనూ, బాలలనూ, వృద్ధులనూ వెంట బెట్టుకుని ఇంద్రప్రస్థానికి వచ్చి, వజ్రుడికి పట్టాభిషేకం చేశాడు. అటు తరవాత పాండవులు ద్రౌపదితో సహా మహాప్రస్థానం వెళ్ళారు.

కృష్ణుడు నిర్యాణం చెందే సమయంలో అక్కడికి బ్రహ్మ, ఇంద్రుడూ, తదితర దేవతలూ, ప్రజాపతులూ, సిద్ధులూ, విద్యాధరులూ, అప్సరలూ వచ్చారు. ఆకాశమంతా వారి విమానాలతో నిండిపోయింది. విమానాల నుంచి పుష్పవర్షం కురిసింది. కృష్ణుడు దివ్యమైన విష్ణువు రూపం ధరించి, తనను చూడవచ్చిన వారి నందరినీ ఒకసారి చూసి, సత్యమూ, ధర్మమూ, ధృతీ, శ్రీ, కీర్తి తనవెంట రాగా, వైకుంఠానికి బయలుదేరాడు.

—(అయిపోయింది)

